## FOREWORD.

Mr. Mahmood Vanderman is Muslim by faith and by conviction, and a very sincere one too. I have rarely seen among those who are converts to the faith any person who is so zealous in its cause.

The present book that Mr. Vanderman has compiled about the Holy Prophet of Islam is the outcome of his love and reverence for the Prophet and does not fail to inspire the reader with a similar feeling. In it are collected together many extracts from the writings of men of various nations— European as well as Indian — who though not Muslims themselves, have felt constrained to pay the highest tribute to the Prophet's work and teachings and to acknowledge the greatness of Islam both as a religion and as a practical rule of life.

Mr. Vanderman intends to publish translations of this work in the local vernaculars—Telugu, Kanarese and Marati. I consider that this is a very good idea as it will help to spread a correct knowledge of Islam and dispel any false notions or prejudices that may still exist in the minds of men who have not given sufficient thought to the subject.

I wish him every success in this enterprise.

Hyderabad-Dn.
*14th August 1935*

**MAHDI YAR JUNG.**

# PREFACE.

In adding this " Anthima dharma sasthropa desakudu " a free translation of my book " The Last Law Giver, " to the existing islamic literature I owe a word of explanation to Andhra Country. It is my design in publishing this book, as could be readily understood, to popularise the practicable principles and precepts of the holy Prophet for which I find an immediate urgency as the rising generations are insatiable to assimilate inspiring aspirations that stop them from marching to a dangerous future. Muhammed, the man with the attributes of God in him, a veritable prophet, a keen statesman, a dynamic force and above all a shrewd reformer, is the dominating personality that the east, especially, India needs to-day for a healthy accommodation of divergent schools of thought.

Heaps of Islamic literature are available but not in telugu language and what little could be found in telugu, is either a fictive immagination or a rigid orthodoxy spiced with dogmatic views impenetrable for unbiased scrutiny. The following pages present the true picture of the holy prophet's life in its natural colour and simple beauty which can never fail to impress all those that read the record of life so liberally enriched with astounding

episodes from the pen of one who probed deep into a comparative study of various religions and records the naked facts as they are. Islam dose not draw a clear cut-line between life here and life hereafter, body and soul, this world and the next world, as the life of Muhammed is a gradual and steady growth of spiritual life in temporal body buoyant and jubilant tending an evolutionary progress conducive to a happy and contented everlasting life.

I am convinced that there are millions of telugu knowing people to whom a correct presentation of the life-history of the holy prophet is but a necessity. The prophesying foreword of Hon. Nawab Mahdi Yar Jung Bahadur, went a long way to ruffle up a spirit in me to produce this telugu book without the least hesitatian to think of the arduous vork and financial difficulties I had to combat and I am grateful to Honourable the Political Member for his encouraging and guiding good-will.

I have great pleasure in acknowledging the debt of gratitude I owe to the following highly laced nobility for their moral and material help:- Nawab Salar Jung Bahadur, Nawab Lutuf-ud-Dowlah Bahadur, Rt. Hon. Sir Akbar Hydari, Nawab Rafat Yar Jung Bahadur, Nawab Mehdi Yar Jung Bahadur, Nawab Fakher Yar Jung Ba-

hadur, Nawab Muzaffer Nawaz Jung Bahadur, Nawab Akhther Yar Jung Bahadur, Nawab Dost Muhammud Khan, Messrs Fazal Muhammad Khan, Liakatullah Khan, Aliuddin Ahmed Director, Ecclesiastical Department, Syed Kurshid Ali, Md. Abdul Basith Khan Subedar, Warangal, Syed Arifuddeen, Abu Turab, Md. Anwarullah, M. Azmatullah, Md. Abdul Muqeed Khan.

Thanks are also due to my wife, Mrs. S. Vanderman, who came to my aid and almost rescued me from a crushing burden by translating the english version into telugu and correcting the proofs.

May this quench the thirst of every truth seeker and lead him to the horizon of perfection and the province of perpetual happiness.

*1st March 1936*
Hyderabad-Dn.

**M. Vanderman**

# విషయసూచిక.

ప

## ఒకటవ అధ్యాయము.



## రెండవ అధ్యాయము.



## మూడవ అధ్యాయము.



## నాల్గవ అధ్యాయము.

పుట.

పుట



## ఐదవ అధ్యాయము.



## ఆఱవ అధ్యాయము.



## ఏడవ అధ్యాయము.



## ఎనిమిదవ అధ్యాయము.

# ఒకటవ అధ్యాయము.

---

## ఆమోదింపబడిన ప్రవక్త ఆగమనము

మానవుల దుష్క్రియల ప్రకారము, ప్రపంచమంతయు పాపభూయిష్టమైపోయినది. పరిశుద్ధ ఖురాను, 30:41.

లోకము నశించిన పిదప దానికి పునర్జీవమొసగువాడు అల్లాయని యెరుగుడి.—56 : 17

ఈ కథయందలి సుప్రఖ్యాతమగు శిశువు జన్మింపక పూర్వము, ప్రపంచమునందుండిన పాపమునుగూర్చి దైవోక్తియగు గ్రంథము పైవాక్యములవలన ప్రచురించు చున్నది. మనోశారీరాత్మల మరణము మనుష్యుల నావరించుటచేత, ప్రజల నమ్మకలు మాటువడి, వారిక్రియలు దుర్మార్గముల నవలంభించెను. యూదా, హిందూ, బౌద్ధాదిమతములు వాని నవలంభించువారి నాకర్షించకుండెను. ఈ మతములన్నియు తప్పుడు త్రోవలు త్రొక్కుచుండెను. ప్రజలయొక్క మతోద్దేశమెల్లయు విగ్రహ పూజాప్రతి బింభమైయుండెను. మరణించిన వారి ఆత్మలను పూజించుచుండిరి. వారివిగ్రహములను గౌరవించుచుండిరి.

"ఏడవ శతాబ్ధము నాటి క్రైస్తవులు తెలియనిరీతి అన్యమతము నవలంభించిరి; తూర్పు దేశపు గుడులను కళంక పరచుచుండిన ప్రతిమలకు వారి రహస్య భహిరంగ ప్రార్థన లర్పించుచుండిరి. హతసాక్షులను, భక్తులను, దైవదూతలను ప్రధానమైన వారిగా నెంచుటచేత, సర్వశక్తుని సింహాసనమునకు లోటువాటిల్లినది; అరేబియాలో విస్తరించుచుండిన కాలి రీడియన్ వారు, మేరీకన్యను దేవతగా పరిగణించుచుండిరి. త్రిత్వావతార చిత్ర ప్రభ అద్వైత సిద్ధాంతమునకు ప్రతికూలముగానుండెను. వారిగ్రహింపు ప్రకారము సమానమగు ముగ్గురు భగవానులుకలరనుచు జీజసు దేవుని కుమారుడను చున్నారు. పూర్వాచార విచారము దానియందు నమ్మికగల వారికి తృప్తికరముగాయుండెను. ముహమ్మదుయొక్క మతము యిటువంటి ద్వందాభిప్రాయ 'సంయుక్తమైనదికాదు. ఏక దైవీకమునుగూర్చి ఖురాను ఘోషించుచున్నది"- గిబ్బన్.

"అప్పటి సాంఘికపరిస్థితులు దుర్భరముగా యుండినవి. న్నిమతములవారు సన్మార్గవిముఖులగుటయకాక, దుర్మార్గమె సన్మార్గముగ వారికి గోచరించుచుండెను. దేవుని దయ కుపాత్రులగుటకు భయంకరమగు పాపమును జేయుచుండిరి. జనాంగములన్నియు నీతిదప్పియుండెను. ఎటుజూచినను పాపమే

కనబడుచుండెను. ఇది ప్రమాద జనితమగు వర్ణనముగా కాన రావచ్చును కాని, ముమ్మాటికిది సత్యము. ఇది యూరపు దేశముయొక్క మధ్యకాలమనియు, ప్రష్యాయొక్క మెజ్జాయిక్, ఇండియాయొక్క పౌరాణిక కాలములనియు చదువరులు గ్రహింపవలయు. మతాచారమిష క్రింద, ఇంచుమించు నరహత్యతో సమానమగు అక్రమసంభోగము చేయుచుండిరి. మతము దాని నమోదించుచుండెను. క్రైస్తవుల "ఒప్పుదల" ఆచారముద్వార పాపమధికమగుచుండెను గాని తగ్గలేదు. క్రైస్తవుండును, గౌరవింపబడిన ధర్మశాస్త్రోద్ధారకుండునగు జస్టేనియను నాటి కాన్సాంటినోపిలుయొక్క స్థితి క్రైస్తవ దేశమునంగల సాంఘికదుర్భర దుర్వారమునకు ముఖపత్రమైయున్నది. రహస్యమందైనను భహిరంగమందైనను జరుగుచున్న నీతిక్రియ లకు సంఘమున నేలాటి యెన్నికలేకుండెను. వేశ్యసీజరుల సింహాసనము నలంకరించుచు, చక్రవర్తితో సమానముగా రాజ్యాంగ గౌరవములకు పాత్రురాలగు చుండెను. తియడోరాయను వేశ్య తన వ్యాపారమును కాన్సాంటైనను నగరమున నిర్భయముగా సాగించుటవలన, ఆయూర నామె పేరు తెలియనివారు లేకుండిరి. ఆదే నగరమున, ధర్మకర్తలు, బిషపులు, సేనాధిపతులు, చక్రవర్తులు, ఆమెను రాణివలె కొని

యాడుచుండిరి. సాంఘిక వైధిక ధర్మ విచక్షణ కిసుమం తయు జోటులేని ఆ యమ క్ర్యూరకృత్యముల వలన రాజ్యము అవమాన భరితమయ్యెను. పూజారులు దుర్మార్గ పరివర్తనల నభిలషించుటచేత, రాజద్రోహము, సంఘర్షణలు, హత్యలు, దేశమునందను దినకృత్యములగుచుండెను. వీనివిమర్శించు సంద ర్భమున, మానవధర్మమేకాదు, దైవికధర్మముకూడ కాలిక్రింద ధూళీగా నెన్నబడుచుండెను. గుడిగోపురములు భయంకరమగు హత్యలచేత కళంకమగుచుండెను. ఇటువంటి దుష్క్రియలులేని స్థలమేలేకుండెను." * సైప్రసు సోదరుడగు అర్టక్సారుకెస్ నెమన్ అనేక శతాబ్ధములకు పూర్వము పర్షియాలో ప్రవేశ పెట్టిన ఫాలికువిధానము అభివృద్ధినొందుచు మెజ్దాకు కాలానికి బహుస్త్రీజన సాంగత్యము ద్వారా దుర్భర రూపముదాల్చినది. మెజ్దాకు పాపమును పరిశుద్ధతగా పరిగణించుచుండెను. హిందూ దేశమునందు కూడ యిట్టిఅక్రిమ సంభోగము మక్తక త సిద్ధాంతము క్రింద ప్రభలు చుండెను. మక్తక త వైరాగ్యమువలన, పూజారి, యితరుల భార్యలతో అధి కార పూర్వకముగా స్నేహించవీలున్నది. సాధారణముగా, గర్భాదాన దినములు పూజారులతో జరిగిపోవుచుండెను.

---

* రైట్ ఆనరబిల్ సర్ సయ్యదు అమీర్ అలీ స్పిరిటాఫ్ యిస్లాము.

స్త్రీలు నిరుత్తరులై యిట్టి సాంగత్యమున కొప్పుకొనుచుండిరి. ఇది ధర్మసమ్మతమైన కార్యమనియు తద్వారా తమ జీవితము తరించుననియు వారు నమ్ముచుండిరి.

ఇటువంటి దుర్భర స్థితి హెచ్చు పెరుగుచున్న సమయాన 13½ శతాబ్దముల క్రిందట క్రీ. శ: 571 సంవత్సరము ఏప్రెలు 2 వ తారీఖున అరేబియా దేశములోని మక్కా పట్టణమున నొక శిశువుదయించెను. ఈ పట్టణము ఎఱ్ఱ సముద్రమునకు దాదాపు నలువది మైళ్ళదూరమున నున్నది. ప్రతిదినము ప్రపంచమున నుదయించు వేనవేల శిశువులలో నీశిశువు నొకండైనను, ఇతఁడు భావికాలమును భ్రమింపఁజేయునట్టియు ఆశ్చర్యకరమైనట్టియు కార్యములను జేయుటకు నియమింపఁబడెను. ఈశిశు వుదయించుటవలన నతని దగ్గఱి బంధువులలో సంతోష దుఃఖములు గలిగెను. తనపితరుల వంశమంతరింపకుండ నది లోకములో స్థిరముగా నుండునట్లు చేయుట కొక శిశు వుదయించినందున సంతోషము కలిగెను. కాని అతని జన్మము తన తల్లికి, ఇంతకుముందే చనిపోయిన తన యౌవన భర్తను స్మరణకుఁదెచ్చుచుండెను. తాతకు తన విధేయుడగు తనయుని జ్ఞప్తికి తెచ్చుచుండెను, అతని ముఖవైఖరి, అతని మనోహర మగు చిఱునగవు, తానింతకుముందే జన్మించిన లోకములోని విషయములను విచిత్రముగా వీక్షించు వీక్షణములు, వేయేల, అతనికి సంబంధించిన విషయములన్నియు అనాధ యగు

భార్యకు భర్తను స్మరణకుఁదెచ్చు చుండెను. తాతకు ఇంతకు మున్ను ఏడు నెలల క్రిందట ప్రియులబాసి తన సృష్టికర్త యొద్దకు వెళ్లిపోయిన కుమారుని జ్ఞప్తికిఁదెచ్చుచుండెను. మృతుఁడైనవాని పేరు మాసిపోకుండునట్లు చేయుట కీ బాలుని జన్మము సాధనభూతముగా నుండుటచే దుఃఖమున కన్న సంతోషమే యతిశయించెను.

## అరబ్బీయుల యుత్పత్తి

అరబ్బీయులు తమ పితరులను మూడు వంశములగా విభజింతురు:—

1. అరబ్ -ఐ- అరిబా: వీరు అరేబియాలోని ఆదిమనివాసులు. వీరు, పైనుదహరింపబడిన శిశువు జన్మింపక పూర్వమే అంతరించిరి. కాని వారి పాడుబడిన గృహములను నేటికిని జూడవచ్చును.

. అరబ్ - ఐ -ముతారిబా: వీరు ఆదిమ వాస్తవ్యులలోనుఁడి అరబ్బీయులుగా మారినవారు. ప్రస్తుతము వారు అరేబియా యొక్క పరిసర ప్రదేశముల నాక్రమించి యున్నారు. ముఖ్యముగా యమన్ వారి స్థానము.

అరబ్-ఐ-ముస్తారిబా: వీరు పరస్పరసంబంధ బాంధవ్యమువలన ఆరబ్బీయులైనవారు. అబ్రహాము కుమారుఁడైన

ఇష్మాయేలు సంతతివారు. వీరు హెజాజ్ యెడారిలో నివసించుచుండిరి. కొరేషువంశము వీరిలోనిదే. మన బరిశుద్ధశిశువు కొరేషు వంశమునకు సంబంధించినవాఁడు. ఆశిశువు క్రీస్తుకు ముందు 130 సంవత్సరముల క్రిందట జీవించియున్న ఎడ్నాను అను నాతని వంశావళి లోనివాఁడు. ఎడ్నాను యిష్మాయేలు వంశీయుడని తీర్మానింప బడినది.

క్రీ. శ. 200 వ. సంవత్సరమునందు, అల్-కొరేషు అను మారుపేరుగల ఫీహరు అనబడు ఎడ్నాను వంశీయుడు తన స్వజనులయందు పేరు ప్రఖ్యాతి వడసెను. అతని వంశీయుడగు కోసె, కాబా మందిరపు చుట్టుప్రక్కలనొక పట్టణమును కట్టించి నడ్వాయనబడిన సభను నడ్వాయనబడు గృహమున స్థాపించెను. ఇప్పుడక్కడ హానఫీముస్సలా స్థాపింపబడినది. ఇది కాబా గోడకు దాదాపు25, లేక 30. గజములదూరమందున్నది.

## మక్కానగర స్థాపకుడు

కోసే మిగుల అధికారము వహించిన వాఁడనవలయును. మినాలో మూడుదినములవరకు విడిది దిగుపేద యాత్రికుల భోజన సౌకర్యముల కొరకు రఫీదాయను పన్నునీతఁడు విధించి యుండెను. మక్కా (సికయా) యందలి బావులపై నీతనికి

సర్వాధికారముండెను. కాబా (హిజాబా) యొక్క తాళపు చెవి యీతని యధీనమునందుండెను. "ఆయన పాలకుండు, న్యాయమూర్తి, ప్రధాన మతగురువు" అని కీర్తిశేషులైన ఆనరబిల్ సర్ సయ్యదు ఆమీరా అలి చెప్పుచున్నాడు. ఆయన క్రీ. శ. 480 లో చనిపోయెను. కోసె పరిపాలన క్రింద యెమను, సిరియా, మెసపోతేమియా, ఐగుప్తు దేశములతో కొరేషు సంతానము వ్యాపారము చేయుచు మిగుల ధనసంపన్నత గలదాయెను.

కోసేకు నలుగురు పుత్రులు. నాలుగవవాడు అబ్దుమినఫ్. ఇతని వంశమునుండియే ఈ కథానాయకుండుదయించినాండు. అబ్దు మినఫ్‌కు నలుగురు కొడుకులుండిరి. వారిలో హాషిం మిగుల ధనవంతుండు. హాషిం పిదప షీబా అధికారము వహించెను. ఇతనిని ముతాలిబ్ అనికూడా పిలుచుచుండిరి. ఈతనికి గర్భఫలము లేనందున, పదుగురు కుమారులు కలిగినచో, వందొకనిని కాబా మందిరముకడ నర్పింతునని ప్రమాణము చేసెను. పిదప అతనికి పన్నెండుగురు కుమారులును, ఆర్గురు బిడ్డలును కలిగిరి. అర్పణచేయ బడుట అబ్దుల్లా వంతుగా తేలినది. ఐతే యీవిషమ పరిస్థితి నూరు ఒంటెల నిచ్చుట ద్వారా తప్పిపోయినది. పూర్వము ఒక మనుజుని ప్రాణము నూరు ఒంటెల క్రయధనమువలన దొలగించ వీలుండెను.

# పరిశుద్ధ శిశుజననము, బాల్యము.

అబ్దుల్ ముతాలిబ్ కొడుకైన అబ్దుల్లా అమీనాను పెండ్లాడిన మరుసటి సంవత్సరము, అరేబియాయొక్క చరిత్ర యందేకాక ప్రపంచ చరిత్రయందు ప్రాముఖ్యమైన సంవత్సర ముగా నెన్నబడుచున్నది. యమనుయొక్క అబిస్సీనియా రాజ ప్రతినిధియగు అబ్రహా ఈసంవత్సరమునందు మక్కానగరము పైకి ఏనుగులదండుతో దాడి వెడలి యుండెను. అందువలన ఈసం వత్సరము కరివర్షమన బడుచున్నది. దేవుడే అబ్రహాను శిక్షిం చెను. అతడు తనసేనలతోసహా మిగుల దుస్థితినందెను. ఇదైన కొంతకాలమునకు, (ప్రస్తుతము మదీనాపట్టణ మనబడుచున్న) ఎత్రాబుకు పోవుచుండగా అబ్దుల్లా తన యిరువదియైదవ యేట మరణించెను. అతని మరణానంతరము, సోమవారము నాడు, కరివర్షమగు రబ్బియుల్ అవల్ యొక్క 12 వ తారీఖున పరి శుద్ధమైన శిశువు జన్మించెను. అప్పటికి అబ్రహా సైన్యమునాశన మై ఏబది దినములైనది. అనాథుడగు నీబాలునికాతని తాత "ముహమ్మదను" నామధేయ మొసగెను. అతడు తనతల్లి సంరక్షణమునను, తనచిన్నాయన యగు అబుతాలిబ్ చేనియో గింపబడి పాలిచ్చుదాది సంరక్షణమునను దినదినాభివృద్ధి నం దుచుండెను. అతని బాల్యదశలో కొన్ని సంవత్సరములవరకు నాతడు ఎడారి ప్రదేశమునందే యుండెను. తమబిడ్డల సంరక్ష

ణార్థమును, వారికి పాలిచ్చి పెంచు నిమిత్తమును వారిని చుట్టు పట్లనున్న గ్రామపు స్త్రీల కప్పగించుట మక్కా జనుల యాచారమై యుండెను. తమబిడ్డలు అనారోగ్యకరమగు పట్టణపు గాలిని శ్వాసింపకుండ పల్లెలలోని నిర్మలవాయువును శ్వాసించి ఆరోగ్యవంతులై యుండవలయు ననుటయే యీ యాచారపు ముఖ్యోద్దేశము. మక్కాకు ముప్పది లేక నలువది మైళ్ళదూరముననున్న గ్రామాదుల స్త్రీలు అప్పుడప్పుడు పట్టణమునకు వచ్చి నూతనముగా జన్మించిన శిశువులను పాలిచ్చి పెంచునిమిత్తమై కొనిపోవుచుందురు. వారట్లుపెంచి మరల నాశిశువులను తను తల్లిదండ్రుల కప్పగించి విశేష ధనమును బహుమానముగా వడసిపోవుచుందురు. మహమ్మదు జన్మించిన తరువాత కొందరు పల్లెటూరి స్త్రీలు మక్కాకు రాఁగా వారిలోనొకరు తన కుమారుని సంరక్షించవలెనని తల్లి యూరడిల్లుచుండెను. కాని యీ పిల్లవాఁడు అనాథుఁడని తెలియుటచేతను, అట్టివాని పెంచుటవలన తగినబహుమానము దొరుకదని యోఁచిగిన వార ఁటచేతను ఏస్త్రీయును అతనిని పోషింప సాహసింపదాయెను.

రాజులకు రాజును, చక్రవర్తులకు చక్రవర్తియు కాఁగలిగిన ఈ బాలుని యెవరికిచూపించినను ఏస్త్రీయు నంగీకరింపదాయెను. భగవదుద్దేశములు విచిత్రములు గదా ? ఈ ధన్యుడగు శిశువు యొక్క తల్లికి కావలసిన యాధరణయు, బాలుఁడు గ్రామాదుల లో పెరుగు సౌకర్యములును దైవమింతకుముందే చేసియుం

డెను. ఇట్టితరుణమున బిడ్డలనుపాలిచ్చి పెంచ నేతెంచిన స్త్రీలలో హాలీమా యను నొకతె యుండెను. ఆమె కడుబీదరాలు. ముహమ్మదు ప్రీతి దాదివలన నిరాకరింప బడిన తెరంగున నీపేద రాలగు హాలీమాయు, తల్లులవలన నిరాకరింపబడెను. ఆమె బీదదైనందునను, బిడ్డలను బీదలపరము చేయని కారణమున, నామె నిరాశ జెందవలసివచ్చెను. తన కేబిడ్డయు దొరుకకపోగా, యీ తండ్రిలేని బిడ్డనైన చాకవలెనని నిశ్చయించుకొనెను. తనతోడివారల పరిహాసమున్నుండి తప్పించుకొనుటకామె యీ లాగు చేసెను. పాలిచ్చు కాలమైపోయిన తరువాత హాలీమా ఆయనను తీసుకొనివచ్చి తల్లికప్పగింపగా ఆమె ఆయనను మదీనలోనున్న తన తల్లిదండ్రులయొద్దకు తీసుకొని పోయెను. మదీనలో కొంతకాలముండి మక్కాకు తిరిగి వచ్చుచుండగా మార్గమధ్యమమున ముహమ్మదుతల్లి చనిపోయెను. ఆరేండ్ల ప్రాయమప్పుడే తనకడుగూర్చు తల్లిప్రేమ తొలఁగి పోయెను. ఎవరో యొకరాతనిని మక్కాలోనున్న తనతాతయొద్దకు గొంపోయిరిగాని, తాతయు మూడేండ్లలో లోకాంతరగతుఁ డయ్యెను. మానవకోటి హృదయాలయములను వశీకరించువాఁడు, దేవునియొక్క వెలుగైనవాఁడు అబ్రహాము యొక్క ప్రార్థన ఫలము, నిరాధారముగా విడువబడియుండెను. తనకు తల్లిదండ్రి లక్క చెల్లెండ్రు అన్నదమ్ములు లేకుండిరి. ఏకాంత కాలము తనతల్లితో నుండిన సంరక్షణమో తప్ప యితరబం

ధుత్వ సంబంధము లేవియు నాతనికి తెలియకుండెను. ఆయన జన్మించుటకు పూర్వమే తండ్రిచనిపోయెను. అక్కచెల్లెండ్రు అన్నదమ్ము లాయనకు లేనేలేరు. ఆయన తన బాల్యమును గొప్పయిండ్లయందైనను, విద్యార్థులమధ్యనైనను గడుపలేదు. ఆయిండ్లలలో భోజనము క్రమముగా వడ్డింపబడు నాచారము లేకుండెను. అక్కాలపుఆర్థిక సాంఘిక పరిస్థితులవలన యిప్పటి నవీనబల్లభోజన మర్యాదల నవలంబించుటకు వీలులేకపోయెను. భోజన సమయమున పిల్లలందఱు తల్లిచుట్టుగుమిగూడి ఆహారమునిమిత్తమై గోజులాడుచు ప్రతివాడును తక్కినవారికన్న నెక్కుడు భుక్తిలాగుకొనుటకు ఆతురపడుచుండెడివాడు. కాని యిట్టి యలవాటు మహమ్మదునకు లేకుండెనని అబుతాలీబ్ యొక్క పనికత్తె చెప్పుచున్నది. పిల్లలందఱిట్టి హీనమగునలవాటు కలవారైయుండగా మహమ్మదు తనపినతల్లి పెట్టువరకు నొంటరిగా నొకచో కూర్చుండి తనకీయబడిన పదార్థమును సంతోషముతో తినేనాడు. దేవుని వెలుగు అరేబియాయొక్క యెడారి కొండలపై తాండవించుచుండెను. ఆయనకు మాత్రము దేవుఁడే సమస్తమై యుండెను. ఆయన మనుజులతో విశేషముగా స్నేహముచేసినట్లులేదు. ఎల్లప్పుడు ప్రకృతి మహిమయందాయన మనసు లీనమగుచుండెడిది. సూర్యచంద్ర నక్షత్రములు, పక్షులు. వనమృగములు, వర్షములు మేఘములు, వృక్షములు మొదలగు వానితో నాయన సంభాషించుచుండెడి

వాడు. అయన వికసించు ప్రతిపుష్పమునుండి తేనెనుగ్రహించు తేనెటీగవలె, తనపాఠములను గంభీరమగు ప్రకృతి విద్యాల యమున నేర్చుకొనుచుండెను. అయన వెదకెడు తేనె ఆత్మీయా మృతము. తనపన్నెండవయేట, ఆయన తనచిన్నాయనయగు అబుతాలీబ్ వెంట సిరియాకు వెళ్లెను. అచ్చట జార్జియసు లేక సర్జియసు అనబడిన బహీరాయను భక్తునివలన భావికాలపు ప్రవక్తగాను వారందరిలో ప్రజ్వలితమగు నక్షత్రముగను తీర్మానింపబడెను. తనపదునాలవయేట బినావుహాలాజీ అను యుద్ధమునందుండెను గాని యుద్ధమునందెట్టి పాలుపుచ్చుకొన లేదు. ఆయన తనకాలమంతయు తదేకధ్యానమునందును, సత్ప్ర వర్తనాభి వృద్ధియందును గడుపుటవలన, తన వైభవము నాల్గు దిశల గ్రమ్ముకొనెను. అందువలన చుట్టుప్రక్కల నున్నవారు ఏకగ్రీవముగా అయనను "అల్ అమీన్" అనిపిలచిరి. దీనికి విధేయుడనియు నమ్మదగినవాడనియు, అర్థము. అయనకు పూర్వమెవరికికూడా ముహమ్మదను నామకరణ లేకుండెను. ముహమ్మదనగా " నుతింపబడినవాడు " అనిఅర్థము. అల్ అమీన్ అనికూడ ఎవరును పిలువబడియుండలేదు. ఈవిధము గా ఆత్మావలోక ప్రపంచమునకు వేకువ చుక్కయని మాన వులు ప్రకటించుచుండిరి.



# ఆయన యుదారభావము.

ఇరువది యేండ్ల ప్రాయమప్పుడు ముహమ్మదు ఒక సమాజములో జేరెను. ఈ సంఘములో జేరిన వారందరును, తమ తెగకు చెందినవారైనను, చెందని వారైనను, ఆపదలో నున్నయెడల అట్టివారిని విడిపించుటకు శపథము చేయుట కట్టడయై యుండెను. ఈ సమాజమువారు శత్రుపీడితులైన వారి హక్కులను తిరిగి వారికిసంపాదించి యిచ్చుచుండిరి. కావున తన యౌవనమునందు ఎవడేని పీడింపబడెనని తెలిసెనేని వెంటనే పీడితుని పక్షముననిలచి అతనికి న్యాయము జరుగువరకు ముహమ్మదు నిదిరించువాడు కాడు. ఈ దిగువ నుదహరింపబడిన పరిశుద్ధ ప్రవక్త వాక్యములను పాఠకులు తమ మనసు నందుంచుకొనినచో నెంతో సహాయకరముగా నుండును. "ఆదాము నిర్మింపబడక పూర్వము రెండువేల సంవత్సరముల క్రిందట అత్యున్నతమైన దేవునియొద్దనేను వెలుగునై యుంటిని. ఈ వెలుగు దేవునియొక్క మహిమను కొనియాడు చుండెను. దేవుని దూతలుకూడా ప్రస్తుతించుచుండిరి. అత్యున్నతుండైన దేవుడు ఆదామును నిర్మించినప్పు డాతనిమంటిలో ఈ వెలుగు నునిచి, నన్ను ఆదాము వీపుపైన, భూమికి పంపియుండెను. పిదప నోవావీపుపైనుంచి నావలో నన్ను లేపి, దేవునిస్నేహితుండైన అబ్రిహాము అగ్నివైపు బడద్రోసి ఆయన వీపుపై

నన్నునిలిపి యీవిధముగా • నిర్మలులగు భక్తుల మూలమున మార్చుచు కడకు భగవత్సంకల్పిత మగు నాతలి దండ్రుల సంయుక్తమువలన నన్నవతరింపజేసెను." ముహమ్మదు యీ మాటలుకూడా పలికియుండెను. "నేను నాజనకుడగు అబ్రిహాము ప్రార్థనాఫలితము." ఈ వెలుగుయొక్క సక్రియ మగు నభివృద్ధియు, మానవకోటి నుద్ధరింపు యదారపురుషు డుచ్ఛరించిన ప్రార్థనయు గలసి భూగోళము పయినింగల అధిక సంఖ్యాకులు నిర్విణ్ణులై శాంతియుతమగు మతము నాలింగనము జేయ కారణమైనది.

# ఆయన వివాహము.

ఆయన పవిత్ర గుణములును నీతివర్తనమును లోకమునకు వెల్లడి యగుచుండగా కోసేవంశ సంభూతురాలును భాగ్యవంతురాలగు ఖథీజాయను నొక మక్కావర్తకురాలు లాభములో చెరిసగము నిచ్చుషరతుమీద సిరియాకు వర్తక వ్యాపారము నిమిత్తము ముహమ్మదునుపంపుటకు తనకొలువులోనుంచుకొనెను. ఖథీజాతన బానిసనొకనిని ఆల్ అమీన్ వెంటనుంచెను. ముహమ్మదు తనకప్పగింపఁబడిన పనిని మిక్కిలి తెలివితేటలతోను, నమ్మకముగాను నిర్వర్తించి ఖథీజా అనుకొనిన దానికంటె యెక్కువలాభమునుసంపాదించెను. ఆయన

సదయ హృదయము, సత్ప్రవర్తనము ఖదీజా బానిసనుబ్రమిం ప జేసినవి. తిరిగివచ్చిన తరువాత ఆ బానిసీడు ముహమ్మదు యొక్క సుగుణ సంపత్తినిగూర్చి తనయజమానురాలికి పూస గూర్చినటుల వినిపించెను. ఆ బానిస మాటలకాశ్చర్యపడి ఆమె ముహమ్మదును వివాహమాడ నిశ్చయించెను. ముహమ్మదు అందులకు సమ్మతించెను. అప్పటికి ఖదీజాకు నలువదియేండ్ల వయస్సు. ముహమ్మదుకు యిరువదియైదు. ఇది ఆత్మీయ సంబంధమైన బాంధవ్యము; భార్యాభర్తలన వీరెతగుదురు. ఆయనకు ముగ్గురు కుమారులు నలువురు కుమార్తెలును కలిగిరి, మొదటివాని పేరు ఖాసీము. అందువలన పరిశుద్ధుడై నప్రవక్త అబ్దుల్ ఖాసీమనబడుచున్నాడు. అనగా ఖాసీము యొక్క తండ్రి. ఏకారణముచేతనో కుమారులు బాల్యదశ యందుండగనే వేరుకావలసివచ్చెను. తన వివాహానంతరము ఆయన ఒకసమాజము నేర్పాటుచేసెను. దానిపేరు ఫసల్ సంఘము. ఈ సంఘముద్వారా జూహ్రిలేక ఫసల్ వంశము నందలి పెద్దలందరును యితరులను సంరక్షించుటకు శపథము చేసియుండిరి. మక్కావారు విదేశీయులు బానిసలు, స్వేచ్ఛాం తరంగులు అను విచక్షణ లేక మక్కా పరిసరగ్రామ ప్రదేశ మునందెవరిపక్షము అన్యాయము జరిగిన వారి పక్షమీ సభ వారుసలచి న్యాయపరిశీలన జేయుచుండిరి. ముహమ్మదు దేవుని చేతప్రవక్తయని తేల్చబడక పూర్వమే ఈవిధముగా అబ్రహాము

యొక్కప్రార్థన ఆయనయందు ఫలించుచుండెను. నూతనోత్తేజము అప్పుడప్పుడే అంకురించుచుండెను. ఈవెలుగే ముక్తికర్తయొక్క మూర్తీభవమని చెప్పుటయందతిశయోక్తిలేదు. ఎందుకనగా ఆయనద్వారా అసూయ, భక్తిహీనత, హింస, బానిసత్వము, భౌతికరీతినేగాక ఆత్మీయముగ కూడా నిర్మూలింపబడెను. ఆయన తర్వాత ప్రపంచమునకు గలిగిన విజ్ఞానమంతయు, యేదోయొక విధముగా ఆయన ప్రసరింపజేసిన తేజస్సుపై నాధారపడియున్నది.

## బానిసల స్వాతంత్ర్యము.

ఖదీజా యనునామె మహమ్మదును వివాహమాడగనె మొట్టమొదట ఆమె బానిసలతోసహా తన ధనధాన్యములను మహమ్మదు పరముజేసెను. వెంటనే ఆయనబానిసలందరిని స్వతంత్రుల గావించెను. అన్ని సాంఘిక వ్యవహారముల కునికిపట్టైన బానిసత్వమును, కడుదీర్ఘకాలమునుంచి నిర్మూలింప దలంచుచుండిన వృద్ధనాయకుల చేతగానిపని, యౌవనుడైన మహమ్మదు అవలీలగా చేయగలిగెను.

## కాబా మందిర పునర్నిర్మాణము

ఆయన ముప్పది యైదేండ్ల వాడగునప్పుడు క్రీ. శ. 605వ సంవత్సరమునందు, అంతకుపూర్వము అగ్నిప్రమాద మొందిన

కాబానుమరల కట్టుటకు కొరేషువారు తీర్మానించుకొనిరి. ఈ గృహనిర్మాణ సందర్భమున పరస్పరవిభేదము లత్యధికముగా పెచ్చుపెరిగినందున, ప్రఖ్యాతి గాంచినటువంటి నల్లరాయి (శ్యామలపాషాణము) నిర్ణయస్థానమున నుంచుటకు వీలులేక పోయెను. ఆరాతిని నిర్ణయస్థానమునందుంచుట కెవరు అర్హులని కొరేషునందలి వివిధశాఖలవారు వాద ప్రతివాదములు సాగించిరి. వారిలో రెండుశాఖలవారు, తమయర్హతను దృవపరచుచు, యితరులెవరైనను ఆరాతినిముట్టుట ధర్మముకాదనియు, అట్లుతమ తీర్మానమును కార్యసిద్ధిగాంచుటకు ప్రాణములైన త్యాగము జేసెదమంచు నెత్తుటిపాత్రలో తమచేతులను కడుగుకొనిరి. ఈ సంఘర్షణవలన కలుగనైయున్న యుద్ధమునాపు విధానములు వెదకుటకు, అప్పటికాపనినిలిపిరి. కాబాయందొక సభ సమావేశ పరుపఁబడెను. ఈవిషయముపై సలహాలొసగు నట్లొక వృద్ధకొరేషియుని వేడుకొనగా నాతడు ఈ సభావర ణములోనికెవరు మొదట ప్రవేశించునో ఆతడే రాతిని యథా స్థానమునందుంచ యోగ్యుఁడని అభిప్రాయపడెను. దీనికందరు సమ్మతించిరి. అందరిదృష్టిప్రవేశ గవినివైపు వీక్షణదృష్టిచే ప్రసరింపఁబడెను. అప్పుడెవరులోని కేతెంచిరి? గౌరవనీయుఁడును, విశ్వాసపాత్రుఁడును, బలవంతులకు ప్రతికూలముగా దుర్బలులనాదరించువాడు, మానవకోటిసంరక్షకుడు, దేవుని యొక్క వెలుగుమొదలుగాగల బిరుదాంకితుడగు ముహమ్మదు

ప్రవేశమయ్యెను. వచ్చినపిదప, ఒకదుప్పటి భూమిపైపరచి కొరేషు నాల్గుశాఖలయందు ముఖ్యులైన నలుపురి నెన్నుకొని, ఆనలుపురు నాలుగుమూలలను పట్టుకొనునట్లానతిచ్చెను. దాని పై నల్లరాతిని తానెపెట్టెను, దుప్పటినివారు కొంతపైకి లేపిన పిదప, ముహమ్మదుతానే స్వయముగా నారాతిని నియమిత మైన గోడరంధ్రమునందునిచెను. ఈవిధముగా, నారివాదముల నుపశాంతిజేయుచు, ఆకార్యమును తానే పరిపూర్ణముజేసెను.

కాబా పునర్నిర్మాణమునందు దైవసంకల్పములేదని ముసల్మా నులైనను, తదితరులైనను చెప్పగలరా? ఆనల్లరాతిని ముద్దు పెట్టుకొనినను, వ్రేళ్లతో ముట్టుకొనినను, దూరమునందుండి దానినిచూపించినను, ముసల్మానులు దానినచట పెట్టినటువంటి పరిశుద్ధుడగు ప్రవక్తయొక్క చేతిని ముద్దిడుచున్నారు. ఇక్కా లమునందరబ్బీయుల నీతి ధర్మము లెట్లున్నవో చూచెదము. ముహమ్మదు జీవించియుండిన నాటి అరబ్బీయులు నిర్దేవులును, మంచి చెడ్డలెరుగనివారైయుండిరి. వారిపరస్పర తెగలయందలి బాంధవ్యముతప్ప వేరేప్రభుత్వము వారికుండెడిదిగాదు. వారు నిరక్షరులై గర్వగుణ భూయిష్టములైన పద్యములు వల్లించు వారైయుండిరి. వారుపూజించుటకు మాత్రము అబ్రహాము ఇష్మాయేలుల వలన కట్టబడిన దేవునిమందిరమగు కాబా మాత్రము వారికి ప్రాముఖ్యమైనదిగా నుండెను. ఐతే ఈపరి శుద్ధస్థలమునందు ప్రతి తెగకొక విగ్రహము చొప్పున, అరబ్బీ

విగ్రహారాధికుల విగ్రహములతో నింపబడియుండెను. దినమున కొకబొమ్మకు పూజించినను సంవత్సరమునకు సరిపోవునట్లుగా 365 విగ్రహములుండెడివి. వారి యొక్క దినములు అంతర్జాతీయ యుద్ధములతో గడచుచుండెడువి. గొఱ్ఱె గుంపులు, ఒంటెలమందలు వారి ధనసంపత్తియై యుండెను. జూదము, కోరినందఱిభార్యలతో జీవించుట, వ్యభిచారము, కక్షలుసాధించు యుద్ధములు, కరవుకాలములందు పోషింప లేక బాలికలను ప్రాణములతో పూడ్చివేయుట మొదలగు దురభ్యాసముల యందోల లాడుచుండిరి. దొమ్మిదోపిడీల యందు తీక్ష్ణులైనను పరులపట్లదయార్ద్ర హృదయముగలవారై యుండిరి. వారిభాషకఠినతరమైన నారికేళ పాకమువంటిది. వారు మిగుల మూర్ఖులై యుండిరి. సాంఘిక విషయికముగా వారు మూర్ఖత్వముకన్న దుస్థితియందధికముగా యుండిరి. ఇటువంటి మూర్ఖజనము, కాబానుకట్టుటకు దేవునిచే నేర్పాటుచేయబడిన అబ్రహాము సంతానమై యుండెను. అల్లా యీలాగు సెలవిచ్చు చున్నాడు. "ఆయనప్రభువు అబ్రహాముకు కొన్నిమాటలునేర్పిన పిదప, నిన్ను నేను మనుష్యులనాయకునిగా జేతును అనిచెప్పెను. అందుకు అబ్రహాము అట్లయితే నాసంతానమునుకూడ చేయు నట్లగునా? అప్పుడుదేవుడు నానిబంధనలో అన్యాయస్థులు లేరు. అనెను."

# ధ్యాన పరవశమైన యేకాంత జీవితము.

తన మాతృభూమి నావరించియున్న దుస్థితి యాతనిని చింతాక్రాంతస్వాంతుని జేసెను. మక్కాపురమునకు మూడు మైళ్లదూరమందున్న హీరా యను పర్వతాగ్రమునంగల గుహ యందు తనస్వదేశ పరివర్తనమును, బహుదేవతారాధనా వ్యాపకమును గూర్చియు, జింతిలుచు "అక్షయుండగు నేక దైవారాధన" విధానమును ధ్యానించుచుండెను. ఏకదైవా రాధన సందర్భమున నీశ్వరుండు మోషేకీరీతి సెలవిచ్చియుం డెను. "దాస్యబంధనములందొలంగించి, ఐగుప్తుదేశమునుంచి నిన్నురప్పించిన దేవుండను నేనే" నాకుప్రతిగా నీకువేరొక దేవుండుండరాదు. (నిర్గమఖాండము 20: 1, 2, 3.) ఏక దైవారాధనమున తనకుమిక్కిలి ఆదరణకలిగినందున, అనేక దినములకు సరిపోవునంతటి యాహారపదార్థములు తీసుకొని పోయి, గుహాయందు దేవుని నారాధించుచు, ధ్యానించుచు, కాలముగడుపుచుండెడివాండు.

## ప్రథమ నిరూపణము.

నలువదేండ్ల వయస్కుండగునప్పటికి, దైవముతనచిత్త ము నాతనికి బైలుపఱచెను, "ఆత్మీయమానసికాభివృద్ధి నిమిత్త

మును, ఇంతకుపూర్వమే మానవుని కెఱుక చేయఁబడని విజ్ఞాన మార్జించుటకును యేక దేవునినేయారాధించి, ఆయన కేప్రార్థిం చుము." ఈనిరూపణమునకలరి, తనగృహమున కేగి, దేవుఁడు తన్నుశోధింప నెంచియున్నాఁడను భయమును వ్యక్తపరచుచు జరిగినవృత్తాంతమాద్యంతము తనభార్య కెఱిఁగించెను. ఆయన వ్యవహారములెల్ల దయార్ద్రహృదయయై గమనించుచుండునదగుటచే ఖదీజా ఆయననోదార్చి "దేవుఁడునిన్నుశోధింపఁడను మాటనిశ్చయము, ఎందుకందువా, బంధువులన్ననీకుప్రీతి, అసహాయులకు సహాయకుఁడవు. అతిథిసత్కార మొనర్చుచున్నావు. నిర్భాగ్యులకు జేయుతనిచ్చుచున్నావు. ఇటువంటి సుగుణసమేతుఁడవనియెను" ఈపలుకులు, అయనజీవితాంతర్యమెఱిఁగిన తనభార్యయొక్క సాక్ష్యము. ఆయన సత్ప్రవర్తనముద్ఘోషించుట కింతకన్నమించిన సాక్ష్యమేమున్నది? ఏవ్యక్తిగుణములైనను అనుభవమువలననే తెలియనగు. అంతటి అనుభవము భార్యకే లభించును: భార్య మాటలాతనికి 'నచ్చలేదు కాన ఖదీజా బైబులు పరిశోధకుఁడగు తనసోదరునికడ కేగి యీ నిరూపమునందలి రహస్యార్థము నెఱుంగునదని సలహానిచ్చెను. అదే విధముగ తనభార్య సోదరుఁడగు "వర్కాబిన్‌నౌఫల్" కడ కేగి వృత్తాంతమునివేదించెను. నావుడు వార్కా యిట్లుత్తరమిచ్చెను. "భీతిల్లకు. మోషేకు గలిగిన తెరఁగున, దైవదర్శనము నీకుఁగలిగినది. నేనువృద్ధుఁడనైతినని చింతిలుచున్నాను.

మానవకోటిని సన్మార్గమున నడిపించుటకీశ్వరుఁడు నిన్నేర్పాటు చేయుదినములు నా కనులారచూచుటకు నేను యౌవనుఁడనై యున్న నెంత బాగు! నీవారే నిన్నునీయింటినుంచి వెడలగొట్టెదరనియు సంశయించు చున్నాను.'' ముహమ్మదు ప్రీతి నిత్యము, తన ప్రజలయొక్క శ్రేయోభిలాషియగుటయెగాక, తన గ్రామవాస్తవ్యు లందరికిఁ జిరపరచితుఁడగుటఁ జేసి తన జనులేల తననట్లు హింసించెదరోయని యాశ్చర్యపడఁజొచ్చెను. నీకుకలిగినట్టి యుత్కృష్టసందేశమెవరికిని కలుగలేదు. కాన ప్రజలునిన్ను హింసించుట యందెంతమాత్రమాశ్చర్యము లేదని తనధర్మపత్ని చెప్పఁదొడగెను. తనస్వజనులయందు తనకుఁగల యనురాగము, గ్రామస్థుల యెడలిప్రేమ, పేదలకొఱకొనరించినసేవ, మొదలగు సుకృతములను విమర్శించుచు, తనవారే యాతని నిరాకరింతురని గ్రహింపఁగా నాతని హృదయము పలు తెరంగుల కంపింపజొచ్చెను. కాలగర్భమున నింతటికన్న ఘోరమగు ప్రమాధము లాతనికొఱకు వేచియున్నవి.'

## సేవకొఱకు పిలువబడుట.

---

ఇదిజరిగిననెలకు, మరొక నిరూపణము కలిగినది. విగ్రహారాధన మంతరించి, పాపము పరిహారమై, ప్రపంచములో నీతి న్యాయములు ప్రభలుటకు, జనసామాన్యమును దేవునివైపు

మరల్పుమని దైవోక్తి ముహమ్మదు కానతిచ్చెను. ముహమ్మదు అబ్రిహాము కుమారుడగు ఇష్మాయేలు వంశసంభూతుడనుట జగద్విదితము. ముహమ్మదు పవిత్రయనుటకు, ఇస్లాము చరిత్రలయందు, చరిత్రేతర గ్రంథములందు విపులముగా దాఖ్యాణములు కలవు. నాగరక ప్రపంచముచే దైవగ్రంధముగా బరిగణింపఁబడుచున్న పరిశుద్ధమగు బైబులువేధములోని ఆదిఖాండము 17 : 20 లో నిత్తెరంగున గలదు.

"ఇష్మాయేలును గూర్చి నీవుచేసిన మనవి నేనువింటెని. ఇదిగో నేనతనిని ఆశీర్వదించి అతనికి సంతానాభివృద్ధి కలుగజేసి అత్యధికముగా అతని విస్తరింపజేసెదను. అతని సంతానమునుంచి పన్రెండుగురు ప్రజాపతులుద్భవించెదరు. అతని గొప్పజనముగా చేసెదను."

"ఇష్మాయేలు వంశావళి అత్యాధికముగా ఆశీర్వదించబడుటచే దైవొక్తి అక్షరాల పరిపూర్ణమైనది. ఏలయన భూగోళమునందలి అధికసంఖ్యాకులు ఇష్మాయేలు సంతానమువారే. బైబులు వేధమునందలి పరమగీతములు 5: 10- 16 లోనిట్లున్నది. "నాప్రియుడు ధవళ వర్ణుఁడు రత్నవర్ణుడు, పదివేలమంది సైన్యమున కాతడధిపతియు ముఖ్యుడు నైయున్నాడు"

ఈవచనములును, వీని తమరాతవియు ముహమ్మదు యొక్క రూపురేఖా విశేషములను వర్ణించుచుండ, బైబులు

పారకులు సరదాగా వానిని జారవిడువవచ్చును కాని ప్రియుడు "పది వేలలో ముఖ్యుడు" అను పదముల సూచకములవలన నీశ్వరుండొక్క మానవునినే ఏర్పాటు జేసి కొనెననియు నాతఁడు పది వేలలో ప్రధానుఁడనియు దేలుచున్నది. ఇఁకనాతని నిలుకడ నెఱుఁగవలయునన్న ద్వితీయోపదేశకాండము 33: 2 లో చూడవలయు. అందిట్లున్నది. యెహోవా సీనాయినుండి వచ్చెను. శేయీరులోనుండి వారికి ఉదయించెను. పరిశుద్ధుఁడగు నాతఁడు ఫారానుకొండనుండి ప్రకాశించెను. వేవేల పరిశుద్ధ సమూహముల మధ్యనుండి ఆయన వచ్చెను. ఆయనకుడి పార్శ్వమున అగ్ని జ్వాలలు మెరయుచుండెను.

హాబక్కూకు 3: 3 "దేవుడు తేమానులోనుండి బయలుదేరుచున్నాడు. పరిశుద్ధదేవుడు ఫారానులోనుండి వేంచేయుచున్నాడు, ఆయన మహిమ ఆకాశమండల మంతటను కనబడుచున్నది, భూమి ఆయన ప్రభావముతో నిండియున్నది" ఈ రెండు వచనములద్వారా, "ప్రియుఁడు, పది వేలలో ప్రాముఖ్యుఁడు" అనునాతఁడు ఫారానునుంచి రావలయునని విశదమగుచున్నది. దావీదు మహారాజ వంశముద్వారా, ఇస్రాయేలీయులగోత్రము నుంచి, వెలువడినవారిలో యేసుక్రీస్తు కడపటి ప్రవక్త ఆయన జన్మభూమి బెత్లెహేము. కాని, అబ్రహాము కొసఁగబడిన దైవవాగ్ధానము, ఇస్మాయేలియుఁడును, ఫారానువాఁడునైన మహమ్మదు ప్రవక్తయందు పరిపూర్ణమగు

చున్నది. ఎవరియందీ మూఁడు షరతులు వర్తించుచున్నవో యాతఁడే నిర్ణయింపఁబడిన ప్రవక్త. ప్రియుఁడను పదమునకు సరియైన హీబ్రూ ఆదిమపదము "ముహమ్మదియం" ఈహీబ్రూ భాషా పదమైన "ముహమ్మదియం" నకు అరబ్బీలో "ముహమ్మదు" అందురు. తెనుఁగు బైబులు నందలి "ప్రియుఁడను" పదమునకు హీబ్రూ బైబులు నందు ముహమ్మదీయం అనియున్నది. ఫారానునుంచి పదివేలతో వచ్చినవాఁడు ముహమ్మదు. ఫారాననఁగా "పారిపోయినటువంటి ఇద్దరవి" భావము, వారిద్దరు హాగరు, ఇస్మాయేలులు. అందుచేత వారిద్దరునివాసము చేసినస్థలము ఫారానబడుచున్నది. నేటికిని లక్షలకొలఁది విశ్వాసులీస్థలమును పుణ్యక్షేత్రముగ భావించి దర్శించుచుందురు. అదియుఁగాక ప్రచండమైన శాసనములు నిర్మించినవాఁడు ముహమ్మదు. అక్కాలపు గడసుటరబ్బీయుల కఠిన హృదయములందు మృదుత్వ మేర్పడుటకిట్టి ధర్మశాస్త్రమవసరమై యుండెను. మక్కాపురము నందలి నల్లరాతి మందిరమనబడిన కాబాను జయించుటకు ముహమ్మదు పదివేలతో ప్రవేశమై యుండెను. అనేక శతాబ్దముల చిత్రవిచిత్రమగు చరిత్రలకుఁ దారవమై అసంఖ్యాకులగు ముసల్మానుల దృఢతరమగు విశ్వాసమున కాదర్శప్రాయమగు ఈశ్యాముల పాషాణము సాలమన్ రాజుచే యెరూషలేము దైవాలయమున మొట్టమొదట స్థాపితమయ్యెను. తదనంతరము మక్కాలోనున్న కాబామదింరము

యుండు స్థిరీకరింపబడినది. పలుతెరంగులకు దుర్భరపరిస్థితుల వెంటనంటి అంధకార బంధురమనఁబడు ప్రాచీనకాలమునాఁటి యరులను దురుముచుండిన దేవుని వెలుఁగు కిరణములను మన మించుక యూహాపోహలచే చిలకింపనగు. ఈద్వితీయ నిరూప ణము ద్వారా ఆయన ప్రవక్తయని దృఢమగుచున్నది. ద్వితీ యోపదేశఖాండము 18:18 లోని ప్రవచన మీద్వితీయ నిరూపణమువలన నెరవేరినది. ఎట్లన "వారిసహోదరులలో నుండి నీవంటి ప్రవక్తను వారికొరకు పుట్టించెదను" ముహమ్మ దు ఇష్మాయేలు వంశస్థుఁడు. ఇశ్రాయేలీయులకు సోదరుడు. ఎట్లన; అబ్రహాము ఆదిమభక్తుఁడు, ఇష్మాయేలు, ఈసాకులకు తండ్రి. ఇష్మాయేలు సంతతివారు ఇష్మాయేలీయులనబడుచు న్నారు. ఈసాకు సంతతివారు ఇశ్రాయేలీయునల బడున్నారు. ఇష్మాయేలు వంశసంభూతుఁడు ముహమ్మదు. ఇష్మాయేలీయుల నియు, ఇశ్రాయేలీయులనియు రెండుశాఖలు యిక్కాలమునుం డియే ప్రత్యేకింపబడినవి. మోషేవలె నూతనధర్మశాస్త్రోప దే శకుఁడు. తానుఁ ప్రవక్తయైన వెంటనే, ప్రపంచమంతయు నా యనకు నూతన రూపమవధరించినది పూర్వము ప్రేమించిన వారు యిప్పుడు ద్వేషింపజొచ్చిరి. ముందుపొగిడిన వారిప్పుడు తెగడజొచ్చిరి. అప్పుడు శరణమిచ్చినవారు యిప్పుడు శ్రమలి చ్చుచుండిరి.

# అబూబకర్‌తో సంక్షోభవము.

ఆయనతో కలసి మెలసియుండిన నలువురుమాత్రమా యనను విశ్వసించగలిగిరి. ఆనలువురెవరన, తనభార్యయైన ఖదీజా, అబూతాలిబు కుమారుఁడగు అలి, దాస్యశృంఖలముల నుండి విముక్తుఁడైన బిలాలు, తనమిత్రుఁడగు అబూబకర్. ముహమ్మదు కృత్రిమ ప్రవక్తగా లెక్కించుటకు కారణములు కానరానందున వీరు అయనను విశ్వసించిరి. అబూబకర్ ముహమ్మదును ప్రవక్తగా యంగీకరించు విధానము విచిత్రమైనది. ముహమ్మదుకు దైవోక్తికలిగినదను ప్రబలవదంతిమారు మ్రోగినప్పుడు అబూబకర్ మక్కాపురము నందలి యొక గౌరవనీయుని గృహమున విశ్రమించుచుండెను. ఆగృహమున నొక బాలికయేతెంచి "నేడుఖదీజా కేమైనదో తోచినదికాదు. మోషే ప్రవక్తయైన తెరఁగున తన పతికూడా ప్రవక్తయైనాఁడనుచున్నది" అనెను. ఈమాటలువినిన వారందఱు పక్కున నవ్విరి. ఇది పిచ్చిగొడవ యని పరిహసించిరి. కాని ముహమ్మదు తత్వమెఱిఁగిన వాఁడగుటచే అబూబకర్ వెంటనే ముహమ్మదు గృహమునకేగి సవిస్తరమేమని విచారించఁగా దేవుఁడాతనిని సకల మానవకోటి సన్మార్గావలంబనమునకును, అద్వైతారాదనమునకు నేర్పాటిచేసికొనెనని ముహమ్మదు చెప్పగా, కానిపోని ప్రశ్నలడుగక, నా తల్లిదండ్రులసాక్షిగా

నీ వెన్నడైన అబద్ధమాడలేదు, అల్లాకుమించిన దేవుఁడు లేడన యు తద్వ్యాఖ్యానాహకుఁడవీవయనియు నేజెప్పగలనని అబూ బకర్ ముహమ్మదుతో శపథముచేసెను. ముహమ్మదు యందభి మానము గలయువకులను ప్రభోధింపగా వారిలో నలువురు ముహమ్మదు నామోదించిరి.

# శ్రమలు

యథార్థ వర్తనము శులభసాధ్యముగాదు. విగ్రహపూ జయు. నట్టిదేవ స్థలములను సర్వదాసంరక్షించుటయు ప్రధాన జీవనాధారముగా గొను మక్కాపుర వాస్తవ్యులకు, ఏకదేవుని ఆరాధన సమంజసమనుసందేశము కర్ణకఠోరముగ నుండెను విషయము లారసిన పిదప, ముసల్మానులైన వారియొక్క బం ధువులాతనిని శ్రమ పెట్ట మొదలిడిరి. "ఉస్మానును తనపినతండ్రి త్రాళ్లతోబంధించి, గదియందుంచి నూతన మతచింతనము ను ల్లంఘించుదనుక విడుదల చేయననెను. పదునైదువత్సరముల వాడైన జుబాయిరను యువకునిని వానిబంధువులు బంధీకృతుని గావించి గృక్కదిరుగనంత పొగబెట్టి, వానివిశ్వాసములు మార్చుకొమ్మని బలవంతపెట్టిరి. ఇక్కార్యములాతని దృఢ పరచి తన నూతనవిశ్వాసములు ప్రభలుట కాధారభూత ములైనవి. మరొక ముస్లిముయువకునితల్లి యింకొక క్రొత్త

యెత్తుయెత్తినది. పారంపర్యాచారముగా వచ్చుచున్న మతిము నాచరించువరకు అన్నపానాదులగో్రిలక నిరసనవ్రితము బూనెను. భౌతికవిషయములందు తనతలిదండు్రిల కనుగుణ్యముగా నడచుటధర్మమైనను దైవదృష్టియందిట్టి కార్యములంగీకారము కాకపోయెనేని అట్లుప్రవర్తించనని వా్రిక్కుచ్చెను. ఏలయన, తనతలిదండు్రిలకన్న, భగవంతునితో నెక్కుడు సంబంధభాంధవ్యమును గలిగియుండెను. పరిశుద్ధుడగుప్రివక్తనామోదించిన వారందరిలో అబూబకర్, ఖదీజాలు తప్పతక్కినవారందరు పదునైదు యిరువదివత్సరముల వయస్కులై యుండిరి. మహమ్మదు అనాధబాలుడగుట వలన తనబ్రిదుకుదెరవును తానే చూచుకొనుచుండెననియు, అల్లాయాతని ప్రివక్తగాప్రితిష్టించిన పిదప నాతనినంగీకరించినది నవయువకులనియు జెప్పవలసియున్నది. ఈతని బాల్యచరిత్రా ప్రికారము ఇస్లాముమతము యువకులమతమనవచ్చును.

## ఆయన ఆగమనా విధానము.

ప్రివక్త తనవిధ్యుక్తధర్మము, నియమితమగు ప్రిజలకే తెలుపుప్రికారము, మహమ్మదు యీ దిగువరీతిని సందేశమును ప్రికటించెను. ఒక దినమాతడున్నతమగునొక నేలపైనిలచి మక్కావారిలో నుత్తములనుపిలచెను. ప్రజలాతనియం దెక్కుడు భక్తిగలవారగుటచేత నాతనిపిలుపునాకర్ణించి యాతని కడకేగ

సాగిరి. రాజాలనివారాతని సందేశమునువినుటకు తను ప్రతి నిధులనంపిరి. "మక్కానివాసులారా మక్కానుధ్వంసముచేయు నుద్దేశముతో నొక పెద్దసేన మక్కాను సమీపించు చున్న దనినచో మీరునమ్మెదరా" యనెను. ఇదిసాధ్యమయ్యెడుపని కాదు. మక్కాపుణ్యక్షేత్రముగా పరిగణింపబడుటచేత, అరబ్బీయులలోనే తెగవారుకూడా మక్కానెదురించెదరని యూహింప వీలులేదు అదియుగాక, మక్కాకదుపులగాపులు మక్కా పరిసరప్రాంతములయందెంతో దూరముదనుక, తమమందలను మేపుచుందురు వారు. మక్కాపైకేతెంచు యుద్ధ సన్నద్ధులను గూర్చి వారు ప్రజలకు తెలుపగలరు. అట్లుండియు ప్రజలందరు ముహమ్మదుకిచ్చిన జవాబిదియె "ఇంతకుపూర్వమెన్నడైన నీవసత్యమాడలేదు కాన, నీమాటలుసత్యమని మేము నమ్మెదము నావుడు ప్రవక్త" నేనసత్యమాడననుచున్నారు కదా. దేవుడు" తనసందేశమును తెలుపుటకును, మీదుష్ప్రవర్తనమును మీకు చూపుటకును నన్నేర్పరచుకొనె ననెను" ఇది వినిన వెంటనే ప్రజలాతడు పిచ్చివాడో లేక కుత్రిమప్రవక్తయోయని విడచి పారిపోయిరి.

## ఆయన అనుసరుల దురవస్థ.

ఈపరివర్తనమువలన మక్కాయందలజడి ప్రభలెను. ఆయనను నమ్మినవారికి పూర్వముకన్న నెక్కుడు శ్రమలా

వహించుచుండెను. అన్నదమ్ములున్నదమ్ములవలన నిరాకరింప బడిరి. తలిదండ్రులు తమపిల్లలను తరిమివేసిరి. యజమానులు తమబానిసలను శ్రమపెట్టిరి. శ్రమలనేకరూపములవధరించి నవి. అలవాటులను అచారములను అనుసరింపక, మతమును సకారణ విచక్షణద్వారా పరిశీలించు యౌవనస్థులు, ప్రవక్త యొక్క సత్యమును వెంటనే అంగీకరించుచుండిరి. అందుచేత వారిజననీ జనకులు, వారిని తమవైపు మరల్చుకొనుటకు అన్న పానమువిడక బంధించుచుండిరి. ఇట్టిక్రియలువారినేమాత్రము వశము చేసుకొనలేను. కన్నులు తెల్లవారి. పెదవులెండిపోయి కొనయూపిరితో వారు దేవుని సంస్తుతించుట గాంచి, వారు చనిపోయెదరని భీతిల్లి తలిదండ్రులు భోజన పానాదులొసగు చుండిరి. వారిపరిస్థితి విచారణీయమైనదేగాని, బానిసలున్ను పేదలును నిరాధారులైన ముస్లిములపరిస్థితి మిగులశోచనీయము ఒడలుకమలి పోవుదనుక తీక్ష్ణమగు నరేబియా యెండలో బా నిసలు నిలువబెట్టబడుచుండిరి. కొందఱిని కాళ్లకు త్రాళ్లుకట్టి ఎలమల మాడుచున్న యినుకపైని లాగుచుండిరి. కొందఱి దేహములెఱ్ఱగా కాలిన యినుపకడ్డీలచే వాతలు పెట్టబడెను. వాదులతో ముస్లీముల దేహములు చిల్లులుబడబొడచుటయు నొక విధమగు శ్రమమైయుండెను. వీనినన్నిటిని ముస్లిములు మారుపలుకక సహించి, యెంతశ్రమ పెట్టినను అద్వైత పూజావిధానమును విడువ జాలకుండిరి. పరిశుద్ధుడగు ప్రవక్త

కూడా యీ శ్రమలనను భవింప వలసివచ్చెను కాని, యాతని కుటుంబమును మక్కా వారందఱు గౌరవించుటచేత వారిని మాత్రమేలాటి బాధితులను గానియ్యలేదు. ఆయన ప్రార్థన యందుండగా చెత్తచెదారము బూడిదలతనిపై వేసిరి ఒకమారాతనివిరోధి. మహామ్మదు సాష్టాంగపడియుండగా. మెడపైని కాలుబెట్టి ఒక గంటసేపటి దనుక నటులనే అణచి యుండెను. మరొకమారాతడు మసీదునకు పోవునప్పుడు ఆయెన మెడచుట్టు బట్టచుట్టి మెలవేసియూపిరి తిరుగకచచ్చునట్లు ప్రయత్నించిరి.

## ఆయన ప్రబోధములు.

---

ఇట్టి ప్రతికూలమగు పరిస్థితుల నెదురాడుచు, ప్రవక్త తనసేవ జేయుచుండెను. ఎక్కడిద్దఱు ముగ్గురు కూర్చొనియున్న నచటికాతడేతెంచి యిత్తెఱంగున బోధించుచుండెను" ఒకడే దేవుడున్నాడు. భూనభములయందెందైనను ఆయనగాక వేరొకడులేడు. ఆయనకుసంతానదోషములేదు, ఆయనయెవరికిని జన్మించినవాడుకాడు. ఆయననేనమ్మవలెను. ఆయననేపూజింపవలెను. ఆయనకే ప్రార్థించవలెను. ఆయన అకళంకుడగుటచేత, మనస్థూలదృష్టికాయన కానరాడు. ప్రపంచనిర్మాతయగు మహా పురుషుడాయనే. మరణించినఆత్మలాయన కడకేగి నూతనజీవమునందును, ప్రజలాయనను ప్రేమింపవలెను.

ఆయన సామీప్యమునుగోరవలెను, తమ మనోవాక్క్రియలను శుద్ధీకరించుకొనవలెను, అబద్ధము, హత్యజేయుట, దుండగము, చౌర్యము, దోపిడి, అపనింద, తప్పులెన్నుట, తిట్టుట, పాపము పగమొదలగువానిని, నిర్మూలించు కొనవలెను. సుఖజీవనము నకు, తమ మనోభీష్టములీడేర్చుకొనుటకు కాక, ప్రజలు తమ కాలమును మానవకోటి శ్రేయోభిషులై పరులసహాయార్థమై వ్యయపరచవలెను. ఈరీతి ప్రేమను సమాధానమును లోకము నందు వెల్లడిచేయవలయును".

# తన దేశజనుల మూఢ భక్తి.

ఆయన చెప్పినప్రబోధమిదియె, కాని ప్రజలాతని నవ హాసించిరి. మక్కావాసులు దిట్టపడిన విగ్రహారాధికులు, వారి గుడులలో నూరులకొలది విగ్రహములుండెను. వానికనుదినము ర్పణలుఅర్పించుచు పూజించుచుండిరి. అనేకులీవృత్తి ద్వారా దుకుచుండిరి. అద్వైతమువారికి వెక్కిరనముగా యుండినది. గవంతుడు బొమ్మయందైనను, నరునియందైనను, యేల అవ రింపలేడో గ్రహింపలేకపోయిరి. నిరంజయుడగు దేవుడన వారికినచ్చలేదు. అందుకు జేసి పరిశుద్ధుడగు ప్రవక్తనుజూచి నవుడెల్లనవ్వుచు" ఈతడు భగవానులనందఱి నొక్క దేవుని యందుబంధించినాడని" హీనపరచుచుండిరి. ఏలయన, అనేక

మైన దేవుండ్లులేకపోవుట ఆసాధ్యమగు పనియనియు, మహమ్మదు దేవుడొక్కడే యనుచుండ, నాదేవుండ్లనందఱినే కీభవింపజేసి ఒక్కనిగా మూర్తీభవింపఁజేయుచున్నాడనియు వారుయూహించుచుండిరి. వారు తన అజ్ఞానపుచేతలు పరిశుద్ధుఁడగు ప్రవక్తకన్వయింపఁజేసి, వానిమూఢత్వమునుగాంచి పకపకనవ్వుచుండిరి. మరణాపుటావలి జీవిత సిద్ధాంతమువారిని భ్రమింపజేసెను. మృతులు పునరజీవితులయ్యెదరనగా వారికి హేళనగాయుండెను. మక్కాలో, ముస్లిములకు శ్రమలధికమైనపుడు, అక్కాలము వరకు క్రైస్తవభూపతిచే పరిపాలింప బడుచుండిన అబిసీనియాలో శ్రమదీర్చుకొనుటకు, ప్రవక్త తనస్నేహితవర్గమునకు అనుమతియొసఁగను. అందుచేత అధికసంఖ్యాకులగు ముస్లిములు మక్కానువిడచి అబ్బీసీనియాకు పైనమైరి. శ్రమఁగిందైనను వారిని విడువలేదు వారుఅబీసీనియారాజునకు తమ ప్రతినిధినంపి శరణుజొచ్చినముస్లిములనుతమకప్పగింపవలసినదిగా వేడుకొనిరి. ఐతే, యీక్రైస్తవరాజు ధర్మప్రియుఁడగు చక్రవర్తి. వెంటనే రాజు, ముస్లిములసమాధానము వినగోరి వారినిరాఁబనిపెను. వారిరాక మిగుల దుఃఖకరమగు దర్శనము. శ్రమలకోర్వలేక తమనిలయములను విడచివచ్చినముస్లిములు, రాజువారినిమరల మక్కావారి చేతికిచ్చునేమో యనియువట్లుచేసిన ద్విగుణీకృతమగుశ్రమల ననుభవింపవలసి వచ్చుననియు, పంచప్రాణములరచేతబట్టుకొని రాజునెదుటనిలచిరి. ఈ యూరికిరాబనేమని

రాజు వారినడిగెను. వారిపెద్దలిట్లుత్తర మిచ్చిరి" మహాప్రభూ! మేముమూఢులము మంచిచెడ్డ లారయలేము. మేమువిగ్రహా ములను పూజించితిమి. అద్వైతము నెఱుగకుంటిమి అన్నివిధము లగు దుష్టత్వము మాయందుండినది. అజ్ఞాతిక్రమము, దోపిడి హత్య, వ్యభిచారము దోషములుగా భావించలేదు. అప్పుడు దేవుఁడు, మహమ్మదుని మాకు ప్రవక్తగాయుద్భవింపఁజేసెను. ఆయనఒక్క దేవునిని పూజింపనేర్పించెను, దుష్క్రియలనుంచి మమ్మునుదూరపరచెను, నీతిన్యాయములను మాకుకనపరచెను. ఒకరి నొకరు ప్రేమించునట్లు ప్రోత్సహించెను, పునీతమును, పరిశుద్ధమగు మార్గమున మమ్మును నడిపించెను. అందుచేత, మేముమాస్వగృహములు విడచిపారిపోవువరకు, మా సహోదరులు మమ్మును చెప్పరాని శ్రమలపాలుజేసిరి. వారిచ్చటికి కూడా వచ్చి మమ్మునియ్యమని కోరుచున్నారు. నిత్యుఁడగు దేవునిప్రార్థించుటయే మాదోషము". రాజునకీప్రత్యుత్తరము సంతృప్తికరముగా నున్నందున మక్కావారికి ముస్లీములనియ్య నొల్లకపోయెను. మక్కావారు మరునాడు రాజసభికులనుమంచి చేసుకొని, ముస్లీములుయేసున దూషించుచుందురనియు, వారిని వెడలగొట్టుడని మరలవేడుకొనిరి. రాజు మరలముస్లీములను పిలువనంపెను. యేసు, దేవునియొక్క ప్రియమగు సేవకుఁడును ప్రవక్తయునని ఇస్లాముచెప్పుచున్నదనియు, దేవుఁడు ఒక్కడే కాని యేసును దేవునిగా నంగీకరింపమనియు, వారునుడివిరి. అంత

టు రాజసభికులు దేశ్రకులై, ముస్లిములను శిక్షించ వలసినదని రాజును వేడుకొనిరి. ఏసువిషయము ముస్లీములకెట్టిచభిప్రాయ మున్నదో, తనకు నట్టి యభిప్రాయమే యున్నందున, వారిని వారివిరోధుల చేతికప్పగింపజాలనని రాజుపలికెను. సభికులు నిరుత్సాహులైనను బాధలేదనియు, తన రాజ్యాధికారమున కన్న నీశ్వరుని సంతృప్తిపరచుటయే తనకిష్టమగు కార్యమని సభయందుడివెను.

## మక్కా యొక్క కష్ట కాలము.

మక్కాలో ప్రవక్తయొక్క శ్రమలు పెచ్చు పెరిగి పోవుచుండెను. ప్రధానులలో నొకఁడైన ముహమ్మదు చిన్నా యాన యగు అబూతాలిబు యొక్క భీతిచేత, ముహమ్మదును అత్యధికముగాశిక్షింప వెరచుచుండిన మక్కావారు అబూతా లిబును సమీపించి, తదితర ప్రధానులలో నెవరికొడుకునైన దాను పెంచుకొని ముహమ్మదును వారి పగదీర్చుకొనుట కొ సగుమని విన్నవించుకొనగా అబుతాలిబు "ఇది చిత్రమగు మనవి. మీవారిలో నొకని కుట్టవానికి, నాస్వాస్థ్యమిచ్చివేసి, నాయన్నకొమారుడు హింసింపఁబడి చంపఁబడుటకు మీకియ్య మనుచున్నారా. మృగమైనను తనస్వంతరక్తమునుచంపి, యిత రులను ప్రేమించు నా". అనెను. ఈ ప్రత్యుత్తరముచేత

నిరుత్సాహులై ముహమ్మదు, అద్వైతము బోధించకుండు నట్లును విగ్రహారాధన తప్పని చెప్పకుండునట్లును చేయవలసిదిగా అబూతాలిబును వేడుకొనిరి. అంతట అబూ తాలిబు, ముహమ్మదును పిలువనంపి, మక్కా-ప్రధానుల కోర్కెలీడేర్ప గలవాయని సంబోధించగా ముహమ్మదు "చిన్నాయనా, నీ యందు తీరని కృతజ్ఞతాబద్ధుడనై యున్నాను. అట్లయ్యు, నీ కొరకైనను, నేను దేవుని నిషేదించలేను. ప్రజల దౌర్జన్యమునకు భీతిల్లితివేని, నన్ను నేను చూచుకొనునట్లు విడిచిపెట్టుము. దేవుడు నాకు చూపని సత్యమును నేను ప్రకటింప వలయును. నాప్రజల నాశనముచూచుచు నేనూరక కూర్చొనజాలననెను.

## శోధించునట్టి బహూకరింపులు.

---

అటుపిమ్మట మక్కావారు, వేడుకొనుటకును, మెత్తని మాటలకును దిగిరి. మక్కాయొక్క శాంతిని భంగము జేయవలదని వేడుటకొరకు ప్రధానిని ముహమ్మదు కడకంపిరి. ముహమ్మదు గౌరవముకొరకు ప్రయాస పడుచున్నచో మక్కాలో మిక్కిలి గౌరవనీయునిగా నెన్నుకొనెదమనిరి, ధనాపేక్ష గలవాడైనచో, చందావేసి, మక్కాయందధిక ధనవంతుని జేతుమనిరి. రాజ్యమేలదలంచిన రాజగా నెన్నుకొందుమనిరి; భార్యకావలసియున్న మక్కాలోని స్త్రీలందరిలో కోరినవనిత

నెన్నుకొనవచ్చునసరి. కాని, దేవుఁడొక్కఁడే యనుమాటమాత్రము మరువనమనిరి. నాపుడు ప్రవక్త " నాకుడి యెడమలను సూర్యచంద్రులను దాండవింపజేసినను నాసిద్ధాంతమును విడువ ననెను " ఇంతవరకు అద్వైతారాధన నంగీకరించి, ముహమ్మదును వెంబడించినవారు నెనుబదిరైై యుండిరి.

## బంధీకృతము-బహిష్కారము.

మక్కాయందలి అలజడి పరిసర గ్రామములకు మాదుర్మోగఁగా ప్రజలు విషయమునారయ ముమ్మరముగా వచ్చుచుండిరి. మక్కావారికిది నిరుత్సాహకరముగా యుండెను. కాన, ప్రవక్తను చూడకుండునట్లు వీధులలో జనమూక నాపివేసిరి. ఇదేసందర్భములో ఆయనను చంపవలయుననికూడా తీర్మానించుకొనిరి. ఈసంగతి గ్రహించి, ఆయన చిన్నాయనయు, బంధువులును, ఆయనతో కలసి, దాపునన్న లోయలోనికి తమ ప్రాణసంరక్షణార్థము పోయియుండరి.

వారియుపాయములు కుదురనందున ప్రవక్తను, అతని చుట్టములను, ముస్లిములనందరిని, బహిష్కరించుటకు మక్కావారలొక సంఘముగా నేర్పడిరి. ముహమ్మదును తమకిచ్చి వచ్చిన తెరఁగున జేయుట కాతనిని వారికప్పగించెదమను వరకు, వారికి బట్టలు భోజనపదార్థములు అమ్మనొల్లకుండిరి.

పరస్పర వివాహములు బహిష్కరింపబడెను. ప్రతివిధమగు సంభంధ బాంధవ్యము తెగగొట్టబడెను. ఎడారిలోనే కాగ్రిముగ నుండు పట్టణము మక్కాపట్టణము. నలువది మైళ్లవరకే పట్టణములులేవు. అందువలన, ప్రవక్తయొక్క బంధుగులు, ముస్లిములు, బహిష్కరణానంతర మెన్నియిక్కట్టుల పాలైరో యూహింపజనును. మూడు సంవత్సరములవరకు అన్నపానాదులను వారికేవరొసంగకుండునట్లు గూఢచారులు నియమింపబడిరి. భోజన సామాగ్రి దెచ్చుకొనుటకు రాత్రులయందను కూలమగు సమయము కొరకు వారు వేచియుండవలసియుండెను ఆసామాగ్రిత్వరలో అంతరించుచుండెను. కొన్నిదినములవరకు ఆకులలములను దిని బ్రతుకుచుండిరి. ముస్లిములు బక్క చిక్కి తెల్లబారి, దుర్బలులై యుండిరని పరిశుద్ధుడగు ప్రవక్త స్నేహితుడొకడు చెప్పుచున్నాడు. దినములుకాదు, వారములుకాదు, మూడుసంవత్సరములవరకు ప్రపంచమునందలి మహాధర్మధాత, అద్వైతమునుగూర్చిబోధించి. ఉత్కృష్టా దర్శప్రాయులగునట్లు వేయుప్రియత్నించుట వలన పలుతెరంగుల శిక్షింపబడెను. మూడు సంవత్సరములైన పిదప, మక్కా ప్రిధానుల యొక్క మందమతులగు జనులకొందఱు బహిష్కార ప్రిమాదమునకు ప్రతికూలముగా సంఘర్షనసాగించి పూర్వముతా మొప్పుకొనిన ప్రమాణమును పటాపంచలు గావించిరి. అంతట ప్రవక్తయు తన సహోదరులును యిన్నినాళ్లు దాగుకొని యున్నలోయను

విడచిరి కాని, యీాదీ్ర్ఘకాల నిర్బంధనమువలన, తనప్రియ పత్నియు, చిన్నాయనయున చిరకాలమునందే మరణించిరి.

# ఆయన తాయిఫ్ ప్రయాణము.

ప్రేమగ్రుడ్డిదట. సుఖదుఃఖములే వైపున నున్నది యునది యెఱుఁగదు. ముహమ్మదు మానవులను ప్రేమించువాఁడు. మక్కా పెద్దలాతని, నిరాకరించిరి. దౌర్జన్యముచేసి తన అనుచరులను హింసించిరి, ఆయన కుమారులు చనిపోయినారు; భార్య మరణించినది, చిన్నాయన యగు అబుతాలిబ్ గతించినాఁడు. ఇప్పుడేమి చేయఁగలఁడు? సచ్చిదానందసన్మార్గమున వెంబడించుఁడని ప్రజలను పిలుచుటకాతఁడిపుడు తాయిఫ్‌కు పోవుచున్నాఁడు. తనజీవిత మిత్రుడఁగు జైద్ ఆతనివెంబడించుచున్నాఁడు. తాయిఫ్‌లోని గాలిదిమ్మరులు మృగములవలె నాతనిపై బడుచున్నారు. వారుపరిషవాక్కులచేత నాతని మృదువగు హృదయమును గోయుచున్నారు. ఆయన పాదరక్షలు రక్తసిక్తములగుదనుక నాతనిపైరాళ్లురువ్వుచున్నారు, అంధకారమగు వరకాతని తమయూరియావలి యెడారిలోనికి తరిమివేయుచున్నారు. అక్కడ మరణించిన మరణించనిమ్ము, జీవించిన జీవింపనిమ్ము' సామాన్యజనులిట్టియెడ సాధారణముగా వర్తించువిధముగా ఆయన వారిని శపించుచున్నాఁడా దూషించుచున్నాఁడా? లే

దుసుమీ? సర్వశక్తునితో యెంతో సేపు ముఖా ముఖిగా మాట్లా డుచున్నాఁడు. ఆయన వెలుగు మనచుట్టు ప్రక్కలనున్నది తానిట్లు ప్రార్థించుచున్నాఁడు. " ఓ ప్రభువా? నేను సత్యము చెప్పుచున్నానని యీ ప్రజ లెఱుఁగకున్నారు. వారు తాము చేయునది న్యాయమనితలచి, తప్పుమార్గమున నడచుచున్నారు. కాన వారిపై నాగ్రహపడకుము. వారిని శిక్షింపక వారి కను లను తెరచి, వారుసత్యము నామోదించినట్లుచేయుము, నాబల హీనతనుబట్టియు, నారిత్త కోరికలవలనను నేనిట్లునిన్ను బ్రతిమాలు కొనుచున్నాను. మానవులదృష్టిలో నేను కించిత్తయిన వాఁడను కరుణాంతరంగుఁడా, అబలులదక్షకా, నీవు నా ప్రభువవు. నన్ను విడనాడకుము. నావిరోధులకైనను, అపరిచితులకైనను, నన్ను యెరగా నప్పగింపకుము, నీకంగీకారమైనచో నేను సురక్షితము గా యున్నాను. చీకటిని వెడలనడచి, సమాధానము నిప్పటికి నెల్లప్పటికి నెలకొల్పునట్టి నీ ముఖప్రసన్నతా ప్రకాశమునందు నేను సేదగొనుచున్నాను. నీకోపము నాపైకి రానియ్యకుము. నీకిష్టమువచ్చిన తెరఁగున నాకష్టములను సాధించుము, నీయం దుగాక, యేలాటి శక్తియైనను, సహాయమైనను కానరాదు. "

ఆయన ప్రార్థన మెల్లప్పుడంగీకరింపబడును. అల్లా ఆయనతో మాట్లాడియే యుండెను. ఎట్లన " మధ్యాహ్నమున సూర్యు డంతరిక్షమునందున్నపుడు, రాత్రులయందు క్రుంకిపోయినపుడు, ఓ ముహమ్మదు! నీప్రభువు నిన్ను విడనాడలేదు! నీపైని నిరాశ

కలుగలేదు. నీకు సంతృప్తికలుగునట్లు దేవుడుతనదీవెనలను నీపై క్రుమ్మరించును." ఇది నెరవేరిన విధాన మాత జీవిత చర్యల లో కనబడుచున్నది. మక్కా వారి వలన తృణీకరింపబడి, తాయిఫ్ యొక్క దుండగీడులవలన రాళ్లతో శిక్షించబడి, ముహమ్మదు మదీనానుదర్శించువారివలన నామోదింపబడుచున్నాఁడు.

## మదీనాకాతని పలాయనము.

తన సేవయందలి పదిరెండవ సంవత్సరము క్రీ. శ: 22 వ యేట, ప్రస్తుతము మదీనా యనబడు ఏత్రాబుయొక్క డెబ్బది యైదుగురు ప్రతినిధులు, ముహమ్మదు తమయూరి కేగవలసినదని యాహ్వానించిరి. ముహమ్మదు వారి పిలుపు నంగీకరించిపోవ దృఢనిశ్చయము చేసుకొనెను. ఆయన సిద్ధాంతములు యితర ప్రదేశములకు ప్రాకిపోవుచున్న సంగతి మక్కా పౌరులెఱింగి, ఆయన నెట్లయిన చంప వలయునని నూతనమగు నుపాయము పన్నిరి, ప్రతిగోత్రమునుండి ఒక్కొక్కని నేర్పాటు చేసి, వారందరు నేకీభవించి రాత్రి కాలమున ఆయనను చంపవలయునని తీర్మానించుకొనిరి. ఇత్తెరంగున, గోత్రములన్నియు నీహత్యయందు జేరునట్లును, ముహమ్మదు వంశస్థులీప్రయత్నము దిక్కరించినను, అశక్తులగు నట్లునేర్పాటుచేసియుండిరి. పరిశుద్ధుఁడగు ప్రవక్త దేవప్రేరితుఁడై, మక్కానువిడచి

అదే రాత్రి తన పడకపై తన అల్లుడగు అలీని విడచి కిటికీ నుండి తప్పించుకొని జూను మాసము 622 నాడు ఏత్రాబు నకు చేరెను. (ఇది ప్రవక్తపట్టణము.) ఇది హెజీరా యన బడిన పలాయనము. ఇప్పటినుండి నూతనయుగము ప్రారంభ మగుచున్నది. ఈ యుగముయొక్క ప్రస్తుత సంవత్సరము 1350. మదీనా వారాతని ప్రబోధము నంతలో యంగీకరించి, అందరు ముస్లీములైరి. వారుఆయనను తమకురాజుగా నేర్పాటుగావించు కొనిరి. ఇత్తెరంగున స్వంతవారి వలన నిషేదింప బడిన రాయి, మదీనా ప్రభుత్వమునకు కిరీటమయ్యెను.

## మదీనాయొక్క రాజుగా నెన్నుకొనబడుట.

---

మదీనాకు రాజైనను, తనపూర్వపు నిరాడంబర జీవితము నుల్లంఘింపక, ప్రజలకు నీతిగరుపుటయె యాతని కార్య క్రమమైయుండెను. అద్వైతారాధనకు ప్రజలను బిలచుటయు, యిస్లాము యొక్క నీతి ధర్మములను, సాంఘిక ధర్మములను నేర్పుటయు ఆయనవిధియై యుండెను. పంచప్రార్థనా పఠనము తానే స్వయముగా మసీదులో జరుపుచుండెను. స్వజాతీయుల లోని తగవులను తీర్చు చుండెను. జాతీయ సౌకర్యార్థము తన

కాలమంతయు వినియోగించుచుండెను. విద్యా, వాణిజ్య, పారిశుద్ధ ప్రవృత్తుల నభివృద్ధి పరచుచుండెను. పేదసాదల కష్ట నిష్ఠురముల పరిశీలించుచు, వాని, నిర్మూలింప బ్రయత్నించు చుండెను. పేదలకొఱకే చిన్నపనియైనను జేయుచుండెను ఎన్ని పనులున్నను, ఆట పాటల యందు యువకులతో నేకీ భవించి. భావ్యమగు జాతీయ అన్యోన్యము నుద్భజము గావించుచుం డెను. ఇంటికడ, తనభార్యలకు యింటిపనులయందు తోడ్పడు చుండెను, మధ్య రాత్రియందు, యితరులు నేద గొనుచుండ నాతఁడు, తన పడకవిడచి, సృష్టికర్తను పూజించుట యందెం తో కాలముగడుపుచుండెను. అందువలన కొన్నిమారులాతని కాళ్లుబ్బుచుండెను.

## ఆయన సందేశము ఈ దిగువరీతి సంక్షిప్త పరచవచ్చును.

---

1. ఆయన దేవుఁడొక్కఁడే యనియు, తక్కినవారు, దూతలైనను, మనుష్యులైనను, ఆయనచే సృష్టింప బడినవార నియెను. మనుష్య రూపమందైనను, విగ్రహముల యందైన ఆయన అవతరింపగలఁడనియు ఆయనద్వారా సంతానము లుగుచున్నదనియు, లేక ఆయన ఒకవ్యక్తికి జన్మించిన వాఁడని యు తలంచుట, ఆయనను హీన పరచుటయై యున్న దనియు,

ఆయన మాత్రమే జీవములు పోయగలఁడు, తీయగలఁడనియు, సంస్కార కర్తలు, ప్రవక్తలు ఆయన యొక్క సేవకులనియు, వారిలో నెవరికి దేవ శక్తి లేదనియు, ప్రజలందరు అయననే ప్రార్థించ వలయుననియు, ఆయనయందే తమ విశ్వాసముంచ వలయుననియు ప్రబోధించెను.

## మానవ జన్మయందలి యుద్దేశ్యము.

2. సాంఘిక, వైధిక, ఆత్మీయాది ప్రవృత్తుల నభివృద్ధి చేసుకొనుటకు దేవుడు మానవుని జన్మింప జేసినాఁడనియు, నిట్టి యుద్దేశము పరిపూర్ణమగుటకు, నా నా జాతుల యందు ప్రవక్తలను లేపుచున్నాఁడని బోధించెను. ప్రవక్త లొక్కజాతి యందే కలరనుట సరి కాదనిచెప్పెను. ఏలయన, అట్లుతలంచిన చో. దేవు డన్యా యస్తుడని తేలు చున్నది. ప్రతి ప్రవక్త సత్యవర్తనుఁడని నిరూపించెను.

3. కాలమున కనుగుణ్యము గా, దేవవాక్కు ప్రతి యుగమునందు ప్రత్యక్షమయ్యెననియు, నీకాలమునకు తా నేర్పాటు చేయ బడెననియు దెలిపెను. అక్కారణము చేత ఖురాను పూర్వము మానవులకొసఁగ బడినవానికన్న సక్రమ మైన ధర్మశాస్త్రమనియు, మానవులు దానినంగీకరింప వలయు ననియు చెప్పెను.

## శాశ్వత మగు వాక్యము.

4. భగవంతుండు, తానుజీవించియున్నవాడనియు ప్రేమ కలవాడనియు తెలుపుటకు తన సేవకులతో నెల్లయెడల మాట్లాడుచున్నాడనియు ఆయనను నామోదించినవారలు దానియందలి రహస్యమును గ్రహింప గలరనియు గదపెను.

## సమాధాన కరమగు జీవితము.

5. వివిధ మతభేదములున్నను, ప్రజలు సమాధానముగా నుండి, మతవిషయములయందు దొకరితో నొకరు తగవులాడరాదని బోధించెను. సత్యమెవరికడనైన గలదేని, యతండు తగవులాడ బనిలేదు కాని, అసత్యము నితరుల కందియ్యవలయును, అంతట నది ప్రజలను వశీకరించును. అందుకై జేసి, క్రైస్తువులుకూడా తమ మసీదులో ఆరాధించుట కిచ్ఛగించెను. ఇది గభీరమగు నాతని హృదయ యౌదార్యము. ఈయిరువది యవశతాబ్దము నందైన నిట్టి ఘనకార్యము చూడలేము.

## ఆత్మీయబౌతిక అంతర్భాంధవ్యము.

6. అత్మీయము, బౌతికమని మానవ జీవితమునందు రెండు విభాగములు కలవు. వానిని వేరుపరచ నలవికానంత

దట్టముగా నొకనియందొకటి బంధింప బడియుండి, ఒకదాని క్రియ లింకొకదానిపై ప్రతిబింభించు చుండునని నిరూఢ పర చెను. ఆత్మశుద్ధిలేని మతాచారము లెన్నియున్న నేమిలేదనియు, జడప్రకృతి అన్యోన్యములేక మనోభావము కుదుటబడదనియు చెప్పజొచ్చెను. మానవుడన్నివిధముల పరిపూర్ణుఁడు కావలయు నన్న యీరెండుప్రవృత్తులను పరిగణించుట సమంజసము.

## నీతి.

7. నీతి విషయలో, మానవులందరు పరిశుద్ధముగను, అకళంకముగను జన్మించియున్నారని, తదుపరి కానవచ్చు చెడు గుణములన్నియు, అక్రమ విద్యచేతనో లేక, పెంచుటయందలి లోటుపాటుల చేతనో కలుఁగుచున్నవని తెలిపెను. అందుచేత, ఆయన యెల్లప్పుడు, ప్రౌఢవిద్య, సరియైన క్రమశిక్షను గూర్చి వ్యవహరించుచుండెడు వాఁడు.

## ఆత్మశుద్ధి.

8. తనయందును, అఖిలభూతములందు సరియగు మా న్పుకలుగుటయే మంచినీతి ధర్మములయొక్క యుద్దేశమనుచుం డెను. ఏవిషయమైనను ఒకవైపున నేచూచెడువాడు కాడు. అన్ని

దిశలయందు దిలకించుచుండెను. పశ్చాత్తాపము, మమకారము అ
న్ని సమయములయందవసరమను మాటనాయన యంగీకరింప
డు. ఎవఁడైన నింకొకనిచే బాధి పబడిన, బాధించువాని గుణ
ము నెట్లుబాగుపరచ వలయునా యని తలంచ వలయుననుచుం
డెను. వాడు గౌరవనీయ్యుఁడయ్యెనేని, తరుణమిచ్చినచో భావి
కాలమున నాతఁడు తన గుణమును చక్క బెట్టుకొన గలఁడు.
ఇటువంటి వాడు పశ్చాత్తాప మునకు, దయకును పాత్రుఁడను
చుండెను. అట్లుగాక నీయొక్క క్షమాపణము, నీపట్లదౌర్బల్య
సూచకమనియు లేక భీతచిత్త చిహ్నమనియుతలంచి తనదుర్మా
ర్గమున నెక్కుడు సాహసమువహించినచో తీక్ష్ణమగు చర్యలు
వానిపై జరుపుట ధర్మములేకున్న నిన్నేగాక, యితరుల సహిత
మాతడు బాధింప గలఁడు, వాని దుష్క్రియల పరిమాణము
ప్రకారమాతని శిక్షించవలయును, కాకున్న, నిరవంద్యులును,
పేదలును అకారణముగా బాధింపబడెదరు.

## యుద్ధముల యెడల నాతనిబోధ.

9. పగసాధించు యుద్ధములు చేయరాదని చెప్పెను.
యుద్ధము ప్రాణరక్షణార్థమేర్పరుపబడినది, అట్లయ్యు, శత్రువు
లు, పశ్చాత్తాపమునంది, సందిజరుప నిశ్చయించుకొనిన మీరు
వెంటనే సమాధానపడవలయుననెను.

10. మానవుని ఆత్మ శాశ్వతమైనదిగా సృష్టింపబడినం దున, శారీర మరణముతో, ఆత్మకు మరణము లేదని తెలిపెను, వివిధపదార్థములలో సమ్మిళితముకాక, నభివృద్ధిపొందుచు పెం పొరుచుండును, ఇవ్విధముగా, పాపులు, దుర్మార్గులుకూడా, శుద్ధీకరణశిక్ష ననుభవించి వారిపాపేచ్ఛలు పోయినపిదప, అల్లాయొక్క శాశ్వతకృప ననుభవించి ఆక్షయ మార్గమునందు డుగిడగలరు.

# మక్కావారుల దుండగము.

---

తనసిద్ధాంతములను మదీనాలో ప్రబలజేయుటకు సదు పాయము లేర్పడినవనియు, అనేకులాతని నంగీకరించిరనియు మక్కావారు గ్రహించి ఆయనపై నెన్నియో దోపిడీలను గా ంచిరి, కాని ప్రతిప్రయత్నము విచ్ఛిన్నమయ్యెను. ఈ సంద మునందుకూడా ఆయన వారికన్న నధికుడను మాటతేట య్యెను. వారు ముస్లీములకన్న ముప్పాలు అధికులైనను, ధికసంఖ్యాకులు వారిపక్షమునయున్నను, వారుపటుతరమగు కేర్పాటుల చేసుకొనియున్నను, వారల్లప్పుడపజయము నందు చుండిరి. ఇదిచిత్రమైన సంగతి. ముస్లీములు విజయముగాం చగా మక్కావారు మిగుల నిరుత్సాహ పడుచుండిరి. కొన్ని మారులుముస్లీములు ఆటకపరుపబడిరిగాని వాస్తవముగానది

అపజయముకాక తుదకు శత్రువులపట్లభయంకరమగు నపజయ మగుచుండెను.

శత్రువుల ప్రతిదాడియు ప్రత్యక్షమగు ప్రాయశ్చిత్త మున నపజయ మగుచుండెను. వీనియందులి ప్రాముఖ్యమగు విజయము, తానరేబియాకు రాజగుటయే. మరొక విషయమే మన, యుద్ధసమయాన నిరూపించగల నీతిక్రియలు తనజీవితము నందలి సంఘర్షణములయందు చూపగలిగెను దీనిద్వారా నా తని నీతిన్యాయ పరిపాలన స్థిరీకరింపబడెను. ఈసంఘర్షణలవలన, తనఅనుసరుల యందెట్టి ఆత్మత్యాగము భయభక్తికలుగజేసె నో ప్రపంచము గుర్తెఱిగెను.

మచ్చునకు, బదర్, ఒహద్, హూనేయిన్,

## యుద్ధముల నీక్రింద వర్ణించుచున్నాము.

---

పరిశుద్ధుడగు ప్రవక్త, సంఘసంస్కరణ కొడంబడి, యూదులు క్రైస్తవులు దేవదృష్టియందు న్యాయబద్ధులై జీ వించునట్లును, ఉభయులు మదీనాను సంరక్షించుటయందేకీభ వించునట్లు, వారికిసరిసమాన హక్కులనొసంగి వారికొక నిబంధ ననొసంగెను. ఇప్పటినుండి ఆయనదేవప్రవక్త, దేవాజ్ఞానుసార ముగ నాతఁడు మదీనాయందును, పరిసరములయందును గల

ముస్లీము, యూదా, క్రైస్తవుల జన్మహక్కుల సంరక్షణకర్త. ఆయన దేవప్రవక్తయగాక రాజ్యాంగనమునకు ప్రధానామాత్యుఁడు. ముహమ్మదుప్రవక్తగా పరిగణింపఁబడుటకు యూదులియ్యకొనకున్నారు. మక్కాయొక్క కురేషీయులతో వారు సంధిచేసుకొని, పరిశుద్ధుడగు ప్రవక్త మదీనాలో ఒకసంవత్సరముండు నప్పటికి ఒకవేయికన్న నెక్కుడు మక్కావారలు, అజ్ఞానులకు తండ్రియనబడు, అబూజహీల్ ఆదిపత్యముక్రింద ఆయన ప్రదేశముపై దాడివెడలి బదర్ కు సమీపమున మున్నూరుగురు ముస్లిములతో సంఘర్షించిరి. మున్నూరుగురగు విశ్వాసులు వేయిమందిని జయించిరి అబూజహీల్ యుద్ధములో చంపబడెను, అతని యనుచరులలో కొందరు చంపబడిరి కొందరు చెఱపట్టబడిరి.

మక్కానుండి వెడలిపోయిన మూడు సంవత్సరముల పిదప మక్కానుండి మూడువేల శత్రుబలము మదీనాపైకి వెడలిరి. మదీనానుండి మక్కాకు రెండువందల మైళ్లదూరమైనను విజయమునందెదరను సంపూర్ణ నమ్మకముండుటచే, శత్రువులు మదీనా సరిహద్దుల పరక్రమించిరి. మదీనానుండి యెనిమిది మైళ్లదూరమందున్న ఒహాదునకు, ప్రవక్త వేయిమందితో వారి నెదుర్కొన బోయెను ఆయన శిబిరములలో నొక శిబిరము వారు, ఆయన నియమములను గ్రహింపకపోవుటచే, పరిపూర్ణవిజయ మపజయముగా మారిపోయినది, ముస్లిములెన్న

యొడలదిగ్విజయముగాంచుచుండినను, యీచిన్న పౌర బాటుచేత శత్రువులు వారిపై దారుణముగ యుద్ధము జేయుచుండిరి. అందుకై జేసి ఒకమారు ముస్లిములు చాలాదూరము తరుమబడిరి. మహమ్మదొక్కడు మాత్రము శత్రువుల మధ్య చిక్కుబడెను. ఈసందర్భమున, తనవారు పారిపోయినను, మహమ్మదుమాత్రి మొక్కయడుగైన వెనుకదీయ లేదు. ముస్లిములీదృఢనిశ్చయుత నెఱింగి. ఆయనకుతోడ్పడ ప్రిబలప్రయత్నము జేసి పదునలువు లురు మాత్రము శత్రుదళము భేదించుకొని యాతనికడ కేగ గలిగిరి. ఇంతలో ప్రవక్తరాతిదెబ్బతగిలిస్మృతిదప్పి నేలగూలెను ఆయనను కాపాడ ప్రియత్నించుచున్న ముస్లీముల శవములాత నిపై ముమ్మరముగా కూలెను. ఆయన హతసాక్షియయ్యెనని ప్రజలు తలచుచుండిరి. ఈవార్తవిని, తనశాత్రవులొక్కపెట్టున నిరాసజెందిన వలపుకాండ్రివలె తమ ఆయుధములను నేలవైచి యేడ్చుచుండిరి. ఈవదంతి నెఱుగని ముస్లిము యోధుండొకడు, మార్గమున బోవుచు నిరాశాకారణ మెఱుంగగోరెను, ప్రివక్త చనిపోయెనను వార్తదెల్పి, దారుణయుద్ధమునకదియె యదను, నియు వారి ప్రియనాయకునివెంట చనిపోయెదమనియు వా, డుడివెను. అంతట కరవాలముచేబూని శత్రువులపైలంఘించెను కానిచనిపోయెను. అతనిదేహమున డెబ్బది గాయములు కాన వచ్చెను.

పరిశుద్ధుండగు ప్రివక్త, శవములకింద్రబడి జీవములతో

యుంటబయల్పడెను. ఈవార్త కార్చిచ్చువలెప్రభలగా, ముస్లి ము యోధులు పునరుజ్జీవముగలిగి, శత్రులను ధ్వంసము జేసిరి. ఒకముస్లిము యోధుడు తనబాంధవునొకని వెదకుచు, నాతడు దెబ్బలుతిని కొనయూపిరితోనున్నట్లు కనుగొనెను. గాయముల తో పడియున్నవాడాతని మిత్రునిజూచి, ప్రవక్తక్షేమవార్తనారసి. ప్రజ్వలిత ముఖారవిందముగలవాడై "సంతోషముతోనేని ప్పుడు చనిపోయెద" ననియెను. తనయూపిరి విడచుచు, తన చుట్టములతోనిట్లు చెప్పదొడగెను, "దేవప్రవక్తయగు ము హమ్మదు మనమధ్యనున్నాడు. ఈవిషయము దేవునికి మనము ఉత్తరవాదుత్వమును గలిగియున్నాము. ఈదైవతత్వమును సమర్థించుట మీపని. మీవిద్యుక్త ధర్మమును నిర్వర్తించుట మీపని" ఈవిధముగా ముస్లిములు ప్రవక్తను విశ్వసించుచుం డిరి. ముస్లిమువనితలేమి పురుషులకన్న తీసిపోలేదు. ప్రవక్త చనిపోయినాడనువార్త మదీనాకుచేరినప్పుడు, మదీనావారందరు నగరమువిడచి దుఃఖితహృదయులై యుద్ధరంగమున బ్రవేశిం చిరి. సజీవుడగు ప్రవక్తనుగలిగి యుద్ధరంగమునుండి మరలి వచ్చుచుండిన ముస్లిము సిబ్బందివీరికి కనబడెను. ఒకవనితప్రవక్త యెట్లున్నాడని యోధులలో నొకనినడిగెను, ప్రవక్త క్షేమము గా నున్నాడని తెలిసియు "అమ్మా. మీతండ్రిచనిపోయినా" డనెను. "నాతండ్రి సంగతిగాదుకాని, ప్రవక్త యెట్లున్నాడని, కంగారుతోనడిగెను. మరల నాతడు. నాయమహృదయానందో

ళనము నిర్మూలింపజేయక "సోదరీ నీయిరువురు సోదరులు మర ణించి" నారనెను. నాయమచరబురలాడి నా సోదరులగతి నేన డుగుటలేదు పరిశుద్ధుడగు ప్రవక్తయెట్లున్న సంగతి మాత్రము చెప్పెదవాలేదా యనెను. ప్రవక్త క్షేమముగా యున్నాడని తెలిసికొని "దేవునికి స్తోత్రములు దేవప్రవక్త జీవించియున్న లోకమంతయు జీవించుచున్నది. ఇతరులతో నాకుపనిలేదు అనెను. ప్రజలపట్ల ప్రవక్త పరిపూర్ణపరిశుద్ధమగు మూర్తిభవ మును, నిజమగు బాంధవ్యమును లేనిపక్షమున ప్రవక్తపైజనులకిం తటి, నిష్కళంకమగు భక్తియుసంబంధము ఏలాగునకలుగగలవు?

# హొనెయను యుద్ధము ప్రోక్తయాజ్ఞ.

హొనెయను స్థలమున యిరువైపుల విలుకాండ్రచే నావరింపబడిన పర్వతమార్గమున నొకమారు ముస్లిముయోధు లుపోవసందర్భించెను. అంబులను వేయుచున్నశత్రుల యునికిపట్టు ముస్లిములెరుగకుండిరి. ఈయాకస్మికమగు సంఘర్షణమువలన ముస్లిములగుఱ్ఱములు, ఒంటెలు, బెదిరిపోవుటచేత స్వారిచేయు వారు సమర్థింపలేకపోయిరి. పదియారుగురితో ప్రవక్తనాలుగు వేలవిలుకాండ్రమధ్య చిక్కుబడెను. తక్కినముస్లిముయోధులు పరాజితులైరి. ప్రవక్త నిర్భీతుడై శత్రువులపైకి గుఱ్ఱమును నడిపించెను. ఇదికాంచి, తనకొలది మిత్రులు తమ గుఱ్ఱములను

దిగి, ప్రవక్త గుఱ్ఱపు కళ్ళెమును పట్టుకొని భీతచిత్తులై యిట్లుడి విరి " శత్రువులు జయశీలురై పైకివచ్చుచున్నారు, ముస్లిము దళము హతమైనది, ఇస్లాము మతసంరక్షణ మీసుఖసౌఖ్య ములపై నాధారపడి యున్నది, అనుగ్రహ ముంచి, చెదరిన ముస్లిములు యేకమగునట్లు నీవు వెనుకకురమ్ము " నాపుడు ప్రవక్త " నా గుఱ్ఱముకళ్ళెమును విడచిపెట్టుము, నేను దేవప్రవక్తను, అబద్ధికుడనుగాను నన్ను హానిజేయగలవాడు చేయ నిమ్ము " అనిపలికి తనతో మిగిలియున్న పదియారుగురు సహ చరులతో శత్రువులపైకదిసెను. మానవహస్తమాతనికి హాని చేయులేదు. అంతట ప్రవక్త తనయను చరులలో నొకని నిట్లు ప్రకటించుమని యాజ్ఞనిచ్చెను "ఓ, మదీనావారలారా, దేవ ప్రవక్తమిమ్మునుపిలచుచున్నాడు" పరిశుద్ధుడగు ప్రవక్తయొక్క స్నేహితుడిట్లు యుద్ధమునుగూర్చి వర్ణించుచున్నాడు. మా ఒం టెలు గుఱ్ఱములు అత్యధికముగా భయపడి యుద్ధరంగమునుండి రిపోవుచుండెను, వానిని ఆపి వెనుకకు మరల్చుట సాధ్యపడ దు. ఈపిలుపువిన్నప్పుడు వారుమృతులైనట్లును దేవుడేవారిని లచుచున్నట్లుగా నుండెను వెనుకకుపోవుటకు కొంతశోకించితిని. నాఒంటెను మరల్ప ప్రయత్నించితిగాని వీలుపడలేదు. దేవుని వక్తమమ్మును పిలచుచున్నాడను శబ్దమునాకర్ణరంధ్రములలో ప్రతిధ్వనించుచుండెను. నాఒంటెనన్ను యుద్ధరంగమునుండి కొం పోవుచున్నదని గ్రహించినప్పుడు, కత్తిదూసి ఒంటెనుచంపి పి

చ్చివానివలె ఆశోద్యము వచ్చిన వైపునకుపరుగెత్తితిని." యోధు లందరికీయనుభవమే కలిగినదని యాతడు వ్రాయుచున్నాడు. తిమ ఒంటెలను మరల్పగలవారు, మరల్చుచు, మరల్పలేనివారు వానినివిడచి ప్రవక్త వైపునకు పరుగిడిరి. దిగలేనివాడు తనగుఱ్ఱమునో ఒంటెనో నరికి, తన నాయకుని వైపు పరుగిడెను. ఇస్రాయేలు బూరధ్వనివిని సమాధులనుండి మృతులులేచు తెరగున. కొలది నిముషములలో నాతనినందరు ఆవరించిరి. ఇవ్విధముగా హానెయను యుద్ధమున, అధమసంఖ్యాకులగు ముస్లిములు విజయముగాంచిరి.

## ఆయన ధర్మచట్టము.

ముస్లిములు తమ ప్రాణసంరక్షణార్థమేతప్ప, తామె మొదట యుద్ధముచేయరాదని ఆయన తెలిపెను. స్త్రీలను, పిల్లలను, మతబోధకులను, వృద్ధులను యుద్ధముచేయజాలనివారిని, యుద్ధరంగమున చంపవలదని ప్రోత్సహించెను. తమ ఆయుధములను క్రిందనేయువారిని చంపవలదనెను. చెట్లునరుకుటయు, ఇండ్లుకూలగొట్టుటయు, పట్టణములు, లోయలునాశనముచేయుటయు తగనిపనులనియు, ఎవడేనియట్లుచేసెనని తానువినినచో, వానిపై నాతడాగ్రహించుననియు దెలిపెను.

# మక్కాపౌరులపట్ల ఆయనకు గలదయ.

ఆయనమక్కానుజయించి, దానికిరాజైనవెంటనే, ప్రజలు తమకెట్టియిక్కట్టు లాతనివలన చేకూడునోయని భీతిల్లుచుండిరి. ముస్లిములహింసలను కనులారచూడకపోయినను, వినియున్నవారగుటవలన, మదీనాపురవాస్తవ్యులు అమితాగ్రహపూర్ణులైరి. కాని, ఆయనమక్కాపురమున ప్రవేశించిన పిదప ప్రజలందరినిజేరబిలచి "ఓ ప్రజలారా, నాకు మీరొనర్చిన దుష్కృతములనెల్ల నేడుమన్నించుచున్నాను. మీకు ప్రతిశిక్ష విధింపక విడచిపెట్టుచున్నాను" అనినెను. ఆయన యుద్ధము చేసి, రాజుగా నెన్నుకొనబడకపోయినచో, నకళంకమగు మానవస్వరూపమును వహించియుండడు, యుద్ధానంతరము చూపవలసినటువంటి ధర్మమును చూపలేకపోయెడివాడు.

# ఆయనయొక్క ఆంతరంగికస్వరూపము?

యుద్ధములవలన, ఆయన హృదాంతరాళమున నిబిడీకృతమైయున్న, నీతిధర్మములు, సమాధానాకాంక్ష, క్షమాపణము; ప్రేమమొదలగు సులక్షణములు బహిర్గతములైనవి. ఏలయన, దయజూపుటకు శక్తిగలవానినేవాస్తవముగా దయార్ద్రహృదయుడనవలె; ధనికుడై, తనవిత్తమునుత్తమరీతి వ్యయపరచువానినే

ధార్మికుఁడనవలె. తనశత్రువులపై నాతనికి దేవుడువిజయము నొసగినాఁడు. ఆయనయు దానికనుగుణ్యముగా ప్రజలను క్షమించినాఁడు. ముహమ్మదుని రాడంభర జీవితమునుబట్టియు, తనకుగలిగినకలిమిని, నిరుపేదలకు పంచిపెట్టుటనుబట్టియు, దేవుఁడాతనికి రాజ్యాధికారము నొసగినాఁడు.

## ఆయనయొక్క అంతిమ హెచ్చరికలు.

క్రీ.శ. ఆ630 వ, సంవత్సరమందు, తానరువదియేండ్లవాఁడైనప్పుడు, పరిశుద్ధుఁడగు ప్రవక్త రెండువేలమందిముస్లిములనుసేనగాగొని, సిరియాదేశమునుండి దండెత్తి వచ్చుచున్నటువంటి క్రైస్తవులనెదుర్కొనుటకు టాబుక్ అను ప్రదేశమునకు బయలుదేరియుండెను. కాని యుద్ధముమాత్రము జరుగలేదు. ఆయన మదీనాకు మరలివచ్చినపిదప, అరబ్బియులు గుంపులుగుంపులుగా ఆయనకడకేగి, ఆయనను గౌరవించి, అంగీకరించచు, తమకు తెలివితేటలను గరవునదిగా వేడుకొనిరి. ఈమరుసటి రెండుసంవత్సరములు, అనగా క్రీ.శ. ఆ631, ఆ 632 సంవత్సరము లిట్టి బహూకరీవులలోనే గడచిపోయినవి. మహాప్రాతికముహ్వీన మాతనిపనియిప్పటికి పరిపూర్ణమైనది. ఖురానుగ్రంథమీవిషయము తేటగా ప్రకటించుచున్నది. ఆయనకీసంగతి తెలిసియే యున్నది. జూర్ కాడానెల 25 వ తారీకునకు ( సరియైన

ఫెబ్రివరి 23 వ తేది, ఆ 632 వ సంవత్సరమున) ప్రవక్త అసం ఖ్యాకులగు ముస్లిములతో మదీనానువిడచిపోవుచున్నాడు. తాను మక్కాలో ప్రవేశించి, పుణ్యక్షేత్రయాత్ర కనుగుణ్యమగు ధర్మచట్టములను నివర్తి చేయకపూర్వమే, ప్రవక్త, ప్రజలనందరి నొకచో జేరగూర్చి, యీదిగువరీతి ప్రసంగించుచున్నాడు. ఆ మాటలు నేటికి ముస్లిముల హృదయక్షేత్రములయందు నూతన మెల్కలెత్తుచున్నవి. "ప్రజలారా, నేజెప్పునదాలకించుడి. మీతో మరొకయేడు నేనుందునో లేదో నాకు తెలియదు. దినములలో, ఈదినమెట్లుపునీతమైనదో, అట్లే మీజీవితములు, మీ ధనధాన్యాదులు, మీరు దేవునిసముఖమున, నగుపడువరకు మీ స్వాస్థ్యములును పునీతములు నైయున్నవి. మీరు ప్రభువు నెదుట నిలచు కాలమున్నదనియు, ప్రభువు మీరు చేసిన ప్రతిచిన్నకార్యమునుగూర్చి లెక్కయడుగుననియు మరువకండి. మీకు మీ భార్యలపై నధికారముకలదు. మీభార్యలకు మీపై నధికారము లదు మీభార్యలయెడల కరుణాంతరంగులైయుండుడి. దేవుని ప్రాచీద్వారామీరువారిని స్వీకరించియున్నారు. దేవునియానతి చొప్పున వారిదేహములను మీరు స్వాదీన పరచుకొనియున్నారు"

"మీబానిసలవిషయమై యొక మాట చెప్పుచున్నాను. మీరేమితినెదరో అట్టిభోజనమునే వారికిడుడి; అట్టివస్త్రములనే వారి ధరింపనిడుడి. మీరు క్షమింపలేనిపాపము వారుచేసిన

యెడల వారిని వెడలగొట్టుడి. వారు దేవునిసేవకులగుటవలన, వారిని కష్టపెట్టదగదు."

"మానవులారా, నామాటలాలకించి, విషయములను చక్కగా గ్రహించుడి. ముస్లీములందఱు అన్నదమ్ములనుమాట గట్టిగానెఱుగుడి. మీరందఱొక్కటే సోదరత్వమున బంధింపబడినవారు. చట్టము ప్రకారమొకనికి స్వాస్థ్యమైన దేదైనను, వాని యిష్టపూర్వకముగా నొసగినతప్ప, నింకొకనిభుక్తము కాజాలదు. అన్యాయము చేయకుండునట్లు జాగ్రతపడుడి.

"ఇప్పుడిచ్చట నున్నవారు, లేనివారికీ విషయములను జెప్పవలయును. సాక్షాత్కారముగా వినినవానికన్న, నితరులుచెప్పగావినినవాడు విషయములను జ్ఞాపకముంచుకొనగలఁడు"

— అమీర్ అలీ.

హజ్జతుల్ ఇస్లాము అనునదొక పుణ్యక్షేత్రియా దీనికి సందేశయాత్రయని యర్థము. దీనినే హజ్జతుల్ బాల ని చెప్పుదురు.

"ప్రజలు జాగ్రత పడుటకును, దేవుడొక్కడే యని జ్ఞానముగలవారు జ్ఞాపకముంచుకొనుటకును, నిది సకలమానవ కోటికి సందేశమై యున్నది" (పరిశుద్ధమగు ఖురాను 14వ. అధ్యాయము, కడపటి వచనము.

రబ్బియల్ అవ్వల్ యొక్క 12వ. దినము (జూను 8వ. తేది, క్రీ.శ. 632 వ సంవత్సరము ) సోమవారమునాడు, మధ్యాహ్నము ఆయనమదీనాకు మరలివచ్చుచున్నాఁడు అప్పుడు, మానవదేహ పంజరమున నియమితప్రకారము నిలచియుండిన దేవుని వెలుగు, దానినివిడచి, అమృతపదవి నలంకరించుచున్నది. ఆయన దివమందెనుగాని ప్రజలకొఱకు, నూతనమును, పరిపూర్ణమునగు పరిశుద్ధ ఖురానవబడిన సమాదాన కరమగు మతమునుకూడా విడచి వెళ్లెను.

# రెండవ అధ్యాయము.

తక్కిన ప్రవక్తలకన్న సుత్తమండనుటకు, యిస్లాము మతప్రవక్తయైన
ముహమ్మదు యందుగల సూత్రకట్టా దర్శములు.

## 1. ప్రపంచమంతటికి ప్రవక్త.

ముహమ్మదు ప్రపంచమంతటికొఱకు ప్రవక్తగానుద్భవించెను. తక్కినవారు, తమతమ ప్రత్యేక మతముల కొఱకే జన్మించియుండిరి.

## 2. పరిపూర్ణమగు మతము.

సంపూర్ణమును, అనుదినజీవితమునకనుకూలమును, గ్రాహ్యమును, ఎల్లప్పుడుండునదియునగు ధర్మశాస్త్రమాతని కొస

గబడెను. తక్కినపత్రికల మతనిబంధనలు ఆయా కాలములకు మాత్రమనుకూలమై, సర్వప్రపంచమునకు సమ్మతమైనవికాను యున్నవి.

## 3. బహిర్గతమైన గ్రంథము. పరిపూర్ణమగు వేదము

మానవప్రవృత్తుల కనుగుణ్యమును నీతిధర్మసంయుక్తము నగు గ్రంథమాత్రనికిమాత్రమే యొసంగబడినది, ఇస్లాముమతము నిరసించువారుకూడా దీనియొక్క యకళంకితమునుగూర్చి కొనియాడుచున్నారు. మచ్చునకొక యుదాహరణమువ్రాయుచున్నాను. క్రైస్తవగ్రంథకర్తయగు సర్ విల్లియంమ్యూర్ యిట్లనుచున్నాడు "పన్నెండు శతాబ్దములు పర లిపిసమ్మిళితము కాక, పరిశుభ్రముగానున్న గ్రంథము ప్రపంచమునందు యింకొటి లేదనుకొనుచున్నాను."

## 4. ఉద్రేకపూరితులగు సంస్కారకర్తలు.

ఇస్లామనబడునట్టి, ముహమ్మదు ప్రవక్త యొక్క మతమునకు మాత్రము దేవుడు, ప్రతియుగాదియందు, సంస్కారకర్తనుద్భవింపజేతుననియు, నట్టిప్రవక్త పరిశుద్ధమగు ఖురాక

యొక్క నిజస్వరూపమును ప్రజలకు వెల్లడిచేయుననియు సెలవిచ్చియున్నాడు. ఇతర మతప్రచారకులిట్టి వాగ్దత్తము వారికిని గలదనిచెప్పలేరు.

## 5. ఈనూతన గ్రంథముయొక్క సజీవమగుభాష.

సజీవమగు భాషయగు నరబ్బీ భాషలో వ్రాయబడిన గ్రంథ మొసంగబడిన ప్రవక్త ముహమ్మదుతప్ప వేరెవరుగాదు తక్కిన ప్రవక్తల గ్రంథముల భాషలన్నియు మృతమై వాడుకలో లేవు.

## 6. సజీవుండగు దేవుండు.

పూర్వకాలము ప్రజలతో మాట్లాడిన విధముగా నేడు గూడా దేవుండుతనవారితో మాట్లాడుచున్నటువంటి దేవునిని జూపినప్రవక్త యీయనయే, తక్కిన ప్రవక్తల అనుసరులు, దేవుడిప్పుడు ప్రజలతో మాట్లాడడని తలంచుచున్నారు.

## 7. మతగురువులు.

సాధారణముగా, పూజారులను మత గురువులను దైవములుగా పరిగణించు నభిప్రాయమును భిన్నపరచి నిజమగు గురువులుండవలసిన లక్షణములను ఆయన కనపరచినాడు, అం

తియొకాక, వర్ణభేదములను, జాతిభేదములను నిర్మూలించి, మతాచారములయందు జరుగు వ్యర్థమగు వ్యయములను ఖండించివేసెను.

## 8. విద్యా విషయము.

స్త్రీపురుషులకు, సామాన్యవిద్యయేగాక, తదితర శాస్త్ర సమ్మతమగువిద్యల నొసగుటయందీతని దీసిపోయినమానవుడింకొకడు లేడు.

## 9. కార్మిక, వ్యాపార సమస్య.

ధనికులగు ముస్లిము పెట్టుబడి దారుల వలన నూటికి రెండున్నర వంతున ధనము బలవంతముగ సేకరించి, పేదసాదలకు పంచిపెట్టుచుండెను. ఈ ధర్మమునకు జకత్ అనిపేరు. ఈ విధముగా రషియాదేశములో భయంకరమగు వైషమ్యమునకు కారణభూతమగు బోల్షెవిజమను ప్రచారమునకు అరేబియాలో చోటులేకుండ జేసెను. ఈ విధముగా మత గురువులందరిలో తడగ్రగణ్యుండగు చున్నాండు,

## 10. స్త్రీల హక్కులను సేకరించిన నిపుణుండు.

స్త్రీల హక్కులను, వారిగౌరవమును, స్థిరీకరించిన పురు

షో త్తముఁడీతఁడు. తల్లిపాదములకడ స్వర్గముకలదనియు, పురుషులకువలె స్త్రీలకు సర్వహక్కులు గలవనియు, నీతనిద్వారా, ప్రపంచము ప్రిప్రిథమమున గ్రిహించినది.

## 11. బానిసత్వము.

బానిసలకు స్వేచ్ఛనొసగ సమకట్టినవాఁడు యీయనకు ప్పయుంకొకప్రివక్తకానరాఁడు ముస్లీముమతము నవలంబింప ని ప్రిపంచమంతయు, బానిసత్వపు బంధనలదగుల్కొని యున్న నాఁడు, ముస్లీములగు బానిసలు హిందూదేశమునేలుచుండిరి.

## 12. ఔదార్యమగు నాతనిమనస్సు.

తన్నుహింసించుచున్న విరోధులయెడల నిసుమంతసీర్ష్యైన, పగయైననుజూపక, వారి యెడల నెంతయూనుదార భావముగనపరచెను. ఆయనవారియొక్క సుఖజీవనముకొఱకు దేవునికిప్రార్థించుటయే, యింతటికి దార్కాణము. గొప్పప్రివక్తలని పేరుపొందిననోవా, మోషేలుఅటుచేయక వారిశత్రువులను సంహరించవలసినదని దేవునివేడుకొనిరి.

## 3. క్షమాపణము

తదితర ప్రవక్తల జీవితములయందైనను, లేక ప్రిపంచ

చరిత్రలయందైనను మచ్చునకైన గానరానంత క్షమావణ, యీ ప్రవక్తమాత్రమే తనశత్రువులపట్ల చూపినట్లు తేలుచున్నది. ఆయన మక్కాకువచ్చినతరువాత, అరేబియాకు రాజుగా నెన్నబడుసందర్భమున, తనరక్తముకొరకు తృష్ణగొనుచుండినయాతని, భయంకరమగుశత్రువులు తనకనులయెదుట నిలచియుండిరి. వారు 13 సంవత్సరములాతనిపై సాగించిన, పలు తెరంగులగుహింసల కనుబంధముగా వారుమరణశిక్ష కర్హులై యుండిరి. ఐతే, వారి నొక్కమాటయనక, వారిపై నేమాత్రము కోపములేదనియు, వారికి స్వేచ్ఛనొసగుచు, గౌరవనీయులగు పౌరులుగా భావించు చున్నా ననియు బ్రకటించెను. ఇట్టిసందర్భమునెందైన జరిగియుండెనాయని ప్రపంచచరిత్రల నాద్యంతము పరిశీలించువాడు నిరాశతోయూరుకొనవలసినదే,

# మూడవ అధ్యాయము.

## ముహమ్మదునుగూర్చి పరిశుద్ధమగుఖురాను గ్రంథమిట్లుడువుచున్నది.

"ముహమ్మదు దేవునియొక్క ప్రతినిధియైయున్నాడు. ఆయనను నమ్మువారు, నమ్మనివారికన్న స్థిరమనసు గలవారై బిడ్డారులయెడల దయగలిగియుందురు. ఓ, ముహమ్మద్, వారు వంగి సాష్టాంగపడుట నీవుచూచెదవు." పరిశుద్ధమగు ఖురాను 49 వ, అధ్యాయము, 29 వ, వచనము. ఈవిధముగా, దేవు

డు, తన తేజస్సునీతనిద్వారా, మనప్రార్థనల గూర్చియు, మన కుటుంబ సోదరుల యెడలగల ప్రేమానుబంధములను గూర్చియు, సాక్షమిచ్చునట్లు మనపైని నియమించియున్నాడు. ఈ వెలుగు ను వెంబడించువారికి నిత్యానందమిచ్చెదననియు నొప్పందము జేయుచున్నాడు.

“ నమ్మినసత్కార్యములను జేయుచు, ముహమ్మదుపైకి పంపబడినవరములు నమ్మువారిపాపములు పరిహారమగుచున్నవి, వారివర్తన బాగుపడుచున్నది. ఏలయన, ఆయనకులభించినది దేవునిగూర్చినసత్యము”

౪౭ వ అధ్యాయము మొదటి వచనము.

ఆయనచెప్పుచొప్పున ప్రజలునడచుకొనుటకు, ఆయన రాజగుటయులేక, నొకకుటుంబమునకు దండ్రియగుటయు కారణములు కావుగాని, యాతనిని బంపిన, దేవుని ప్రేరేపణవలన ఆయనచేయనున్న ఘనకార్యములను బట్టియు, వారాతనికి విధేయులగు చున్నారు.

ముహమ్మదుమీలో నెవరికినితండ్రికాడు. ఆయన దేవుని యొక్క రాయభారి ప్రవక్తలందరీతనివలన నిశ్చయింప బడు చున్నారు. దేవునికి ప్రతివిషయము తెలిసియేయున్నది”

౩౩ వ అధ్యాయము, ౪౦ వ వచనము.

ఆయననేల యనుసరించ వలయును? కారణములు పెక్కులుగలవు. తన జీవితరంగమునందెన్నిపాత్రలను ధరించెనో

అన్నిటియందద్వితీయమగు శక్తిని జూపియున్నాడు. బాలుడై, యువకుడై, భర్తయై, జనకుడై, ప్రజలనేలు భూపాలకుడై, కార్మికుడై, వ్యాపారియై, దేవునిసేవకుడై, తనస్నేహితులకు కడుగూర్చుమిత్రుడై, తనశత్రువుల నన్నివిధముల మన్నించు ధాతయై, అల్లాకుభక్తుడై, పేదసాదల కలుషములనుద్ధరించు సహాయకుడై. యితరులు తన్నుఘోరతరమగు శిక్షకులొంగదీసినను, సర్వముఓర్చుకొనిపోవువాడై, రాజ్యాంగధనముపై తనయధికారము చలామణిగాగలిగిన ధనికుడై, భగవంతుని ప్రకాశమును గుర్తెఱుంగదిరుగుచున్న నిరుపేదయై, న్యాయమూర్తియై, సమాధానకర్తయై, ప్రజలందరినొక్కవిధముగా ప్రేమించు ప్రాణప్రధాతయై లోకమునవిజృంభించిన. ముహామ్మదుకు చాటియైనవ్యక్తి భూలోకచరిత్రయందెందైన గానరాడు.

"నిశ్చయముగా దేవునియొక్క రాయభారిమీకు సరియైనమార్గదర్శకుడైయున్నాడు. దేవునియందును, రాబోవుప్రళయకాలము నందును విశ్వసించువాడు, దేవునిని విశేషముగా స్మరించుచుండును"

33 వ. అధ్యాయము. ౨౧ వ, వచనవ.

ఈ కారణముచేత రాజులు గౌరవనీయులగుచున్నారు.

"ఓమానవులారా. మీలోమీరు మాట్లాడుతెరగున, ప్రవక్తకు ప్రతికూలముగా మీనోరు తెరువకండి. అట్లుచేసినయెడల మీకెరుగకయే కళంకితులయ్యేదరు."

" ప్రవక్తకు ప్రతికూలముగా బలుక వెరచెడివారు దేవునివలన మర్యాదస్థులుగా పరిగణింపబడుచున్నారు. వారికి క్షమాపణయు. బహుమానములుగలవు"

౪౯ వ, అధ్యాయము, ౨, ౩, వచనములు.

తనశత్రువులాతనిని దూషించి, కడకు, యేమిచేతగాని స్త్రీయనిపలికి కష్టములపాల్గావించినను మిన్నకుండి తన దయార్ద్రహృదయమును గనుపరచినాఁడు. తనతోడివారలయెడల నీ తనికుండినంతటిప్రేమ, ప్రపంచమునందేతల్లికైనను తనబిడ్డలపై లేదనిచెప్పిన నతిశయోక్తికాదు. ఈతని కీతఁడే సమానుఁడు.

" ఓముహమ్మద్, నీవు వారియెడల నింతటియోర్పుగలిగియుండుట దేవుని కృపయైయున్నది. నీవు వారియెడల కఠిన మనస్కుఁడవై యున్నచో, వారు నిన్నువిడచిపోయి యుండెడివారు." ముహమ్మదు యుదారహృదయుఁడు, దేవుఁడుకరుణాంతరంగుఁడు. దేవునియానతి యీదిగువ వచనమునందేమనుచున్నదో చూతము.

" కాబట్టి, ( ఓముహమ్మదూ ) వారిని క్షమించుము. వారినిక్షమించుమని దేవునికి ప్రార్థించుము. ఈ విషయములు వారితో ముచ్చటించుము. నీవు నీమనస్సును స్థిరపరచుకొనిన పిదప, దేవునిపై నాధారపడియుండుము. తనపై నాధారపడిన

వారిని దేవుఁడు ప్రేమించుచున్నాఁడు."

3 వ, అధ్యాయము, ౧౫౯, వ, వ శ్లోకము.

ఇంత ప్రేమపూరితుడగు రాయభారి నెందేని జూచియుం టిమా? అల్లాకూడా, ఆయనను వెదకువారికొఱకు కృపా పరి పూర్ణుఁడై యున్నాఁడు. ప్రతి నరునకు మానవ స్వభావమైనై సర్గికగుణమై యున్నది, గాని భగవంతుడు తన యపారకృపచే మనహృదంతరాళములలో దయకనికరముల నిమిడ్చి, అందరి కంటెమిన్నగా ముహమ్మదును సుగుణ, కృపాసంపన్నునిగా సృ జించెను.

" నిజముగా నొకరాయభారి మీకడకువచ్చెను, మీరు భిన్న ముల ననుభవించుటకాయనకిష్టములేదు. ఆయన మీమంచినే యెన్నడును కోరుచుండును. నమ్మువారికిని రక్షణయు కృపనై యున్నాడు,

౯. వ, అధ్యాయము. ౧౨౮ వ, వచనము.

ఈ పవిత్ర, యీదైవవెలుఁగు తనమేలుకై పరిశ్రమి చెడు ఎందుకంటె దేవుఁడే తనకుతృప్తిగల్గునట్లు వాగ్దానము చేసెను. తనఋణము భగవంతుడేతీర్చి తనకార్యముల పావన పర్చెను.

" ఓ ముహమ్మదూ! రూఢిగా మేమొక తీర్మానము చేసితిమి అందునీవొనరించునవియు, వొనరింపబోవునవియు అల్లా క్షమిం

చి, తనదయ నీపై పూర్తిగావించి నినుమంచిమార్గమున నడుపును, ( అ· ౪౮. ౨ ) రాయభారి మనదగ్గర యేమియు వేతనము పుచ్చుకొనడు తనజీతము తనప్రభుకడ కలదు.
“ నేనీపని నిమిత్తమై జీతమునాశింపననుము మోడియు అందరి వలె డాంభికుడగానను”
“ ఈఖురానుప్రతిమానవజాతిని పునర్విమర్శించునదైయున్నది. తప్పక దీనిసంగతుల మీరు కొలదికాలములో గ్రహింతురు,,

అ, ౩౮: ౮౬, ౮౭, ౮౮, వచనములు.

“ సువార్తా వాహకుని గాను, ప్రజలందరిని హెచ్చరించుటకు మాత్రమే నిన్నుపంపుచున్నాము· ఐతే అనేకులకిదియెఱుక లేదు.

౩౪ వ, అధ్యాయము, ౨౮ వ, వచనము.

మరొకమారు, దేవుఁడు, ముహామ్మదు నీవిధముగా ప్రకటింప నాజ్ఞాపించు చున్నాఁడు:—

“ ఓ ప్రజలారా, భూనభంబుల కదికారియగు దేవుని రాయభారిని నేనని మీరందరు చెప్పుడి. ఆయనగాక వేరొక పాలకుడులేడు. ఆయన జీవమిచ్చుచున్నాఁడు· చంపువాఁడు నాయనే. కాన ప్రజలారా మీరందరును, దేవునిని, నిరక్షకుడగు దేవునియొక్క ప్రవక్తయగు ముహామ్మదును నమ్మి, మీరు రక్షింపబడునట్లు ఆయన చెప్పినచొప్పున నడచుకొనుఁడి.”

౭ వ, అధ్యాయము, ౧౫౮ వ, వచనము.

ఈజ్యోతి నేలననుసరింపవలయునో, యీరాయభారికేల లోబడవలయునో మీరెఱుఁగుదురా? జీవముపైని, మరణము పైని యధికారముగలిగి, సర్వలోకమును స్వాధీనముగా గలిగిన భగవంతునికడనుండి ఆయనవచ్చియున్నాఁడు. ముహమ్మదు మనవంటివాడే కాని, దైవోద్రేక మాతనిని చుట్టుకొని యున్నది. సర్వశక్తుఁడైన భగవంతునియాజ్ఞ నొదలవహించియున్నాఁడు ఆయన మనమేలుకొఱకు మనయొద్దకు వచ్చుచున్నాఁడు. మన స్వాంతరక్షణకొఱకు మన మాయనకు లోబడుచున్నాము."

"నేనునీవలె మనుజమాత్రుఁడ ననుము. నా దేవుఁడు ఒక్కఁడైనవాఁడను సందేశమునాకు కలిగినదనుము.

౧౮ వ, అధ్యాయము. ౧౧౦ వ. వచనము.

సోదరులారా, మీరు ప్రభువునుచూడ నిచ్ఛగించుచున్నారా? అటులైన, దేవుని వార్తా వాహుని వెంబడించుడి, ఆయనమిమ్మును నిత్యానందమునకునడుపును. హజ్జతుల్ బాలాగ యనుప్రదేశమున యాతడొసగిన ప్రసంగమును మీరువిని యున్నారు. మక్కాపురమునకు సమీపముననుండు, మదీనా లోని అకాబాయను స్థలమున, ఆయన యనుసరులచేత గావించిన యొప్పుదల మీరెఱిఁగియే యున్నారు. ఆయనమిమ్ము నిప్పుడు

పిలచుచున్నాఁడు. అయనపిలుపువిని రక్షిం పబడుడి. అవిధేయు లైనచో మిమ్ముని మీరే పాడుచేసుకొందురు. ఆయన తన కార్యమునిర్వర్తించినాడు.

" ఆయనవార్తావాహుని ననుసరించుచున్నారు, దేవునికి విధేయులగుచున్నారు. ఓ ముహమ్మద్, నిన్నుల్లంఘించు వారిపై నిన్ను నియమించుటలేదు."

౪ వ, అధ్యాయము. ౮౦ వ, వచనము.

ముహమ్మద్ విషయమే కాక, ప్రతి ప్రవక్త విషయు మిట్లే చెప్పబడియున్నది.

" పంపబడిన ప్రతి ప్రవక్త దేవునియాజ్ఞకు లోబడినవాఁడాయెను."

౪ వ, అధ్యాయము. ౬౪ వ, వచనము.

హా దేవుఁడు యేకదేవుఁడు. ఆయన మహోకనికరసముద్రుఁడు. నక్రుపాసముద్రమువైపు మనలను తన వార్తావాహుల మూలమున పిలచుచున్నాఁడు. ఆత్మీయాకసమునందు కడపటినక్షత్రముగా ప్రజ్వలించునట్లు ముహమ్మదును పంపినాఁడు. దేవుఁడు తనప్రకాశముద్వారా ఆయనను పవిత్రపరచెను, అదే వెలుగు మనలనిప్పుడు పవిత్రపరచుచున్నది. దేవుఁడాతనిని ద్విగుణీకృతముగా నాశీర్వదించుగాత, మనలను కూడా దీవించుత!

" విశ్వసించు వారలారా, దేవునిని జ్ఞాపకమ దుంచు కొనుడి. ఉదయ సాయంతనములాయనను స్తుతించుడి. చీకటి నుంచిమీరు వెలుగున కేతెంచునట్లు దేవుడు తన దీవనలను మీపైకిపంపుచున్నాడు. దూతలుకూడా పంపుచున్నారు. ఏల యన, దేవుడువిశ్వసించువారి యెడల చాలా దయగలవాడై యున్నాడు.

విశ్వాసులు అంత్యకాలమున, నాయనను చూచునప్పుడు వారి కొసగబడుశుభము " సమాధాన " మై యున్నది.

ఓ ప్రవక్తా, ఆయన వారికొఱకున్నతమగు పారితోషకమును సిద్ధముచేసియున్నాడు. నిన్ను సాక్షిగాను, మంచివార్తను గొని తెచ్చువానిగను, ప్రజలను హెచ్చరించునట్లును, దేవుని వైపు ప్రజలను మరల్చువానిగను, ఆయనసహాయముచేత, ప్రజ్వలి తమగు సూర్యునిగను, విశ్వాసులకు శుభవార్తా వాహునిగను నుండునట్లు నిన్ను పంపియున్నాము. ప్రభువు వారియెడల మహా కనికరముగలవాడై యున్నాడు"

33 వ, అధ్యాయము, ౪౧ - ౪౩ వచనములు.

ఈవిపత్రమగు జీవితచరిత్రము నీప్రార్థనతో ముగించుచున్నాను.

ప్రతివిధమగు పరిశుద్ధతయు, ప్రపంచమునందలి ప్రార్థ నలన్నియు దేవునికే చెల్లునుగాక! ఓప్రవక్తా, నీపైని సమాధా నము దేవునికృపయు ఆశీర్వాదములు సర్వదా ప్రజ్వలించు

గాక! నీతిప్రివర్తకులగు దేవునియొక్క సేవకు లందరిపై నిసమాదాన ముండునుగాక! వారు దేవుడుతప్ప ఆరాధింప దగినవారు వేరెవరు లేరని సాక్ష్యమిచ్చెదరు గాక! ముహమ్మదు యొక్క దేవుని సేవకులందరు కూడా దేవుడే ఆరాధింప దగినవాఁడని ప్రకటింతురుగాక! ముహమ్మదు దేవునియొక్క రాయభారియనియు, సేవకుడనియు సాక్ష్యమిచ్చుచున్నాను.

# 4 వ, అధ్యాయము.

## కట్టుకడపటి ధర్మశాస్త్రోపదేశకునిగూర్చి

### యితరుల అభిప్రాయములు.

## నెపోలియను బోనెపార్టు.

దేవునిని స్తుతించుఁడి. పరిశుద్ధ ప్రివక్త యగు ముహమ్మదును పరిశుద్ధ గ్రంధమగు ఖురానును గౌరవించుడి.

## జార్జిబెర్నాడు షాయను నాంగ్లకవి కుంజరుండు.

ముహమ్మదుయొక్క మతమును నే నెల్లప్పుడు నధికముగా గౌరవించుచున్నాను. ఏలయన, దానియందద్భుతమైన శక్తి కలదు. అన్ని కాలములయందు, జరుగుచున్నవివిధమగు మార్పు

ల కనుకూలమగు లక్షణములనుగలిగిన మతము యిదియే యాన వలసియున్నది. మహా పురుషులను గూర్చి చెప్పబడిన ప్రవచనముల యందెంతో యర్థమున్నది. ప్రకృతము యేవిధముగా నైరోపాఖండమీమతము నామోదించుచున్నదో, అట్లే, భావికాలమందుకూడా యంగీకృతమగునని నేను ప్రవచించు చున్నాను. మధ్యకాలమునాటి మతశాఖవారు, మూఢత్వముచేతనో, లేక పారంపర్యాచారబంధనమువలననో, ముహమ్మదీయ మతమునకు కృత్రిమరూపమును గల్పించినారు. ముహమ్మదును, యాతనిమతమును తృణీకరించునట్లువారు ప్రజలకు నేర్పుచుండిరి. వారికి ముహమ్మదు, క్రీస్తువలె నటించుచున్న మోసగాని వలె కాన్పించు చుండెను. నేనాతనిహృదయము నెఱింగితిని. అయన ఆశ్చికరుఁడు. ఆయన వొంగక్రీస్తుకాడుగాని ప్రజలయొక్క రక్షకుఁడని నే నూహించు చున్నాను. ఇటువంటి, మానవుఁడు ప్రకృతపునాగరకత ప్రపంచమంతటికి నియంతయైనచో, మన ము పరికించు చున్న క్లిష్టసమస్య లవలీలగా మాటువడి సమాదాన సంతోషములు ప్రపుల్లముగా ప్రభలగలవని నమ్మ చున్నాను.

## గాంధీమహాత్ముని అభిమానము

ఇస్లాము మతము ఔన్నత్య దశయందుండినప్పుడితరుల మతములపక్ష మౌదార్యముగలిగి యుండినది. అది ప్రపంచ

గౌరవము నాకర్షించినది. పశ్చిమదేశము భయంకరమగు నంధకారమున గూలియున్నప్పుడు, పూర్వదిక్ప్రాంతమందొక చుక్కబొడిచి, వేధనచే మూల్గుచున్న లోకమునకు, వెలుగును యాధరణమును కలుగజేసెను. ఇస్లాము తప్పుడుమతముకాదు. హిందువులీమతమును భక్తిపూర్వకముగజదివిన, నావలె వారును దానిని గౌరవించెదరు.

నేను నాముస్లీముమిత్రులతో కలసిమెలసి కడకు ప్రవక్తనుకూడా కలసికొనినాను. నేను రెండవ ఖాండము ముగించితిని. చదువజదువ రుచులుకలుగుట వలన, నింకయూ నా మహా పురుషుని చరిత్రజదువ గోరిక కలిగెను గాని, ముగియుట వలన చింతించితిని. ఖడ్గమువలన, నీమతము ఆదికాలమున ప్రభలినదనుమాట నాకునచ్చలేదు.

స్పెయినుదేశమును యిస్లామమతమే నాగరికతకు మార్చినది. మొరాకో అను దేశమునకు యిస్లాము ప్రజ్వలితమైన వెలుగును గొంపోయినది. ప్రపంచమునకు సౌభ్రాతృత్వమును నేర్పినదీయిస్లాము మతమే, అట్లుండియు, యిస్లామమతమన్న దక్షిణ ఆఫ్రికాలోని ఐరోపియులకు తగనిభయమని వినుచునాను. వారిభయమునకు కారణములేకపోలేదు. ఆఫ్రికనులు యిస్లామమతము నవలంభించిన యెడల ఐరోపియనుల తో సరిసమానముగా నిలచెదరేమో యని వారిభయము. సకలలోక

స్వాభ్రాతృత్వమే దోషపూరితమైనదైతే, నల్లనిజాతులు తమతో సమానముగా నిలచుట భయంకరాస్పదమైతే, వాస్తవముగా వారిభయము సహేతుకమైనదే, ఆఫ్రికావాస్తవ్యుడగు జూలు అనువాడు క్రైస్తవుఁడైనచో యితరక్రైస్తవులతో సమానముగా నెంచబడడు. కాని యిస్లాము మతమున జేరినదినమందే, యాతడు యితరముస్లీముల గిన్నెలో తినితాగ గలడు. ఐరోపియనుల భయమిదియే.

# హెచ్. ఇ. సర్. కిషన్‌ప్రసాద్.

హెచ్, ఈ, హెచ్. నైజాము సర్కారువారి ఎక్సిక్యూటివు కౌన్సిల్ యొక్క ప్రెసిడెంటుగావున్న, హెచ్, ఇ. మహరాజా సర్ కిషన్ ప్రసాద్ బహద్దరు యామిన్ సల్తనత్, కే. సి. ఐ. ఇ. జి. సి. ఐ. గారి అభిప్రాయము

ఏర్పరచుకొనబడిన అహమదుకు నీ జీవములర్పించుచున్నాను. ఆయన నన్ను నడిపించువాడనుటయందు సంశయములేదు. అధముఁడనగునన్ను ఆయన ఔన్నత్య దశకుదెచ్చియున్నాఁడు. ఈయన ప్రభావముగల దేవునియొక్క మహిమ నై యున్నాఁడు.

# సిక్కు మతోద్ధారకుఁడగు బాబానానకు మహాశయుఁడు.

ఏస్. ప్యారాస్ సింగ్ యిట్లువ్రాయుచున్నాఁడు.

సిక్కు మతోద్ధారకుఁడగు నానక్ గురువుగారు, ప్రపంచ విఖ్యాతిగాంచిన, భక్తుఁడు, పరిశుద్ధుఁడు. పంజాబుదేశమునందు, షేక్‌పూరా జిల్లాలోని, నాక్ కానాసాహెబు గ్రామమున నీతడు 500. సంవత్సరములకు పూర్వము జన్మించెను. బేడీఖాత్రి వంశసంభూతుఁడును, కులీనుఁడునై జన్మించినను, తన జీవితాంతమువరకు యిస్లాము మతమును యిస్లాము ప్రవక్తను వేనోళ్లబొగడియుండెను. ప్రవక్తపై నాతనికిగల్గిన మమకారమువలన, నాతడు అరేబియాకు కూడా వెళ్లియుండెను. ఆయన రెండుమారులు మక్కాయాత్రజేసి, మదీనాలోని ప్రవక్త సమాధిని దర్శించివచ్చెను.

సిర్సా, ముల్తాన్ అను పురములయందాయన తదేకధ్యానమవలంభించెను. పంజాసాహెబు గ్రామమున(యాఅల్లా) ఎఅల్లా అను బదములు చిత్రింపబడి యుండుట నేటికిని జూడగలము. ఆయన బ్రదికియుండ గా, దైవవాక్యములను చదివి వినిపించుచుండిన ఖురాను గ్రంధమును నేటికిని, ఫెరోజీపూర్ జిల్లాలోని గురుహార్ సాహై గ్రామమునచూడగలము. ఆయన

హాజ్ యాత్రకు పోవునపుడు తీసిన ఛాయాపటము పిషావరులో జాగ్రత చేయబడినది. నానకు గురువుధరించుచుండినఅంగీ(షర్టు) డేరా బాబా నానకు గ్రామమున ఆయన జ్ఞాపకార్థమై భక్తి పూర్వకముగా దాచబడియున్నది. జీర్ణించియున్న యీఅంగీపై వ్రాయబడియున్న ఖురానువచనములు నేటికి చూడవచ్చును. దీనివలన గురువుగారికి, ప్రవక్త యెడలను యిస్లాముమతము నెడలనుగల భక్తిప్రేమలు వెల్లడియగుచున్నవి. ఈ మహాగురువు యొక్క హితవచనములు యిస్లాముమతావేశ సన్నిహిత ములైయున్నవి. గరంత్ సాహెబుగారు పరిపూర్ణముగాయిస్లాము మతసిద్ధాంతి యనవచ్చును, వారిహితవు లీదిగువను వ్రాయుచున్నాను.

" దేవుడు ఒక్కడే. ఆయనసత్యమును సత్యవంతుడై యున్నాడు. ప్రపంచము శూన్యరూపమున నుండగా ఆయన భూమ్యాకాశములను సృష్టించెను. ఆయన నిత్యుడు, నిర్భయుడు, కీడుచేయనివాడు. ఆయనకు చావులేదు. ఆయన కిరికి జన్మించినవాడు కాడు; ఆయనవలన యెవరు జన్మింపలేదు. ఒకరికి పోల్చుదమన్న ఆయనకు రూపరేఖలులేవు. మానవస్వరూప మందాయన అవతరించలేదు. ఆయన ( రహమాన్ ) యుదార హృదయుడు. ( రహీం ) దయగలవాడు నిత్యుడునై యున్నాడు. ఇది వేదపురాణేతి హాసములకాలము

కాదు. ప్రపంచమును నడుపునది ఖురానుమాత్రమే యైయు న్నది. భక్తులు, సంస్కారకర్తలు, హతసాక్షులు, ప్రవక్తకొరకు ఆశీర్వచనములు గోరువారు, విశేషమగుఫలమనుభవించెదరు. ప్రవక్తపైనిభక్తి లేకపోవుటచే, మానవుఁడు నెమ్మది ననుభ వింపలేక నరకమునకు బోవుటకు ముఖ్యకారణమై యున్నది."

## టి. ఎల్. వాస్వానిసాధు.

కూరుఁడగుప్రవక్త — మహమ్మదు ప్రపంచము నందలి మహా వీరులలో నొకనిగాభావించి నమస్కరించుచున్నాను. ఆనే కుల నున్నతపదవికి దెచ్చుటకు మహమ్మదొక మహాశక్తియు ప్రపంచ పరిభ్రమణమునై యున్నాడు. ఆయన జీవితమునం దలి నమ్రత, అంగీకారము, పాత్రగ్రంధముల జదివిన దెలి యగలదు. ఆయన భూపాలకుడై ఆత్మల సంరక్షణాధి పతి యునై యుండియు, తనబట్టలు తానే కుట్టుకొనుచున్నాఁడు. ౦ప్పటిగప్పు కొనినవాఁడా లెమ్ము, బోధించుము అనునొక బ్దము వినవచ్చెను. దానిజలికిన వ్యక్తి గోచరించకున్నను ౹యన నెరవేర్చు చున్నాడు. వారాయనను హింసించు చున్నారు. ఆత్మభీతి ఆయన నావరించియున్నది. ఐనను, ఆపి లువును శిరసావహించుచున్నాడు. సమాధాన మార్గమును గూర్చి ఆయన ప్రకటించుచు తిరుగుచున్నాడు. మహమ్మదు పేదలను ప్రవక్తయునై యుండెను. అయన మరణశయ్యపై

నుండి తనజీవములను బ్రాయునపుడుడివిన వచనములను నే ననేకమారులు స్మరించుచుంటిని. అవేవన " ప్రభువా! నా పాపములను క్షమించి ఉపరివాసుల సహవాసచెలిమినాకను గ్రహింపుము " ఇటువంటి మానవుని జీవితము చక్కనిజీవిత మనియు, మరణము చక్కని మరణమనియుజెప్ప వెరచువా రెవరు? ఆయన బోధించిన నీతివలన కలిగిన పర్యవసాన మెట్టిదో విచారింప జెల్లును. మతగురువులు లేని మతము ప్రపంచమున యిస్లాముమతమే. ఇస్లాముమతమువలన, అరేబి యాలోని శిశుహత్య మొదలంట దెగటార్చ బడినది. మధు పానము నిషేదింపబడినది, విశ్వాసము ధైర్యము ఓపిక ఆత్మ త్యాగము, మున్నగు సుగుణములు పాదుకొల్పబడినవి.

<u>శుద్ధికరణాచారము</u>— ఇస్లాముమతము, ఐరోప ఆసియా ఖండములందు దీపమై శుద్ధీ కరణాచారమును బ్రవేశ పెట్టి నది. నాట్యము' పేకాటకూడా దోష భూయిష్టముగా బరిగ ణింపబడినవి. చక్కనిమార్గమును వెంబడించువాడు ముస్లిము మతస్థుడని ఖురాను చెప్పుచున్నది. అల్లాను గూర్చిన మహో త్తరమగు సందేశముతో (దయాదాక్షిణ్య భావముతో) యిస్లాముమతము బయలువెడలి, ఆఫ్రికా, చైనా, మాధ్య మిక ఆసియా, యూరపు. పర్షియా, ఇండియా, దేశములం దుందు విద్యావివేక నాగరికతల విద్యుచ్ఛక్తియై ప్రబలినది

బగ్దాదుకిలాఫత్ సంస్థ సందర్భములో జరిగిన విషయములను బట్టి ప్రతిముస్లీము మతస్థుఁడు గర్వాభిప్రాయము గలవాఁడై యుండఁజెల్లు. మీదుమిక్కిలిగా సింధీవారు గర్వించవలయును ఏలయన, బగ్దాదు న్యాయస్థానమున గల విజ్ఞానవిషయము లందు సింధవారు కీర్తిగాంచిరి. యూరపునందు ఇస్లాము వలన నేర్పడిన మార్పులు, సింధిలోని ముస్లిములకు విశేషముగా తెలియదు. ఆలోచించి చూచిన మాధ్యమిక కాలమున యిస్లాము వలన, యూరపుకు యెంతమేలు కలిగినదో తెలియ గలదు. ఇస్లాముమతము కార్డొవా విశ్వ విద్యాలయమును నిర్మించినది. యూరపు యొక్క అన్ని భాగములనుండి క్రైస్తవ విద్యార్థులచటి కేగుచుండిరి. వీరిలో నొకఁడు, కొంత కాలమునకు రోమునగరమున పోపుపదవి నొందెను.

ముస్లిములు ఐరోపా ఖండము. ఐరోపాఖండము అంధకార మున నున్న దినములలో స్పెయిను దేశములోని విద్యాధికులు సకలశాస్త్రముల యందారితేరినవారై యుండిరి. వైద్యగణిత రసాయన నైసర్గిక చారిత్రికలలిత కళా శాస్త్రములు వారు నేర్పుచుండిరి. ఇదేవిధముగ హిందు దేశము యొక్క జీవన యాత్రయందు ఆలోచనా ప్రపంచము నందు యెంతయో జేయూతనొసఁగినదనిన నతిశయోక్తిగాదు. హిందూదేశమునం దలి జాతీయోద్యమములలో యిస్లాము మతమొకటై యున్నది

యీమతమువలన, చిత్రలేఖనము, శిల్పిశాస్త్రము, కవిత్వము, విజ్ఞానము పలువిధముల ప్రభల గలిగినవి. ప్రపంచమంతటిలో తాజ్ మహాలు విచారింపవలసిన మహాభవనమన వలసినదే.

## శ్రీమతి సరోజినీదేవి.

### ప్రజాపాలనము సౌభ్రాతృత్వము.

ప్రజాపాలనమును గూర్చి ప్రకటించిన మొదటి మతము యిస్లాముమతము. ప్రజలు మసీదునందే కీభవించి దేవుడే గొప్పవాడని రాజులు పేదలు మోకరించి ప్రార్థించుచుండగా దినమునకు ఐదుమార్లు ప్రజాపాలనా విధానము సాక్షాత్కారముగా ప్రతిభింబించు చుండును. సోదరభావమును దిట్టపరచుచుండి నటువంటి యీ భేధింపనలవికాని ఐకమత్యమును గూర్చి నేను పలుమారు తలంచు చుండగా నాకాశ్చర్యమైనది. లండను నందు ఐగుప్తు ఆల్గేరియా ఇండియా టర్కి దేశస్తులను నీవు చూడవచ్చును గాని వారి వివిధ మాతృభూమి అచట వారిహెచ్చుతగ్గులకు కారణభూతము కానేరదు.

## లాలా లజపతిరాయి.

ఇస్లాముమత ప్రవక్తను నే నత్యధికముగా గౌరవించుటకు వెనుకాడుట లేదని ప్రకటించు చున్నాను. మత బోధకులును మతసంస్కార కర్త లందరిలో నీతడగ్రగణ్యుడని నేను భావించుచున్నాను.

# మేజరు ఆర్థర్ గ్లిన్ లియోనార్డు దొరగారు

---

ఇస్లాము, హర్ మారల్ అండ్ స్పిరిచు అల్ వాల్యూ

అనుదానినుండి తీసుకొనబడినది.

మహాపురుషుడు. వాస్తవానికి, ముహమ్మదు, మహాపురుషులకన్న నగ్రిగణ్యుఁడు. ఇతరులకును యితనికిని మధ్యగల భేధము యపారముగానున్నది. మచ్చునకు జొన్నాఫ్సు అను నాతఁడు మహాపురుషుడే. కానిఅతడు దేశాభిమాని. మొదట ఆయన దృష్టిదేశముపై నుండును, పిదప, దేవుడు, మానవకోటి కానవచ్చుచుండెను. అయితె ముహమ్మదు అట్లుగాదు జన్మమువలన నరబ్బీయుఁడై, దేవునిని ప్రకృతిని ప్రాధాన్యముగానెంచియుండెను. ఈ ఒక్క విషయమే అతనిని మహాపురుషునిగా జేసినది. ఇదియే అతనికి తనకాలమునకు తరువాత పుట్టినవారి కుండగలిగిన అభిప్రాయములను-కలుగ జేసినది.

మహానిర్మాత. మహాపురుషుడేకాదు, యాతడు పురుషోత్తముడు, సూవృతవ్రతుఁడు ప్రవచన వరములగల్గిన వాఁడేకాదు దేశభక్తుడును రాచకీయ వ్యవహార సమస్యా దురందరుఁడను ఐహికాముష్మిక కామితార్థ నిర్మాతయు నగుటవలన నీతఁడు

పురుషోత్తముఁడగు చున్నాఁడు. ఈతఁడు నిర్మాణము గావించి నది గొప్పజనాంగము అంతకుమించిన సామ్రాజ్యము వీటిన న్నిటిని నిరసించునట్టి దృఢమగు విశ్వాసము.

తన పనిపాటలయందు పట్టుదల గలవాని కాటంకములు కలిగిన నాగ్రహమగును. ముహమ్మదు దేవుని సంస్తుతించు నపుడు అడ్డంకులు కలిగినను లోకమును తనవైపునకు త్రిప్పి కొన గలిగిన శక్తిగల వాఁడాయెను. ఈ విషయమునమాత్రి మీతడెవ్వరికిని దీసిపోడు. అరేబియా యొక్క ఐక్యమత్యము నిమిత్తమై కావలసిన సుగుణములు అట్టి సంధర్భమున దేవుని యెడల యుండవలసిన భక్తియు నీతనియందు నిలయమైయుం డెను. తన కేదియవసరమై యుండెనో దానినే యాతడు వెద కెను. తన దేశమును దైవ చింతనమున బడగొట్టి దేవునితో నేకీభవింప జేయుటయే నాతనిపనియై యుండెను. ఈ గమ్యమ్ము తానెట్లు సాధించినదియు చరిత్రి ప్రకటించు చున్నది.

ముహమ్మదు తనకొరకును ప్రపంచమంతటి కొఱ దలంచువాడును, వ్యయప్రయాస లనక సేవజేయువాడు యున్నాఁడు. దైవ సృష్టియంతటిలో మానవుఁడు మాత్రమే మతవైరాగియై యుండియు జాతీయోద్యమములయందు నిపుణుఁడై యుండువాడని తాను గ్రహించెను. మానవుని యొక్క భౌతీక దేహ తత్వమ్మునకును నైసర్గిక జీవనమునకును

ప్రతికూలమగు నదియు వర్ణనాతీత మగునదియు నగునాత్మ మానవునియందు కలదనిగ్రహించెను.

ముహమ్మదు యొక్క భక్తియు సత్యమును.

దేవుడు ముహమ్మదునకు అన్నికాలముల యందు సంచలితపు నక్షత్రమును ప్రతివిషయమును దిలకించు నేత్రము నై యుండెను. గడికపోచయందు దేవుఁడాతని క గుపడుచుండెను. ప్రతిజలధారయందు దేవుఁడుప్రత్యక్ష మగుచుండెను.

ముహమ్మదుకన్న భక్తిగలపురుషుడు భూమిపై జన్మించలేదు. ఆయన యెంతభక్తిపరుఁడో అంత తెలివి పరుడు నై యుండెను. తనపరిపూర్ణ జ్ఞానము తనజీవిత యాత్రలో వినియోగించెను. తన నమ్మకమును తీక్ష్ణముగా పరీక్షించి చూచి భక్తినిదానిపై బదిలపరచెను. వ్యాపారమాయన కవలీలగా యుండినది, దానిలో దీర్ఘదృష్టిగలిగి యుండెను. ప్రవక్త ధర్మములను గలిగినవాఁడే గాక రాజ్యాంగవిషయ దురంధరుడు నై యుండెను సనాతన ధర్మములవలన లాభములను పొందియుండెను ప్రకృతి విషయములను చలామణి గావించెను. భావికాల పర్యవసానమునకు దగిన కట్టుదిట్టముల నేర్పాటు జేసిన మహాపురుషు డీతడే. తనచిన్నాయనను తనకుతండ్రిగా నెంచి వినయ విధేయతలు గలవాడై యుండెను. ఆయన నమ్మకే

ష్ఠమైన సేవకుడును, ఆదర్శప్రియుడగు భర్తయు దయగల తండ్రియు మంచియజమానుఁడునై వెలసెను. ఆయన [అమిర్] అని పిలువబడు చుండెను. దీనికి విశ్వాసుడని అర్థము దీని వలన యాయన యెంతటి సుగుణ సంపన్నుడో గ్రహింప వీలున్నది

ప్రకృతిమాత యాతనికి చిత్రరూపిణిగా యుండినది. ప్రతిదానిని పరీక్షించు గుణముగల వాడగుటవలన తనయింద్రియ శక్తులు చురుకగుచుండెను. ప్రతిచలనము నందాతనికి ప్రదమమున జన్మించిన మాతయొక్క ఆత్మయె కనబడినట్లుండినది. పరుగులిడుచున్న మేఘములలో దాటిపోవుచున్న ఆలోచనలలో అపరూపమగు నొకశక్తి అతనికి గోచరించు చుండెను. ఆయన ప్రవక్త మాత్రమేకాదు, ప్రతివిషయములను పరీక్షించు మహాపురుషుడు. ఈ విధముగా ప్రతి విషయమును వితర్కించి తుదకు దేవుని గ్రహింప గలిగినాడు.

<u>అభ్యాసము చేయుపద్ధతి.</u> మహమ్మదు నిశ్శంకుడును పట్టిన పట్టువదలని వాడునై యున్నాడు. ఈపట్టుదల వలననే తనయనుచరులందరిని బంధించివేసెను. ఇస్లాముమతము అనుదినక్రియా సాధనము. ఊహా ప్రపంచముగాదు. సాధనాభ్యాసము వలన నిదియేర్పడినది. దానిపైననే అదినిలచియున్నది. మహమ్మదు తానేమి చెప్పుచుండెనో అట్లే చేయుచుండెను. తాను మొదట

నాటిని యీచిన్న విత్తనము పెరిగి పెద్దదై తూర్పుదేశమున మహా వటవృక్షమైనది.

( ఇస్లాముయొక్క జీవము మహమ్మదు యొక్క ఆవేశమైయున్నది )

ఆయనకు దేవునియందుగల నమ్మికము, పరిశుద్ధాత్మ వలన కన్యక కుమారుని కనెనను మూఢభక్తి విషయ మాతని కున్న నిరసనభావము, క్రీస్తు దేవుడు కాడని వాదించుటయు నాతనిని, యీ యిరువదియవ శతాబ్దివానిగా జేయుచున్నది. ఈ సరియగు నభిప్రాయములే, ఇస్లాము మతము ఆవేశ పూరితమగునదిగా జేసినవి. తనశక్తి కొలది మహమ్మదుపోరాడెను తానుపడిన పాటునకు తగినంతటి ఫలమనుభవించి లోకమునే కాదు మరణమును జయించినాడు. మరణమున కాతడు వెరువ లేదు. జీవనమనగా దైవభీతియని మాత్రమాతడు తలంచు చుండెను. మరణ మాయనకు బాధకరముగా కనబడలేదు మాదియందు విజయమను నదిలేదు. మరణము తన మర్త్య దేహమునకు సంబంధించినదిగా యుండెను. ఆత్మమాత్రము అన్నివిధముల అభివృద్ధి నొందియుండెను. మహమ్మదు యొక్క ఆవేశమే ప్రస్తుతము యిస్లాము మతముయొక్క జీవమైయున్నది. ఇదెప్పుడు అంతరించునో అప్పుడే యిస్లాముమతము జీర్ణించి శూన్యమగును. ఈ దినమువరకు ఆయన జీవించియున్నాడు. ఎన్నోయేడ్లవరకు అయన ప్రిదికియే యుండును. ఆ

యన ఇస్లాము మతమునకు పాలకుడును న్యాయమూర్తి యునై యున్నాడు. వివిధ శాఖలు ప్రభలినను, మతసిద్ధాంతికుల ప్రచారములు వేరువేరైనను ఆయనఆత్మ యిస్లామమతము అంతరించువరకుండి దాని స్థితిగతులను చక్కబెట్టుచుండును. ఆయనయొక్క శక్తి శాశ్వతమగు నాత్మ ధనమువలె తానే ర్పాటుచేసిన మతమునందు సర్వదా జీవములతో యుండును. ఆయన దేహరూపమున మరణించినను ఆత్మయందు ఆయన జీవములతో యున్నాడు, వేళ్లతో ఆయనమనలను హెచ్చరించు చున్నాడు.

<u>మహాత్తగమగు విజ్ఞానముగలవాడు</u> మానవ జీవితాంతరీయముల యందును, జడప్రకృతి యందునుగల సూక్ష్మవిషయములను గ్రహింపగలిగిన మానసిక దీర్ఘదృష్టియు, అపరిమితమగుశక్తియు, యెంతకఠినమైన పనిచేయుటకైన దగినఓర్పుయు బలము మొదలగు శక్తులు గలిగి యుండిన వాడు విజ్ఞానపరుడందుమేని, నిశ్చయముగానివి యన్నియు ముహమ్మదుయం అక్షరాల వర్తించుచున్నవి.

" ఓర్పు గలిగియుండుట కిచ్ఛగించుట " విజ్ఞానమని బప్ఫన్ దొరగారనుచున్నాడు. అట్లైన, ముహమ్మదు విజ్ఞానాగ్రగణ్యుఁడని తీరవలెను. ప్రపంచము నందలి మతము లన్నిటికంటె నుత్కృష్టమగు మతము నుత్పాదించినాడు. యేతద్

మతమును విశ్వసించువారి ఆత్మల కధిపతియై యున్నాడు, అట్టి యెడ ఆయన విజ్ఞానము నీతిసంయుక్తమైనది, మతావేశపూరితమైనదియునై యున్నది. తననియమితాశయమును సీకరించుట యందాతని జీవితమంతయు భక్తిఅనురాగములకొరకై కష్ట పడుటయందే గడచిపోయినది. జనాంగములకు భగవంతుని సందేశము ఘోషించుటయే, యాతని యాశయమై యున్నది.

దేవునిపై నాతని విశ్వాసము, అయనను బిగియబట్టిన ఆకర్షణ శక్తిదేవుడై యున్నాడు. ఈ ఆకర్షణావలన, నాతని గుణములు కుదురుబడినవి, కష్టములయందు, క్లిష్టకాలమందు ఓర్పుకలిగినది; తనయనుదినచర్యల యందాతనికీ యాకర్షణమే దారిచూపి, హితవులొసగినది. ఈ శక్తివలననే యాతనికి, గౌరవము కలిగినది. ప్రజలాతనిని నమ్ముటకిదియే కారణము.

అరబ్బీయులును నాగరికతయు. అరబ్బీయులకు కలిగిన నాకరికత జ్ఞానాభివృద్ధి, సాంఘిక విజ్ఞాన పరిజ్ఞానము, వారియొక్క కర్మిమశిక్ష మొదలగు ప్రవృత్తులతో సమానమగు సాంఘిక మానసిక, వైదికవిజ్ఞానము మనకు కలిగినట్లు దార్కాణము మైనది గలవా? ఐరోపాదేశము నేటివరకు, అంధకారమున బడీకృతమై యున్నది. "మతాచార సిద్ధాంతములకన్న మానస పునియొక్కవిద్య సముదాయముపై ప్రజలందరికి సహాయ కరమైనదైతే, అట్టివిద్యనే యభ్యసింప వచ్చును" అనునది ముస్లిముల మూలవాఖ్యమైయున్నది.

విజ్ఞాన పరిశోధకులగు మస్లీములు.

సకలశాస్త్ర సారమూరసిన మహా విద్యావంతులైన ముస్లీములపట్ల. యూరపు కీషన్మాత్రమయిన కృతజ్ఞత లేకపో వచ్చును. లేకమరచియే యుండవచ్చును. అసం, అబుఅల్మర్, అబ్బెరుని ఆల్బెతర్. అనువారును వైద్య చింతామణియు, తత్వజ్ఞాన విశారదుండునగు అబుఅలి ఇబ్నెసినా అనబడిన అవిసెన్నా అనునాతడును. అరిస్టోటల్ అనబడిన మహా గ్రంధకర్తయొక్క విమర్శకుడగు కార్డొవా వాసుడగు అవదోన్ అనబడిన ఇబ్నెరుషాద్, అవర్ లేసనబడు ఇబ్నెబజ్జా మొదలు గాంగల వారి పేరులన్నియు వ్మృతమై పోయినవా వీరందరు విజ్ఞానమండలము నందలి ప్రజ్వలితమగు నక్షత్రములు కారా? ఇంతలో మరపునకు వచ్చుచున్నదా? ఏమీ, వారుచేసిన శ్రేష్టమగుపనులు వ్రాసిన పవిత్రమగు గ్రంధములు. వారినిగూర్చిన గౌరవము మాట తేటలక్రింద మాయమైపోవుచున్నావా? కరుణా కటాక్షములేని కఠినమయిన యూరపునకీ విషయములు జ్ఞాపకమునకురావు కాబోలును. గాలితూనికపరిమాణమును గ్రహించినటువంటి వాడును, నేత్రచికిత్స గ్రంధకర్తయు గ్రీకుదేశస్తుల దృష్టిసిద్ధాంతము యందలి దోషములను చక్కజేసి నేత్రశక్తిని కనిపెట్టిన అల్ హెజ్జ్ అనునాతనిచరిత్ర అడుగంటినదా? ఘజాలియనబడిన యాలోచనపరుడు జ్ఞాపకము

రాడా? తన బాల్యావస్థ యందుండినపుడాత డిట్లుడివెను "నా యొక్క విద్యుక్తధర్మము, ప్రతి విషయమున సత్యము నెరుంగుటయే యని నాలోనేననుకొంటిని. అందువలన జ్ఞానమనగా నేమిటో నేను కనుగొనవలసి యున్నది."

నాయొక్క అనుభవమును బట్టియు, పైనుదహరింపబడిన కారణములవలనను, ఇస్లాము మతమువలన ప్రపంచమునకు గలిగిన ఉపకారములను మరచిపోలేను. విజ్ఞానరణరంగమున, సత్యము కొరకు యుద్ధముచేసి యుగముల పర్యంతము ప్రపంచమును నడిపించి కథనమున ధైర్య సాహసములను చూపి యోధులై నిలచిన వీరులందరిలో యిస్లాము మతస్థులు అగ్రిగణ్యులగు చున్నారు. ప్రపంచమింకా అభివృద్ధి నందుచు విజ్ఞాన కౌముదియందు దాండవించు కొలంది, వీరుకూడా దానికను గుణ్యముగా ప్రాముఖ్యులగు చుందురను మాటవాస్తవము.

రెవ రెండు బాస్వర్తు స్మిత్ పాదిరిగారిట్లువ్రాయుచున్నారు.
క్స్ప్ర్ సి అక్ మహమ్మద్ అండ్ మహమ్మడానిసం నుంచితీసుకొనబడినది.
ఇస్లాముమతము అధములను అధిపులను జేయుచున్నది,

క్రైస్తవమత మవలంభించిన నీగ్రోజాతి వారికి కలిగడు గౌరవముకన్న, ఇస్లాముమతము స్వీకరించెడు నీగ్రోవారి కధిక గౌరవము కలుగుచున్నదని, క్రైస్తవ సంచారులు,

చెప్పుచున్నారు. అట్లుచ్చరించుటకు వారికిష్టములేదు గాని సత్యమునెంత కాలము దాచగలరు?

కరకు మోటగు అప్రికా దేశమునందు, ప్రజలు నాగరకమగు బట్టలు ధరించుచున్నారు. విద్యా వ్యవసాయ సాకర్యములు మొదలగు ప్రజాసహాయ సంస్థలు విపులముగా ప్రభలుచున్నవి. ఇవియన్నియు ముస్లీము మతమువలననే కలిగినవి.

ఇస్లాము మతము యొక్క విజయ. ఏ మతమువలన మానవ మాంసభక్షణము నిరోధింపబడి నరభలి యంతరించినదో, యే మతమువలన చదువుట, వ్రాయుట ప్రవేశమయ్యెనో యే మతము ప్రేమానురాగములకు కారణ భూతమయ్యెనో యే మతమువలన, త్రాగుబోతుతనము, జూదము, అసహ్యమగు నాట్యములవలన నుద్భవించుచున్న దుర్నీతి తొలగిపోయి సద్గుణములు ప్రభలుచున్నవో, నిరాడంబర జీవితమునకు ప్రశాంతి చేకూరుటకు; అసూయ; యీర్ష్య వగ మొదలగు దూరమగుటకే మతము సామర్థ్యమైనదో, యే మత యొక్క పత్రికాసైఖరి, యితరమతముల యెడల కరుణాపూరితమై యున్నదో అట్టిమతము శ్రేష్టమగు మతము.

అఫ్రికా దేశమునకు అధికముగా మేలుచేసినది యిస్లాము మతమా, లేక క్రైస్తవ మతమా, అని విచారించి చూచిన

యిస్లాము జనాంగమేయని తేలుచున్నది పరిశుద్ధమైనదియు, ఆదర్శప్రాయమైనదియు నగుమతమేదని విచారించిన యిస్లాము మతమే గోచరించుచుండును. చారిత్రికాంశముగా నైనను, నైసర్గికముగా నైనను, వివిధజాతి భేదములను బట్టిచూచినను, స్వజాతీయాభిమానములను గలిగి, యమానుష్యమగు దుర్బుద్ధులను ద్రోలగదియు మతమేదై యుండునాయని విచారించిన, ముమ్మాటికి యిస్లాము మతమేయని చెప్పవలసి యున్నది.

ముహమ్మదు చేసిన ఘనకార్యములు. మధుపాన నిషేదము జ్యూదనిర్బంధమువలన, యీపందొమ్మిది యవశతాబ్దియందలి క్రైస్తవ రాజ్యాంగములు చేయతల పెట్టుకొనిన క్రియలు ముహమ్మదు యెంతో కాలము క్రిందట నిర్వర్తించి ప్రపంచమునకాదర్శ పురుషుడగుచున్నాడు. ఈరెండు భయంకరమగు పాపములు యూరోఫియనుల సంఘములందు పెరుగుచున్నవి

ఆపద్బాంధవుడు. అన్యోన్యాను రాగముయొక్క పరిమితిని గొలతవేసి కనుగొనవీలున్నచో, వాస్తవముగా; ముహమ్మదు సహోద్రేమగలిగిన స్నేహితుడని చెప్పినదప్పుగాదు. అయన హీనుడై యుండినప్పుడే, మక్కాపురమునందలి ప్రముఖులందరాతనిని చుట్టు తిరుగుచుండిరి ఆవయసున కలిగిన స్నేహబాంధవ్యము అతడుచనిపోవువరకు చెడిపోలేదు. ముహమ్మదు ఆవలీలగా ప్రజల నాకర్షించుచుండెను. తన స్వాగారమును కా

పాడుకొనుచుండెను. తనయొక్క భాహ్యగుణలక్షణము లన్నిటిలోని విముఖ్యమైనవిగా కనబడుచుండెను. వీనివలన, ప్రజలు తెలియకయే ముహమ్మదు వైపునకు లాగబడుచుండిరి, తమకు అవమానములు కలుగునపుడీ గుణములే యాతనికి కొంతలో గొంత ప్రోత్సాహము కలుగజేసినవి.

ఇస్లాముమత వీర్యము, చాంచల్యమున, నశించనైయున్న యాత్మలను స్థిరీకరించు మతమిదియే. నాశనకరమగు ప్రపంచ వైషమ్యమునందు ప్రాముఖ్యముగా నిలువబడు శక్తియిదియే. జగద్వైకసోదర భావమున, ప్రతివిధమగు రంగు బేదములను, యెక్కువ తక్కువలను, జాతులను, మిశ్రమపరచు మతమిదియే. అశాశ్వతమునుండి శాశ్వతపదవికి గొంపోయి, మనోదృష్టి నున్నతపదవికి చేర్చునదియు, తగినభుక్తి దొరుకక కష్టములపాలైయున్న కర్షకులకు యిబ్బందుల యందు ధైర్యమును, లోకము తారుమారగు చుండగా నెమ్మదియు, క్లిష్టకాలాన మనో నిశ్చలతయు నొసగునట్టి మతము యిస్లాము మతము ఇవి మరేమతమున గానకావు.

ముహమ్మదు మానవహృదయముల నేలినవాడు. రాజ్యాంగమును దైవాలయమును, తనయురచేతగలిగిన భూపాలకుడును మహామతగురువునైయున్నాడు. ఆయన మహామతగురువైనను సామా

న్యముగా మతగురువులకుండు ఆడంబరములు లేవు. భూపాలకుఁ డైనను, రాజులకుండవలసిన సేనలాతనికి లేవు. సేనలు కాదుగదా తన దేహసంరక్షక భటులుకూడ లేడు. నివసించుటకు స్థలము లేదు. ఆదాయమింతయని నిలుకడ లేదు. దైవశక్తి వలన రాజ్య మేలిన మహాపురుషు డెవఁడైన గలఁడాయని చూచిన, మహా మ్మదు మాత్రము కానవచ్చు చున్నాఁడు. ఆయన సర్వశక్తి గలవాఁడు, ఆయన మానవ నిర్మితమగు బిరుదములకన్న గొప్ప వాఁడు, ఆచారములకన్న నెక్కుడగు వాఁడు, న్యాయస్థాన ములయందు గోచరించు, నధికారమున కన్నను, శాంతియు తమగు నాసనములకన్న నధికుఁడు. ఈ ఆడంబరము లన్నియు, వంశ పారంపర్యముగా రాజ్యమేలు రాజులకు, సుఖభోగ ముల యందలరారు, భూపాలకుల కంగీకారముగా యుండవ చ్చును. కాని స్వయంకృషి వలన రాజ్యమేలగలిగిన, సీజరు, క్రాంవెల్ నెపోలియను రాజుల కీవిషయములు చాలవు. వారు ఇట్టి పైవేషముల పై నాధారపడక, తమ జీవితముల ద్వారా ప్రజల నాకర్షించి యుండిరి. మహమ్మదు సత్యమున కై పోరాడు చుండెను. అధి కార వైభవము కొఱకు కాతడెన్న డైన ప్రయాస పడలేదు.

<u>మహమ్మదు యొక్క అద్భుతము</u>, ఒకజనాంగమును, ఒకసా మ్రాజ్యమును, ఒకమతమును, నిర్మించినవాఁడు మహమ్మదు

కాక మరెవరులేరు. ఇదిచరిత్రలో నాశ్చర్యాద్భుత కరమగు విషయము. తాను విద్యావిహీనుఁడై వ్రాయను చదువను కొద్దిగొప్ప తెలిసినవాఁడై, గ్రంథకర్తగా లెక్కింప బడుచున్నాడు. ఆగ్రంథము మహాకావ్యము, ధర్మశాస్త్రము, అనుదినప్రార్థ నాగ్రంథము, వేదమునై యున్నది. సత్యమునందును, విజ్ఞానమునందును, శైలియందును, అన్ని గ్రంథములను మించిన గ్రంథమను యద్భుతపదవి నలంకరించు చున్నదని, ప్రపంచములో నిప్రజలయందాఱవ భాగముకొని యాడుచున్నది. తానుచేసిన యద్భుత మిదియేయని ముహమ్మద దనుచు చున్నాఁడు ఇదిశాశ్వతముగా నిలచునట్టి అద్భుతము. వాస్తవముగా యిదిఅద్భుతమే. తాను జీవించియున్న కాల పరిస్థితులను బట్టియు, తన శిష్యుల కాతనియందు గలభక్తి మర్యాదలను బట్టియు. దేవాలయ ధర్మకర్తల యొక్క చర్యలను బట్టియు. మధ్యకాలము నాటి భక్తుల యునికని బట్టియు విచారించి చూడగా, ముహమ్మదు' అద్భుతములను చేయక యుంటయే మహాద్భుతము వలెనాకు తోచుచున్నది. ఆయ; చెప్పినదెల్లయు చేయఁగలిగి యుండెను తనశిష్యు లాతఁడట్లు చేయుట సాక్షాత్కారముగా చూడగల్గిరి. ఆయున అద్భుతములు చేయుచున్నాడని తనశిష్యులను చుండిరికాని, ఆయన కాదనుచు అద్భుతములు తాను చేయలేనని తెల్పుచుండెను. ఆయన నిష్కళంకతను నిరూపించుట కింతకన్న వేరెయేమి

సాక్ష్యము కావలయును. ముహమ్మదు తన మరణపర్యంతము స్వీకరించి నటువంటి బిరుదము "ప్రవక్త" మాత్రమే. ప్రపంచవిజ్ఞానులును సత్ప్రవర్తకులగు క్రైస్తవులును, మొన్న టికైన నాతడు వాస్తవముగా దేవునిచేత పంపబడిన ప్రవక్త యని ఒప్పుకొని తీరెదరని చెప్పుటకు సాహసించుచున్నాను.

# రెవరెండు. జాన్ డేవెన్‌పోర్టుగారు.

(అపాలజీ ఫార్ ఖురాన్ అండ్ ముహమ్మదునుంచి వ్రాయబడినది)

ఆదర్శనీయమగువ్యక్తి గొప్పవారి పట్లనాతనికి గలమర్యాద పేదలయెడలి ప్రేమ, డాంబికులయెడల నాతని విచక్షణా ప్రవర్తనలవలన, నాతనికి, కీర్తి గౌరవములు కలిగినవి. అతడు తనయభిప్రాయములను చలామణి గావించగలుగుట కాతని కిగల వరములు కూడా సహానుకూలముగా నుండినవి. నిరక్ష రుఁడైననీతఁడు ప్రకృతియను గ్రంధము స్వభావసిద్ధముగా చది విన వాడగుటవలన తనశత్రువులు పన్నుచుండిన వివిధ యుపా యములకు తగిన యాలోచనలు చేయునంతటి దీర్ఘదృష్టియు సంకుచితమగు దృష్టిగలతనపేదశిష్యు లభిన్నాభి ప్రాయములు గ్రహించునట్లు సూక్ష్మదృష్టియు నాతని కుండెను. అతని సా మాన్యమగు వాఙ్మయగోష్టి అంగీకారమగు చిహ్నములును

ప్రేమాతిశయముల నుద్రేకింపజేయు నావేశములును, గల్గిన యాతని ముఖకమలము వలన, పటతరముగ బలవత్తరమగు చున్నది. విజ్ఞానులను వశపరచుకొని విద్యా విహీనులను నడిపింపగల నధికారశక్తి యాతనికి నైసర్గికముగా లభించినది. స్నేహితునివలె నైనను, తండ్రివలె నైనను, యాతడు మన పట్లనడచుకొను చున్నప్పుడు, తనమెత్తని హృదయమును దాచుకొనలేకపోయినాడు. గృహస్థమున, సాంఘికమునయగు సమస్యలు పరిష్కరించునపుడు తనసహజ కరుణాకటాక్షపూరితమగు హృదయమున కనుకూలముగా ప్రవర్తించుచు, ప్రవక్త నిర్వర్తింప వలసిన ధర్మములలో నించుకైన నోరబోనీయలేదు. విజ్ఞానులు నిరాడంభరముగా జీవించుట సహజమైనను, యీతడు మాత్రము, యింటియందలి సామాన్యమగు పనులుకూడ చేయ వెనుకాడలేదు. అరేబియా దేశమునకు ఏలికయై తన పాదరక్షలను, కరకు మోటగు ఉన్ని బట్టలను' తానే బాగుచేసుకొనెను. పాలుపిదికెను, ఇల్లువాకిలిఊడ్చెను. పొయ్యిరాచబెట్టెను. అనుదినహారము, కర్జూరఫలములు మంచినీళ్లునై యుండెను. పాలుతేనె లాతనికి పరమాన్నము తాను ప్రయాణము చేయునపుడు తన సేవకులకు తన భోజనము పెట్టుచుండెను. దాతృత్వమును గూర్చి తాను పలుమారు మాట్లాడుచుండిన హెచ్చరిక హితవుల యందలి సత్యము ఆతని మరణానంతర మాతని బొక్కసమునందొక్క నాణ్యముకూడలేకపోవుట ద్వారా బలపడినది.

పట్టుదల. సత్యము.

ఈ నిజమగు ప్రవక్త విషయము, తామస్ కార్లైల్ చెప్పినమాటలు, అమూల్యమై, మూలమును గ్రహింప గలుగునవియు నైయున్నవి. అవేవన :– "దీర్ఘ దృష్టిగల్గి శ్యామలమగు విశాల నయనములు గల్గిన యీ ఆవన్య కుమారుఁడు, ఆశాభ్యుదయమే కాక నితరములగు సభిప్రాయములను కూడా కలిగియున్నాఁడు. ప్రకృతిచే, నిష్కళంకముగానుండు నట్లేర్పాటు చేసుకొనబడిన నీతఁడు నిష్కళంకులగు మహా పురుషుల నొకఁడును, నెమ్మదిగలిగిన మహాత్ముయునై యున్నాడు. సామాన్యముగా ప్రజలు సిద్ధాంతములను, కింవదంతులను ఆధారముగా గలిగి పనులుకొనసాగించు చుందురు. ఈతడట్లుగాదు, నిజానిజములతో తనఆత్మను సంధింప జేయుచుండెను. జన్మరహస్య మాతని దృష్టిని మిఱుమిట్లు గావించినది. దానియొక్క భయంకరత్వము, దాని హడావిడి, జన్మయను నేనుఉన్నాను ఉన్నాను అను వాక్యమాతని మాటుపర్వ లేక పోయినవి. ఇటువంటి సత్యమాతని యందున్నది. ఇదియే కొంతవరకు దేవత్వము. ఇటువంటి మానవుని పలుకు, ప్రకృతి మాతయొక్క పిలుపైయున్నది. ప్రజలీ పలుకు వినవలెను. ఇదివినకున్న నేదియు వినరాదు. ఇదికానిదంతయు వ్యర్థము. నేనేమై యున్నాను అనుప్రశ్న అతని హృదయములో వెల్లువుచుండెడిది. ప్రపంచమని ప్రజలనుచున్నటువంటిదియు, నేను జీవించుచున్నటువంటిదియునగు నీని రామణీయమగు వస్తువే

మిటి? మరణమన నేమిటి నేను దేనినిమాత్రము నమ్మవలయు? నేను చేయవసిన దేమిటి? అని ప్రశ్నించు చున్నాడు. సీనాయి పర్వతములైనను, హోరేబుకొండలైనను; నిచ్చేష్టితమగు నాపరిసరి ప్రాంతములైనను ప్రత్యుత్తర మీయలేదు. ప్రతిబింబించు చుండిన నక్షత్ర మండలంబును గల్గిన, వైశాల్యమగు నంబురవీధి ప్రత్యుత్తర మీయలేదు. దేవుని ఆత్మావేశము గల్గిన మానవుని ఆత్మ యింతటికి ప్రతి జెప్పవలయును.

మానవసేవపరిశుద్ధతనుపోద్ఘాతము

పరిశుద్ధత కొఱకు మీరు మీముఖమును తూర్పు పడమటకు త్రిప్పుటలేదు. కాని యే మానవుడు దేవునిని అంత్యదినమును, దేవదూతలను, వేదగ్రంధమును, ప్రవక్తలను, నమ్ముచు, దైవము నభిలషించుటకై ధనమును వ్యయము జేయుచు, బంధువులకు, అనాధులకు, నిరాధారులకు, సన్మార్గ ప్రవర్తకులకు, ధనసహాయ మొసగు చుండునో యట్టిమానవుని హృదయమునందు గల పరిశుద్ధ కొఱకు మీరు మీముఖములు త్రిప్పుచున్నారు. ఎడతెగ ప్రార్థన చేయువారు ధార్మికులు, ధర్మశాస్త్రము నామోదించువారు, కష్టములయందు, క్లిష్టకాలమందు, విపత్కాలమందు, శాంతత వహించువారు, వాస్తవముగా సత్ప్రవర్తకులు. వారేదైవభీతి గలవారు.

యుద్ధములయెడల ముహమ్మదు హితవు. గ్రీకు సామ్రాజ్యపు చక్రవర్తియగు హెరెక్లియసు పరిపాలనమున, షేర్ హీల్ అను నొకడు, దమస్కసుపురమునకు సమీపమునన్న బోస్రా ప్రదేశముయొక్క గవర్నరు యొద్దకు ముహమ్మదుచేత పంప బడిన రాయభారిని చెరసాలలో బంధించి చంపించెను. మూడువేల సైన్యము, గ్రీకుదేశముపై దండెత్తి, అత్యున్నతుడగు అల్లా నామము పేరట యుద్ధమునకు సిద్ధముగా నున్నప్పుడు ముహమ్మదు వారికీహితవులొసగెను.

" నాకు శత్రువులు చేసిన ద్రోహమునకు ప్రతికూలముగా పగదీర్చుకొనునప్పుడు, యిండ్లలోనుండు సేవకులను హింసించవలదు, స్త్రీలకెట్టిహానిని చేయవద్దు. పసికందులను, యుద్ధమునకు వెరసి పరుగిడు పిటికిపందలను చంపరాదు. యుద్ధమునకాలిడని, కాపురస్థుల గృహములను ధ్వంసము చేయరాదు. వారిజీవనోపాదికి కారణభూతమగు దేనినిఅటంకపరచవద్దు. వారిఫలతరులను నరికివేయకుడి, వానివలన, శిరియాకు మంచినీడ కలుగుచున్నది. చూచుటకందముగా నున్నవి. "

ప్రవక్తయు! జాతీయోద్ధారకుడును, ప్రత్యేకమగు మానవుడవ, ముహమ్మదు తనకుటుంబమునకు ప్రవక్తగా మారునట్లు తానే సాధించెను. సామాన్యమగునొక అరబ్బీయుడై యుండియు, ముహమ్మదు చెదిరినటువంటిస్నీ, నిరుపేదైనటువంటి,

కట్టబట్టలులేక, తినతిండిలేక పరితపించుచున్న తన దేశజనులను, సమకూర్చి, విధేయులగునట్లుచేసి, వారికినూతనాభిప్రాయము లు, నూతన ప్రవర్తనలనుగరపి, ప్రపంచమందు వన్నె కెక్కజే సెను. ఒకముప్పది యేండ్లలోపల యీ నూతన విధానము, కాన్‌స్టాంటినోపిలు చక్రవర్తినోడించి, పర్షియాదేశపురాజులను పటాపంచలు గావించినది. సిరియా, మెసపోటెమియా, ఐగు ప్తుదేశములను లోంగదీసి, తనపరిపాలనము, అట్లాంటిక మహా సముద్రమాదిగ, కాస్పియను సముద్రము ఓక్సనువరకు ప్రభ లజేసినది. ఇవ్విధముగ పన్నెండు శతాబ్దములవరకీ యెల్లవలవ రకు తనదిగ్విజయమును పెంపొందింప జేసినది. స్పెయినుతప్ప, నేటివరకు, ఉత్తరఆసియా, మాధ్యమిక ఆఫ్రికా, కాస్పియన్ సముద్రపుటద్దరి ప్రదేశముకూడా, ముస్లీము ప్రభావము క్రిం దనే యున్నవి.

వీరుడును ప్రవక్తయునగు ముహామ్మదు ప్రభావమిటు వంటిదైయున్నది. ఆయనతనజ్ఞానమువలనను ఉద్రేకమువలనను ఒకమతమును ఏర్పాటుజేసెను. అదిపారసీక మతము జీర్ణించి యేనలువురో దానినామోదించునట్లును, భారతదేశముపై దం డెత్తి, పూర్వపు బ్రాహ్మణ్యమును, బౌద్ధమత సిద్ధాంతమును, గంగానది కావలివరకు దరిమివేయుగలిగినది. అంతేకాదు, క్రై స్తవులచేత నాక్రమింపబడిన, తనమొదటి పరగణాలను స్వీక రి చుకొని, దినప్రవర్ధమానముగా, తూర్పు దేశములను, ఐగ

నుండి, జిబ్రాల్టరు వరకుండిన రోమనువారి యనక్షేమందున్న ఆఫ్రికాను స్వాధీనపరుచుకొని, స్పెయినుదేశము నందలి అధిక భాగము నావరించుకొని, రోముపట్టణమునకు భీతిగొల్పునట్టైన లోయరు యొక్క సరిహద్దులవరకు ప్రభలి, కడకు దిగ్విజయముతో, కాన్‌స్టాంటినోపిలు యొక్క రోము నగరమున స్థిరపడగలిగినది.

అతని పుత్రుని మరణము — తనయద్వితీయ కుమారుడగు ఇబ్రాహీము చనిపోవుచు మరణ శయ్యపైనున్నప్పుడు, సూర్యగ్రహణము కలిగినది. వైకుంఠముకూడా, దుఃఖమునందు పాల్గొనుచున్నదను విషయము ప్రజలందరు గ్రహింప గలిగిరి. తనమూఢజనులకు కలిగిన యీమూఢ విశ్వాసమును, బలపరచక, తనకు కలుగుచున్న కీర్తికిజేయూతనీయక, వారిపామర భక్తిని బదిలపరచక, వారితో నిట్లనుచున్నాడు, “ పుర జనులారా ! ఆలకించుడి, సూర్యచంద్రాదులు దేవుని హస్తకృత్యములు, మర్త్యుల పుట్టుచావులను ఘోషించుటకవిమాటు వడవు, గ్రహణమొందవు. ”

ఖురాను గ్రంథము యొక్క రామణీయము. — తూర్పుదేశమునందలి సారస్వతమునందు ఖురాను గ్రంధముచక్కని కావ్యగ్రంథము. అరబ్బీభాషయందలి గ్రంధములన్నిటికిది, ప్రాముఖ్యమైన గ్రంథము. దానియందు, చక్కని శైలి, దీర్ఘమగు నూహాభిప్రాయ

ములుగలవు. అంతియగాక, సాహసమును విజృంబించునదై, చదువ జదువ రుచులనీనుచు గొంయతు, అనుమహా పురుషుని సహా ఆకర్షింప గలిగినదైయున్నది.

అరబ్బీయులు, ప్రపంచగురువులు. అదునాతన, సనాతనకాలములకు సంభంధము గల్పించువారు, అరబ్బీయులగు శాస్త్రవేత్తలైయున్నారు. ఏషియాలో సరాసీనులును, స్పెయినులో మూరులును, సారస్వత పాండితియందు ప్రముఖులై ప్రభలియుండిరి.

మోషేము అనునాతడిట్లనుచున్నాడు " పదియవశతాబ్దియందు, ఐరోపాఖండము, దుర్భరమగు నందకారమున మునిగి తేలుచుండెననియు, నట్టికాలమున, లాటెనుభాషకు ప్రాముఖ్యతయుండెననియు, నాకాలము కఠినమగుకాలమని పరిగణింపబడుచుండెననియు, సముదాయముపై ప్రజలభిప్రాయపడుచున్నారు. ఆకాలపు విజ్ఞానము, సామాన్యమగు తర్కవాదమునను, భాషాఉచ్చారణముననను కలసిపోయి విశేషమగు తెలివితేటలనుకనపరచకుండెను. మానవజ్ఞానమంతయు నింతియేయని వారనుకొనుచుండిరి. ఇదియిట్లుండగా. అరబ్బీయులగు విజ్ఞానులు, స్పెయినుు, ఇటలీ. దేశములయందు, యెన్నియో పాఠశాలలకు విద్యాన్వేషణమై వేంచేసి, నేర్చుకొని, క్రైస్తవ బడులయందావిద్యను ప్రవేశపెట్టుచుండిరి. గణిత, మానసిక, జ్యోతి

ష్య, వాస్తుశాస్త్రములు, పదియవశతాబ్దినుండి యూరపున ప్రబలుచుండెను గాని, అవియన్నియు అరేబియా బదులనుండి, స్వీకరించినవేయని చెప్పవలసియున్నది. స్పెయిను దేశము, మిా దుమిక్కిలిగా, నీవిద్యలకు నిలయమై యుండెను. "ప్రస్తుతపు యూరపు, తనయందు మొదట విజృంభించిన, కవిత్వాంకురము, రసపోషణము, అరేబియా వారిదనిగ్రహించి, కృతజ్ఞత గలిగియుండ జెల్లును.

స్పెయిను దేశమునందలి ముస్లీములు.

ముస్లీము సామ్రాజ్య మహాభవనముయొక్క కడపటి శిథిలావస్తను విచారించిన వారెవరు కన్నీరు గార్చకుందురు? వారేలిన యెనమిది శదాబ్దములయందు, దుండగములులేక, కారణరాహిత్యముగా రక్తము చిందించక, చరిత్రకారులు వ్రాసిన తెరంగున, ధైర్యసాహసములగల్గి, న్యాయపరిపాలన జేసిన విధానముల దలపోసిన నెవరిగుండెలవిసిపోవు? శాస్త్రవేత్తలను గ్రంధబాండాగారములను, గణితశాస్త్ర గ్రంథములను, మహాకవిత్వములను, యేడు నందల సంవత్సరములు వ్యయప్రయాసల కోర్చివ్రాసిన పవిత్రమగు పుస్తకములను, అగ్నికాహుతిగావించి భస్మీకృతము గావించి, తమపట్ల దయారసములను జూపించినవారి యెడల నధికమగు క్రౌర్యమునుజూపి, జాతీయాధికారమును నాల్గుపాదముల నడిపించుచుండిన క్రైస్తవమతగురువుల చర్యలదిలకించిన, నెవరికన్ను లెఱ్ఱబారవు?

# సరుతామస్ కారులైల్.

[ హీరో అండ్ హీరో వర్షిప్ ] నుండి వ్రాయబడినది.

1. ముహమ్మదు యొక్క ప్రవర్తన. సాధారణముగా బాలకులు నేర్చుకొనునట్టి పాఠశాలశిక్ష ముహమ్మదుకు లేనేలేదు. ముహమ్మదుకు బొత్తిగా వ్రాయుటయే తెలియదఁట. కాని, బాల్యమునుండి యీతఁడు ఆలోచనపరుఁడని పేరుబొందినవాఁడు. అతనిస్నేహితులాతనిని ( అల్లమీన్ ) విశ్వాసముగలవాడనుచుండిరి. మనోవాక్క్రియలయందు త్రికరణశుద్ధిగా సత్యవంతుఁడును నమ్మకస్తుడునైయుండెను. ఆయనకు ప్రతిదానియందు సత్యమున్నట్లు తనపరిచరులు గ్రహించుచుండిరి. కారణములేక మాట్లాడు వాడుకాడు. పలికిన, సత్యము పలికెడువాఁడు, వివేకముతో మెలిగెఁడువాఁడు. చర్చించు విషయమును చక్కగా విమర్శించువాఁడు, అతని జీవితమువలన నాతఁడు దృఢమైన వాఁడును, సోదర ప్రేమగలవాఁడును, కలసిమెలసి తిరుగుచనుండువాఁడు నైయుండునట్లు తేలెను.

2. అతని నిరాడంబర జీవితము. అతని యింటిలోని వ్యవహారములన్నియు నిరాడంభరముగా జరిగిపోవుచుండెను. అతని అనుదిన ఆహారము రొట్టెయు నీళ్లునైయుండెను. కొన్నిసారులు, నెలలకొలది, యింటవంటయే లేకుండెడిది. తనవస్త్రములు తానే

కుట్టుకొనుచు, తనపాదరక్షలు తానెసవరించు కొనుచుండెనని ప్రజలనుచున్నారు. పేదవాడు, కష్టజీవి, సరియైనభోజన సామాగ్రిలేనివాడు. అతడు దుష్టుడుకాడు. అతనియందు సుగుణము లున్నవి. ఇరువదిమూడు సంవత్సరములాతనితో కలసి మెలసి తగవులాడుచుండిన అనాగరికులగు నరబ్బియు లాతనియందు సుగుణములులేకున్న మర్యాదచేసియుండరు. వారు మోటువారు. ఎల్లప్పుడు తగవులాడువారు. ఉత్తమగుణములు లేనివాడెవడు, సారినిస్వాధీన పరచుకొనలేడు వారాతనిని ప్రవక్తగా నేలపరిగణించిరని మీరు నన్నడుగవచ్చును. ఆయన, వారి యెదుట ముఖాముఖిగా నిలువబడి, తనవస్త్రములను దానేకుట్టుకొనెను' తన చెప్పులు తానె నవరించుకొనెను, జగడముల యందు ముందంజవేసెను, న్యాతీర్పు తానేగావించెను, ప్రజలను ప్రచండముగా సాగించెను కానిచాటున దాగుకొని రహస్యముగా నేదియుజేయలేదు, యివియన్నియు వారుచూచియుండవచ్చును. అందుచేత వారికిష్టమున్న పేరుచేత నాతనిపిలువనిండు. ఇతనికి తనప్రజలు విధేయులైనట్లు, సర్వాధికారమును గలిగిన యేభూపాలకునికైన నాతనిప్రజలు లోబడియుండలేదు. ఇరువదిమూడు సంవత్సరముల కఠినజీవితకాలమున దిగ్విజయముగాంచి వీరుడైనట్లు నేనుగ్రహించుచున్నాను.

3. <u>నూతనోదయమై మహిమ ప్రవేశమైనది.</u> అరబ్బీ జనాంగమునకిది, చీకటినుంచి వెలుగున జన్మించిన దినమైయున్నది. దీని

వలననే అరేబియా జీవించగలిగినది. వారు నిరుపేదలుగా గొర్రెలకాపరులు. ఈ కొత్తశక్తినుండి బహిరంగపడక, ఎడారిలో సంచరించుచుండిరి. వారికొఱకొక వీరుడు జన్మించెను. తృణీకరింపబడినవాడు పూజ్యుడాయెను, తృణమాత్రునిగా నెన్నబడినవాడు ప్రపంచమున కగ్రగణ్యుడాయెను. ఒకశతాబ్దిలోపల, గ్రెనాడానుంచి ఢిల్లీవరకు, అరేబియా పెరిగిపోయినది. సాహసమును, శౌర్యమును, మేధచ్ఛక్తిని, పరాక్రమమును గూర్చి విచారించిచూచిన, అరేబియాయందే, కడుదీర్ఘకాలమునుండి యునికి పట్టియున్నట్లు గ్రహింపగలము. విశ్వాసము జీవనోత్పాదియైయున్నది. విశ్వాసము దృఢపడినవెంటనే, యేజనాంగమైనను ఫలదాయకమగు చరిత్రముగల్గి, ఆత్మావేశముగల్గి, ఔన్నత్యపదవి నందుచున్నది. అరబ్బీయులకొకవైపు మానవుండగు ముహమ్మదు అభివృద్ధినందిన నూరేండ్లనొకవైపు పెట్టి చూచిన నేమి గోచరించుచున్నది? చొరరాని మహాంధకారమున నొక్కయగ్నియణువు పడినట్లుతోచదా? కాని, ఆ భయదాంధకారము అగ్నికాహుతియై, జ్వాలలవీచికలు, గగనవైశాల్యము నావరించి ఢిల్లీనుంచి గ్రెనాడా వరకు నావరించుటలేదా? ఉత్తమపురుషులు, గగనమును జీల్చుకొనివచ్చు మెరపు తీగవలె నుందురు. తక్కినవారు, బొగ్గువలె సిద్ధముగానుండి, మెఱపుతీగవలన కాల్చబడి, వారుకూడా ప్రజ్వలించుచుందురు.

4. ఖురానుయొక్క నిజత్వము. అన్నిటికి పైగా నిష్కాపట్య మున్నతమగు లక్షణమై ఖురానుయందు తాండవించుచున్నట్లు నేను గ్రహించుచున్నాను. ఈకారణమువలననే, కరకుమోటగు అరబ్బీయులు దానినామోదింప గలిగిరి. ఏగ్రంథమునకైనను యీగుణలక్షణము మిగుల వన్నెదెచ్చునదైయున్నది. ఖురాను నందనేక సుగుణములున్నవి. నిజమునకేమిగాని, సరియైన లక్షణము యీగ్రంథముననే గలదు.

# సరు విల్లియం మ్యూరుగారు.

( లైఫ్ ఆఫ్ ముహమ్మదు ) నుంచి

ముహమ్మదుయొక్క నిష్కాపట్యమునకు సాక్ష్యము.

మొదటి యిద్దఱు కలిఫాలగు, అబుబకర్, ఉమ్మర్ అనువారలకు ముహమ్మదుపైగల విశ్వాసము, పట్టుదల, అనురాగములే, ముహమ్మదుయొక్క నిష్కాపట్యమును నిరూపింప లవు. వారు తమకీతనిపై గలవిశ్వాసము, సహేతుకమైనదా దాయని, పలుతెరంగులవిమర్శించి, పరీక్షించి, యెంతోకాల మాలోచించి, కడకాతనిని వెంబడించిన కారణమున, వీరివిశ్వాసమున నెట్టిలోపముండ జాలదని దృఢముగా జెప్పవచ్చును ముహమ్మదు నడవడికను నేనెల్లప్పుడామోదించుచుందును. కలీఫాలనమ్మకము నానమ్మకమును బదిలపరచుచున్నది.

తనగర్భశత్రువులను మన్నించిన విధము. తన నిరంకుశాధికారమును విచ్చలవిడి సాగించినను, న్యాయమును మాత్రము తప్పలేదు. తనకు లొంగిపోయిన శత్రులయెడలకూడ దయగలిగియుండెను. దేవునిచేత పంపబడిన ప్రవక్తనని చెప్పుచుండగా దానికి ప్రతికూలముగా మక్కావారు యెన్నియో విధములదుండగములు చేసి యెడతెగక నాతనికి విరోధముగా పోరాడినను వారాతనికి స్వాధీనులైనపిదప, తనపగదీర్చుకొనుటకు వారికేలాటిహింసగావించలేదు, వారిరక్తము చిందించలేదు, వారియిండ్లుకాల్చలేదు. కొందరు, నరహంతకులనుదప్ప, తక్కిన శత్రువులనందరిని క్షమించి, వారుచేసిన క్రియలు, దోపిడీలు, హత్యలుమొదలగు హింసలనన్నిటిని జ్ఞాపకమునకు దెచ్చుకొనక, తన గర్భశత్రువులను సహితము, స్నేహితులవలె భావించెను. తనకు ప్రతికూలముగా యుండిన మదీనా వాస్తవ్యులైనను, అబ్దుల్లానైనను, నిరసించలేదు, వీరనేక సంవత్సరము లానికెదురాడిరి. దానినిజ్ఞాపకము చేసుకొనలేదు. పలుతెరంగులగు గోత్రముల వారు, పూర్వమాతనికి చెప్పరాని శత్రువులై మెలగినను, వారి స్వాధీనులైనపిదప, దయాపరుడై మెలగెను.

చరిత్రలో ముహమ్మదుకు సమానులులేరు. గురుదైవమును నిరసించు జనాంగమునకు పశ్చాత్తాపమునునేర్పి, నిరుత్సాహముకలుగునపుడుత్సాహపూరితుడై పదమూడుయేండ్లు హింసలకోర్చి తిట్లుకు వెరువక, తనస్థిరమైన భక్తినిబదిల పరచుకొనినటువంటి

అరేబియా ప్రవక్తకు, చాటియగు మహాపురుషుఁడు ప్రపంచ చరిత్రయందెందైనను గానరాఁడు. విశ్వసించిన, యేపదుగురు స్త్రీపురుషులనోకలిగి, భావికాలమున కలుగబోవు విజయమును గూర్చి దృఢనమ్మకముకలిగి, అవమానములను, భయోత్పాత ములను, క్లిష్టపరిస్థితులను నెమ్మదిగాసందించెను, దూరదేశము నదనకు శరణ్యమున్నదను వార్తవినినపుడు, తనయనుచరులంద రచ్చటికి సురక్షితముగా చేరువరకుండి, పిదప, కృతజ్ఞతలేని జగడగొండి ప్రజలమధ్యనుండి మాయమైపోయెను.

ఇస్లాము మతమువలన లాభములు. మహమ్మదు, మానవకోటికి, యిటువంటి దుర్భరపరిస్థిల సహించి, జయించి, పోవుచు, విడ చినలాభము లేమైయున్నవి? అరేబియాను, యేండ్లకొలది ఆవ రించియుండిన, పూర్వాచారములగు మూఢభక్తి యంతరించి పోవుట, 'ఇస్లాము మతయుద్ధదుందుభీ మోతకు తాళలేక విగ్రహారాధన దిక్కులకెక్కినది. దేవుఁడు ఒకడేయనియు, ఆయన సర్వదాపవిత్రుఁడనియు, సర్వలోకములయందు సంచ రపగలభగవానుఁడనియు, అరబ్బీయులు నమ్మగలిగిరి. మహమ్మదుకుండిన నమ్మకమిదియె. ఇస్లాము అనగా, దేవుని యిష్టమునకు సంపూర్ణముగా సమర్పించుకొనుటయై యున్నది. ఇస్లామును నమ్మువారు యీసత్యము నామోదింప వలయును. సాంఘికముగా నాతనియందు సుగుణములు లేకపోలేదు. సో దరప్రేమ విశ్వాసులయందుద్భజమైనది శిశుహత్యనిషేదింప

బడినది. అనాదబాలకులు సంరక్షింపబడిరి. బానిసలు న్యాయమునకు పాత్రులగుచుండిరి, మధుపానము నిషేధింపబడినది. ఇతర జాతులవారినిమించిన, మధుపాననిషేదము, మాయందు కలదని ఇస్లాము మతమువారు గర్వించవచ్చును.

## మీత్ యొక్క బిషపుగారగు

## రిచ్చరుపోకోక్

[ డిస్క్రిప్షన్ ఆఫ్ ఈస్ట్ అండ్ అదర్ కంట్రీసు మొదటి వాల్యూము ] నుండి వ్రాయబడినది.

మహమ్మదు యొక్క సహానభావము. (పరిశుద్ధుడగు ప్రవక్త సీనాయి పర్వతములపై నివసించు, సన్యాసులకును, క్రైస్తవులందరికి నొసగిన పత్రికమువలన, నాతని సహనభావము నిరూపింపబడుచున్నది.) అది యీదిగువ నుదహరింప బడివది.

దేవుడుసర్వోన్నతుడు. సర్వమునేలుచున్నాడు. ఆయన ద్వారా ప్రవక్తలందరు జన్మించినారు. దేవుడన్యాయస్తుడని చెప్పుటకాధారమేమియులేదు. అబ్దుల్లా కుమారుడును, దేవుని పంపున వచ్చినవాడును, ప్రపంచముయొక్క సంరక్షకుడును, మానవుడనగు ముహమ్మదు తనకొసంగబడిన బహుమానములవలన, యీ పత్రికను, తన స్వంతజనులకును, తన మతము

వారికిని వ్రాయుచూ, క్రైస్తవ జనాంగములకొఱకును. క్రీస్తు జనాంగమగు నజోరియులకొఱకును, వారు పేదలై, ఘనులైన, గౌరవనీయులైనకాకున్నను, న్యాయముజరుగునని వ్రాసినాడు.

1. నాజనులలో నెవడేని, యీ పత్రికయందలియే యొప్పందమునైనను ఉల్లంఘించ దలంచిన యెడల దేవుని ఒప్పందమునకు ప్రతికూలముగా నడచుచున్నాఁడు, విశ్వాసమును పాడుజేయుచున్నాఁడు, అట్టివాఁడు రాజైనను, నిరుపేదయైనను, శాపగ్రస్తుఁడగుచున్నాడు.

2. క్రైస్తవ సన్యాసులు, పర్వతములయందైనను, తిప్పలయందైనను, గ్రామములయందైనను, మరేప్రదేశమందైనను, లేక సముద్రము నైనిగాని, యెడారిలోగాని, దేవళమునందైనను, ప్రార్థనాస్థలమందైనను విడిదిదిగినచో, నేనువారి మధ్యనిలచి, వారినికాపాడి సంరక్షించెదను, వారివస్తువులను కాపాడెదను, నాజనులందరితో నేకీభవించివారిని రక్షించెదను. ఏలయన, వారు నాజనులలో నొకభాగమైయున్నారు. వారివలన నాకు గౌరవము కలుగుచున్నది.

3. అధికారులందరికి నేనానతిచ్చునదేమనగా, వారివలన నెట్టి సుంకముగాని, పన్నుగాని, స్వీకరింపవలదు. అట్లిచ్చునటు బలవంతపెట్టరాదు.

4. వారిన్యాయమూర్తులను, గవర్నరులను, మార్చవలయునని కోరవలదు, వారువారిస్థానముల యందుండ వలయును.

5. వారుదారులలో పోవుచుండగా సారినెవరు అటంక పరచరాదు.

6. వారికెట్టి దేవాలయములున్నను, వానిసికూల్చరాదు.

7. ఈ నా ఆజ్ఞలను కొట్టివేయువాడు దేవుని ఆజ్ఞలకు ప్రతికూలముగా నడచుచున్నాడని గ్రహింపవలయును.

8. అదియునుగాక, వారిన్యాయాధిపతులైనను, గవర్నరులైనను, సన్యాసులైనను, సేవకులైనను, శిష్యులైనను, మరెవరైనను సుంకపుపన్నియ్యవలసిన పనిలేదు. వారినెవరు కష్టపెట్టరాదు, ఏలయన, వారికి నేనుసంరక్షకకర్తనైయున్నాను, వారు భూదిగంతముల యందెందుండిననుసరె, వారేకాక వారి భుక్తమైన వన్నియు, నేను వారిసియిచ్చిన పత్రిమునందు కాన, వారిని కష్టపెట్టరాదు.

9. పర్వతములపై నేకాగ్రజీవితమునసుండు వారియొద్దనుండి కమైనను పదియవవంతైనను స్వీకరింపరాదు. ముస్లీములెవరైనట్లుచేకోనవలదు. ఏలయన వారుతమ జీవనోపాది మాత్రివ సంపాదించు కొనుచున్నారు.

10. పంటలు సమృద్ధిగా పండినకాలములలో, ప్రతివాడు తనకు కలిగిన ధాన్యమునుంచి, కొంత వారికి దానము చేయ వలయును.

11. యుద్ధకాలమందైనను వారిపనిపాటల కాటంకము కలు గనియ్యవలదు. యుద్ధము జేయ బలవంతపెట్టరాదు. సుంకము కూడా తీసుకొనవలదు.

12. వాస్తవ్యులైన క్రైస్తవులలో ధనవంతులై వ్యాపార ము జరుపుచుండినవారు 12 దేనారములు మాత్రము సుంక మియ్యవచ్చును.

13. ఇదితప్ప వారివలన నురేమియు పుచ్చుకొనరాదు. ఇది దేవుని ప్రచండమగునాజ్ఞ. ఏలయనగా, దైవవాక్య మిట్లనుచు చున్నది. " దేవునివలన పంపబడిన గ్రంథములను సన్మానించు వారిని కష్టపెట్టక, వారియెడలదయగలిగి, మీ మంచివస్తువుల ను వారికిండు, వారితో ముచ్చటించుడి యితరులెవరైనను వారిని కష్టపెట్టకుండునట్లాటంకపరచుడి.

14. క్రైస్తవస్త్రీ, ముస్లీమును పెండ్లాడిన యెడల నట్టిస్త్రీని దేవాలయమునకు పోనియ్యక, తనప్రార్థనలు చెప్పుకొననియ్యక ఆటంక పరచక, తనమతమునకు భిన్నము కలుగునదేదియు చేయరాదు.

15. వారి దేవాలయములను సవరింప కుండునట్లాటంక పర చరాదు.

16. ఈహితవులకు ప్రతికూలగా ప్రవర్తించువాఁడు వాస్తవముగా దేవునికి ప్రతికూలుఁడై యున్నాఁడు. ఏలయన, నీయొప్పందము దీనిమూలముగా వారికిచేయుచున్నాను.

17. వారితో నెవరును యుద్ధము చేయవద్దుగాని, వారికొఱకు ముస్లీములందరు యుద్ధము చేయవలయును.

18. నాజనులెవరైనను, దీనికి ప్రతికూలముగా, ప్రళయకాలమువరకు చేయకుండ వలయునని, దీని మూలముగా నేను శాసించుచున్నాను.

( పదియారుగురి చేవ్రాలు )

3 వ మొహరం 2 వ హిజిరినాడు వ్రాయబడినది.

# ప్రొఫసరు టి. డబ్లియు. ఆర్ నాల్డు.

( ప్రీచింగ్ ఆఫ్ ఇస్లాము ) నుంచి.

ఇస్లాముచంపలి గురుపీఠము, ముస్లీమునకు, దేవునికి, నడుమ రొమ్టెమధ్యవర్తిలేనందున, ప్రతివ్యక్తి తనరక్షణకుదానె పూచీపడవలసి యున్నది. అందువలన, తనమతాచారములు నిర్వర్తిం

చుటయందు మిగుల శ్రద్ధవహించును, మతసత్యములను, గ్ర హించుటయందును, తనవిశ్వాసమును కార్యరూపమున జూపు టయందును వెనుకాడడు. ఇత్తెరంగున ముస్లీమేతరుల ప్రత్యక్ష మున నొకపరిపూర్ణమైన వ్యక్తియగుచున్నాడు.

ప్రచారణీయమగు మతము, ఇస్లాము మతవార్తను, భూదిగంత ములవరకు గొంపోవుట ఇస్లాము మతస్తుల దీక్షయైయున్నది. అందుకై జేసివారు సరియగు ప్రచారకులన జెల్లుదురు. దేవుడు తానేర్పాటు చేసుకొనిన జనాంగమునకు మాత్రముయుద్ధమున విజయమొనగునని తలంచి, దేవుని చిత్తమైతే, లోకభోగము లొసగుచుండెనని యూహించుచుండిన క్రైస్తవులు ముస్లీములను సంధించినపుడు, క్రైస్తవుల విశ్వాసము, ముస్లీముల ఆయుధ ముల ముందుజీర్ణించి పోవుచుండెను. ముస్లీముల విజయమే క్రైస్తవుల మతమునందలి నిజానిజములను వితర్కించుచున్నది. ముస్లీము బంధీకృతులు పలుమారు, తమ యజమానులకు మత ప్రచారము చేయుచుండిరి. బందీకృతునిగా గొంపోబడిన యొక ముస్లీము ప్రముఖునివలన, యిస్లాము మతము మొట్టమొదట యూరపున ప్రవేశించినది. యిస్లాము మతమువారికి బోధించు టవలన, వినినవారు నమ్మి ముస్లీములు కాసాగిరి. అంతట ఈ మతము ప్రభలసాగినది.

ప్రపంచ సౌభ్రాతృత్వము. అన్నిటికిపైగా, యిస్లాము మతచరిత్రలయందలి ప్రచారమునందుత్తమ గుణమిదియె. ప్రతిగడియ తమ ప్రత్యేక ప్రార్థనలు చేయునపుడు, యేవైపున తమముఖములను త్రిప్పుచుందురో, ఆస్థలమునకు ప్రతియేట ప్రపంచమునందలి ముస్లీములందరు, గుమిగూడి ప్రార్థనలు చేయునట్లి మతము శాసించుచున్నది. ప్రపంచమునకెక్కిన ఏమతోద్ధారకుడైనను, తనయనుచరులందింతపాటి సోదరభావము విశ్వాసము, భక్తిబాదుకొల్పలేదు. ఆఫ్రికా వాసుడైన నీగ్రోజాతివాడును, తూర్పుదేశమునందలి చీనాదేశస్థుడు, యేబేధములేక, ఒక్కచోట ప్రార్థించుచున్నాడు. నవనాగరికుడగు టర్కీదేశస్థుడు, యెంతోదూరమందున్న ద్వీపకల్పవాసుడగు మలయా వానిని తనసోదరునిగా భావించుచున్నాడు. టర్కీ, ఐగుప్తు దేశములయందు పరిగణింపబడుచున్న బైరాము లేక ఇదుల్ ఆధా నా పండుగను వీరు తమగృహముల యందాచరించునపుడెట్లు, తమ నిరుపేదలగు సోదరులకొఱకు వారుపరితపించెదరో, ఆట్లే, పరిశుద్ధనగరమున విశ్వాసులందరు సమావేశమైనపుడు పరితపించెదరు. పరిశుద్ధమగు నగరమును దర్శించిన ముస్లీము యాత్రీకులలో ననేకులు, తమయనుభవమువలన, దేవునికివైపుకు తమ ఆత్మలను త్రిప్పగలిగిరి.

ముస్లీము మతావలంబనమైన స్పేయిను దేశము. మధ్యకాలపు యూ

రపుదేశ చరిత్రగ్రంథములో యిస్లాము మతము నవలంభించిన స్పెయినుదేశము చక్కనిపుటలను వ్రాసినది. శౌర్యసంపన్నమగు కాలమీమతము వలనే కలిగినది. దాని ప్రతాపము, దేశదేశములకు వ్యాపించి యూరపంతయు నావరించి నూతనోత్తేజమును, నూతన సారస్వతమును, కవిత్వమును, ఉద్భవింపజేసినది. వీనినన్నిటిని, క్రైస్తవులు నేర్చుకొనిరి. దీనికి పూర్వము గ్రీకుదేశస్థుల విజ్ఞాన కౌశలము నిట్లే క్రైస్తవులు స్వీకరించుచుండిరి.

# ఫ్రాన్సు దేశమునందలి ప్రొఫెసరు ఈ మానెట్ గారు.

( ఆర్నాల్డు వలన స్వీకరింపబడినది )

<u>ఇస్లాము మతము సహేతుకమైనది.</u> చరిత్రాంశకముగా గాని, పదమునకు గలఅర్థమును బట్టి చూచినను, ఇస్లాము మతము హేతు భూతమై, సకారణమైన మతమనిపించు కొనుచున్నది. మదినచర్యల కనుగుణ్యమగు మతము సహేతుకమైన మతము. ఇస్లాము మతము నందీలక్షణమున్నది. ఆవేశ పరుడును, శ్వాస నిశ్వాసమును గల్గిన వాడగుటవలన, నీసుగుణములను, తన శిష్యులకందించి, తాను చేయదలంచిన సంస్కారము అద్భుతరీతిని వెల్లడిచేసెను. ఈనిరూపణమున కొక్కరూపమే కలదు. సహేతుకమైన పునాదియగు కారణముపై వివిధమగు

మతములంగల వివిధ సిద్ధాంతముల మర్పబడినవి. ఈ మతము క్లుప్తమైనదియు, వివిధ మతసిద్ధాంతములు లేక, తేలికయైనదియు, సామాన్యమగు మానవుడుకూడా గ్రహింపగలిగినదియు, సకలమానవుల హృదయ వీధులలో నవలీలగా బ్రాకిపోగలిగినదియున్నైయున్నది.

## స్టాన్లి లేన్‌పోల్.

[ స్పీచెస్ అండ్ టేబిల్ టాక్స్ ఆఫ్ మహామ్మదు ] నుండి స్వీకరితము.

మానవకోటికిది యొక కరుణాసముద్రము. అతని కద్వితీయమగు నూహాజ్ఞానముండినది ఉన్నతమగు నభిప్రాయములు, దయాంతరంగమగు పరివర్తనములును, గలవు. తెరచాటున ముసుగు వేసుకొనియుండు కన్యకకన్న నెక్కుడు మర్యాద గలవాడని కొందఱందురు. తనకన్న తక్కువవారితో కలసిమెలసి యుండెడివాడు. తనసేవకుని నెవ్వరేని దూషించిన సహించెడువాడుకాడు. " పదిసంవత్సరములు ప్రవక్త వెంటనుంటినిగాని, ఒక్కనాడైన పల్లెత్తుమాట నన్ననలేదు " అని మహమ్మదు సేవకుడగు అనాస్ చెప్పుచున్నాడు. తనకుటుంబమును ప్రేమించుచుండెను. పిల్లలన్నప్రాణము పెట్టెడివాడు. దారిలో వారిని చూచిన, వారినాపి, వారితలలపై నిమిరెడువాడు. తనజీవిత కాలమందెప్పుడైన చిన్నపిల్లలను కొట్టినట్లులేదు " నాకేమి ప్రాప్తమైనది

అతని లలాటము మన్ను తగిలి నల్లబడునుగాక" అనునవియే, తన జీవితమున వాడుచుండిన, చెడ్డమాటలు. ఎవరినైన శపించుమన్న, నాతడు, శపించుటకు కాదుగాని, దయచూపుట కేగనని చెప్పుచుండెను. వ్యాధిగ్రస్తులను దర్శించుచుండెను. ఎవరిశవమైన నెదురైన తాను కొంతదనుక మోయుచుండెను బానిసయైనను, భోజనమునకు బిలచిన బోవుచుండెను, తనబట్టలు తానే సవరించుకొనువాడు, మేకల పాలుపితుకుచుండెను, తనపనులు తానే చేయుచుండెను. చేతులు కలిపినపుడు. తానెన్నడైన ముందు తనచేతిని విడదీసికొనలేదు. తనతో మాట్లాడువాడు పోకముందు తానుతిరిగి పోకుండెడువాడు.

ఆతని నాశ్రయించినవారి నాతడతిశ్రద్ధతో సంరక్షించువాడు. ఒరులను నొప్పింపక, వివాదములయందు, అందరికి నచ్చజెప్పువాడు. అతనిని చూచినవారు వెంటనే గౌరవించిరి. అతని సమీపించినవారు ప్రేమించిరి. కొందఱాతనినిట్లు వర్ణించుచున్నారు "అతనివంటి వ్యక్తిని మేమింతకు పూర్వమైనను, యిటీవలనైనను చూడలేదు. ఆయనమితవాది, సామాన్యముగా మాట్లాడడు. మాట్లాడిన ప్రతివిషయమును నొక్కివక్కాణించువాడు. వినినవారు మరచిపోజాలరు."

# హాంగరీ దేశస్థుఁడగు, డాక్టరు జూలియస్ జెర్మానస్.

౧౯౩౦ వ సంవత్సరము, డిసంబర్ మాసమున, లాహోరు నందాతఁడొసఁగిన ఉపన్యాసమునుంచి చేకొనబడినది.

ఈమతాంతరీయము నవలీలగా గ్రహింపవచ్చును. ఇస్లాముమతము, మొదట ప్రభలినపుడు, లోకమునందలి పలుతెరంగులగు ప్రజల నేకీభవింపజేసి, ప్రవక్త మొదట ఖురానునేర్పిన అరబ్బీయుల యొక్క వివిధసాంఘిక, ఆర్థికపరిస్థితుల రూపుమార్చినది. ఇస్లాము మతమునందు దాపెర్రికమేమియులేదు. దానిఅంతరీయము వలీలగా జూడవీలున్నది. యిస్లాము మతము ప్రభలుచు, నీతి ధర్మములను భహిర్గతము గావించుచు, అన్నికాలములయం దాత్మీయాభివృద్ధి కనుకూలమగు లక్షణములను గల్గియున్నది. దేవుడు, మనుష్యులను యిస్లాము మతముకొఱకు సృష్టిచేయ లేదనుమాట ముమ్మాటికి వాస్తవమేగాని, విశ్వసించు వారికి క్రియలు' ఆత్మతత్వము కీర్తివంతములగునట్లు ఇస్లాము మతము మానవులకొసగియున్నాఁడు.

ముస్లీములు విద్య. నిద్రావస్థయందున్న యూరపునులేపి, ఆత్మీయాభివృద్ధి నన్వయింపజేసినది ఆత్యంతమగు శక్తిగల్గిన యిస్లా

ముమతమేయని చెప్పవలసియున్నది. కాని, యిత్తెరంగున, ఒం డొంటియందు వైషమ్యమునఃబూని, నిలచుచున్న, యిస్లాము క్రైస్తవ మతములలో, క్రైస్తవుల ఆత్మీయాభివృద్ధియు జాతీయా ధ్యనుములును, ఇస్లాము మతమువలన నేన్యూనత్వము వహించి నది. ఒకకాలాన, విద్యలన్నియు యూరపునందు అరబ్బీ బాషలో నేర్చుకొనవలసి యుండెను. అదిఇస్లాము మతముయొక్క భాష. ఐరోపా విద్వాంసులు, స్పెయిను దేశమున కేగి అచ్చటిబడుల లో, పుస్తక బాండాగార ములందుగల యీ విద్యావిత్తము నార్జించుచుండిరి. చిత్రకళ, వృత్తిపనులవిద్య యిస్లాము మతపు రాజ్యముల యందద్వితీయమగు వన్నెకెక్కియు డెను. పట్టణపు జాతీయపరిస్థితులున్నత పదవియందుండెను. అందుకై జేరి, కార్మి కులును, వృత్తిపనిసారునగు అరబ్బీయులు పదియారవ శతాబ్దిని స్పెయిననుండి వెళ్లగొట్టబడినపుడు, యీకళలన్నియు నొకేమా రుక్షీణించి పోయినవి. ఈసంగతి నెఱుగని వారెవరులేరుగాని, యిస్లాము మతము, విద్యానాగరికతను పెంపొందజేయలేదను ప్పుడభిప్రాయమును మొదలంట దుడిచివేయుట కిట్లుచెప్పవ ]యున్నది. సంతకన్ననబద్ధమేమున్నది? యిస్లామువారు నెల ల్పిన, సేనవంటె, క్రమశిక్షనంది, యుక్తిపూర్వకముగా, శా స్త్రరీత్యా, అస్త్రశస్త్రముల నధికముగా గల్గినసేన, అక్కాల మునందలి ప్రపంచమునందెందు లేకుండెను. ఈమతము, విజ్ఞాన మును సృష్టించి, తక్కిన శాస్త్రములను ప్రభలజేసినది. పిదప ఐరోపారాజ్యాంగములు వానినినేర్చుకొనిరి.

గురుపీఠ మంతరించినది. గురువుల విధానము, ముహమ్మదు వెంటనే నిర్మూలించినాడు. దేవునికి మనుజునికి మధ్య, యేమధ్యవర్తి, యిస్లాము మతమున కవసరములేదు. ప్రథమమునుండి, యిది ప్రజాదరణీయమగు మతమైయున్నది. సృష్టికిని, సృష్టికర్తకు మధ్యనెట్టి సంస్థలేదు. ఖురాను గ్రంథముయొక్క విజ్ఞానము వలన సరియైన దైవజ్ఞానము కలుగ వీలున్నది. ఇదిస్వేచ్ఛగా లభించునదైయున్నది. ఎట్టిమాధ్యమిక నిర్బంధములతో పని లేదు. ఈకారణముచేత, క్రైస్తవులలో లూతరువలన ప్రారంభింపబడిన రిఫర్మేషనులాటి, మార్పులు, ఇస్లాము కవసరమే లేదు అసలు యిస్లాము మతము నేలుచున్న ప్రజాపాలనాభిప్రాయము, క్రైస్తవములో, జాతీయోద్యమము, మతసంస్కారము (Reformation) ప్రారంభించువరకు, కలుగనేలేదు.

## మేజరు జనరల్ ఫోర్లాంగ్.

(షార్టు స్టడీస్ ఇంది సైన్సు ఆఫ్ కంపారిటివ్ రిలిజిన్సు) నుంచి.

గుణవంతుడగు ప్రవక్త. అరేబియా దేశమునందలి మహాపురుషుని యొక్క విశ్వాసమును, అతని రహస్యబహిరంగ జీవితమునుగ్రహించి అతనిమంచిచేష్టల నారసి, తానుజీవించిన కాలపు పరిస్థితులనెరింగి, నలువది సంవత్సరములు, ప్రపంచమునందలి ముసాల్మానీయులందరు పొందినమార్పులను, జాగ్రితగా చదివి,

విచారించినచో, భూమిపై నేకచక్రాధిపత్యము వహించిన మహారాజులకన్న, మహాపురుషులకన్న, ప్రవక్తయగు మహమ్మదు అగ్రగణ్యుడగు చున్నాడు. న్యాయ సభయందైనను, శిబిరములయందైనను, అధికారిగాయుండినను, భయంకరమగు జగడగొండి అరబ్బీ తెగలను సమర్థించు ఉద్ధారకుడై ప్రవర్తించినను, మహమ్మదు మిగుల నిపుణుడై మిత్రులు శత్రులు తన్నాదర్శప్రాయునిగా లెక్కించునట్లు నడచుకొనుచు, అందరి వలన, ప్రేమింపబడి, గౌరవింపబడి, యాతని యాంతరంగమె ఱింగిన ప్రతివ్యక్తివలన నున్నతునిగా నెన్నబడుచుండెను.

ముస్లీము పాలకుల విద్యాకాంక్ష. ముస్లీము పాలనము, పశ్చిమ ఏషియా, ఆఫ్రికా, దక్షిణయూరపు, మొదలగు ప్రదేశముల యందు, స్థిరీకరింపబడిన పిదప, వానిపాలకులు, పాలితుల విజ్ఞానోదయమున కెంతయు శ్రద్ధవహించుచుండిరి. ఐరోపాఖండపు నాగరికతను విజృంభింపజేసి, నూతనాభ్యుదయమును బొటిమరించేసినది, ముస్లీములనియు, అరబ్బీయులు లేకున్న యూరపు ఖండము నాగరికతకు, అభివృద్ధికి, ఖేంద్రస్థలము కాజాలక పోయెడిదనియు, "ఐరోపాదేశపు నాగరికతచరిత్ర" ప్రణేతనుడువు చున్నాడు. వారు స్పెయిను దేశమునుంచి బగ్దాదువరకు విద్యాశాలలను నిర్మించిరి. ప్రజ్వలితమగు నక్షత్రములవలె వారిపండితులు, ఉపాధ్యాయులు ప్రభలసాగిరి. క్రైస్తవులు, మూఢత్వ

మున. భావికాలముపై నిరీక్షణలేక సనాతన ధర్మపారాయణ మున మునిగి జీవితము నిరుత్సాహకరముగా గడుపుచుండగా, ముస్లీములు యూరపును, రక్షించునట్టివిజ్ఞాన సంరక్షకులై మధ్య కాలపు చీకటినిదిక్కులకు బనిపిరి.

ముస్లీములు-బహుపత్ని వివాహము. బహుపత్నీ వివాహము, పలుతెరంగులగు సాంఘిక దోషముల నడుగంటించుటకు మంచి యిరుగుడని మహమ్మదీయులు తలంచుచున్నట్లు మాక్సుముల్లర్ గారు చెప్పుచున్నారు. ఈ మహానాయకుని చరిత్రను విచారించునపుడు, అన్నిటముఖ్యముగా, తానుజన్మించిన జన్మభూమి యెడారిలో నివసించువారి పరిస్థితులు, వారి యేలికలు, అక్కాలపు మూర్ఖపు గోత్రికులు మొదలగు నైసర్గిక విషయములు మనదృష్టియందుంచు కొనజెల్లును. అరబ్బియులభిలషించుచుండిన బహు భార్యాస్వీకరణము నాతడాపివేసి ప్రాణములతో పసిబాలికలను పూడ్చివేయు శిశుహత్యను దెగటార్చి, స్త్రీలను చాకుడు జంతువులవలె నెంచి, చేతనైనవాడు తనకిష్టమున్న వనితను బలత్కారముగా స్వీకరించుచుండిన దుర్మార్గపుటల సాటులను పుటమార్చి మహమ్మదు దేశభక్తుడును రాజ్యాంగ విశారదుడునగు చున్నాడు. ఆయన జీవించియున్న కాలానా, స్త్రీలస్థితి మిగుల విషాదకరముగా నుండెను. పశువులకన్న హీనముగా చూడబడుచుండిరి. ఎంతమంది భార్యలున్న నంతగౌరవనీయులగుచుండిరి.

అందుచేత, ప్రతిభార్యయెడల న్యాయము జరుపగలిగితే, పురుషులెంతమందినైన పెండ్లాడవచ్చునని ముహమ్మదు ఆనతిచ్చెను. దీనివలనదేలిన పర్యవసానమేమి హీనమైనదిగాదు. ప్రేమయందు, పరిశుద్ధతయందు, సమాదానమందు, ముహమ్మదీయుల కుటుంబములేమి క్రైస్తవ కుటుంబములకు దీసిపోవుటలేదు. ఒకవిధముగా ముహమ్మదీయులలో భార్యాభర్తల వియోగ పరిత్యాగములు క్రైస్తవులకన్న దక్కువ. సరియైన వారసుడైనను, తనతల్లి యిష్టములేక, ఆమెస్వాస్థ్యమున కధికారికా జాలడనియు, పెనిమిటియైనప్పటికిని, తన భార్యమాటపై పరిపూర్ణ నమ్మకము కలిగియుండవలయుననియు జెప్పబడినది.

## డినెట్ — సలీమ్.

[ లైఫ్ ఆఫ్ ముహమ్మద్ ది ప్రాఫిట్ ఆఫ్ అరేబియా ] నుంచి.

ప్రపంచమంతటి కన్వయించు మతము. ప్రప్రథమమున, ముహమ్మదు జీవించి యున్నపుడుకూడ, అతని బోధలోకమంతయు నంగీకరించు చుండెను. అన్నిజాతులకను కూలమైన మతమను మాట అటుండగా అందరితెలివితేటలకు, అన్నిరకముల నాగరికతలకుగూడ సరిపోవునదై యున్నది. ఆయన సామాన్యమైన మానజీవితము జీవించుచుండెను. మతములైనను ఆచారములైనను ఆయననుఃభంధించలేదు. ఐరోపీయ విజ్ఞానులవలెస్వేచ్ఛాం

తరంగుడై, నీగ్రోజాతి వానియెడలకూడా సానుభూతిగల్గి, పూర్వాచార మూఢభక్తిని ధ్వంసముజేసెను. సమయమనగా ద్రవ్యమనిభావించు ఆగ్లేయవనిజుని ఆత్మను ఇస్లాము మతము అభివృద్ధిచేయుచున్నది, తత్వశాస్త్రవేత్తలను, ధీక్షాపరవశుడగు పశ్చిమ దేశస్తునిని, చిత్రకళ, కవిత్వమును గౌరవించు పాశ్చాత్యునిని ఔన్నత్యపదవికి దెచ్చుచున్నది.

ఇక్కాలపు వైద్యులుకూడా, యీమతమునంగల ప్రార్థనాక్రమమునందలి క్రమశిక్ష, శుద్ధీకరణాచారమును విచారించి చూచినచో, నవిభౌతిక దేహమునకేగాక, ఆత్మాభివృద్ధికి దోడ్పడునని చెప్పకతప్పదు.

## ఆల్ఫ్రెడ్ మార్టిన్.

( "ది గ్రేట్ రిలిజస్ టీచర్సు ఆఫ్ ది ఈస్ట్" )నుంచి.

గెలుపొందిన ప్రవక్త. కాలానుకూలముగా మారి అరేబియ సాంఘికచట్టముల కనుగుణ్యముగా సరిపోగలిగిన ముహమ్మదు యొక్క అభిప్రాయములు, మతచరిత్రల యందద్వితీయమై కీర్తి గాంచుచున్నవి. తనకాలపు జనులను, ఉన్నతపదవికి దెచ్చుట యందీతనికి గలిగినగౌరవము శాశ్వతమై వెలయుచున్నది. ఏలయన, మధ్యకాలమునాటి, యూదులైనను, క్రైస్తవులైనను,

నిట్టిఘనకార్యము చేయజాలకపోయిరి అంతేకాదు. నాగరికత నుబ్రభలజేయుటయందు అరబ్బీయులకే కాదు, ప్రపంచమంతటి కినాదర్శప్రాయుడగుచున్నాడు.

## ప్రొఫసర్ రాందేవ్. బి. ఏ.

( వేదిక్ మాగజైన్, సంపాదకుడు. లాహోరు. )

కత్తిబలముననే ఇస్లాము మతము ప్రభలినదనుట తప్పు. యిస్లాము మతప్రచారమునకై కత్తివాడబడలేదు.

కత్తివలన మతము ప్రభలజేయవీలుంటె యిక్కాలమున నెవడైన నట్లుచేసి చూపవలయును.

లాహోరు సత్ ఉపదేశ పత్రికా సంపాదకుడు.

కత్తిచేత ఇస్లాముమతము ప్రభలినదనుచున్నారు కాని నుదానినామోదించను. ఏలయన, బలవంతముగా నమ్మించి నె శీఘ్రముగా మరువబడుచున్నది.

బలవంతముచేత యిస్లాము మతము ప్రారంభింపబడితె, అదినేడు లేకపోయెడిదే. కానిఅట్లుకాదు. నేడుమనము చూచు చున్నట్లు ఇస్లాముమతము దినప్రవర్థమానముగా నభివృద్ధినందు చున్నది. ఇంతటికి కారణమేమైయుండును. దీనికుద్ధారకుడగు ముహమ్మదుయందు ఆత్మశక్తికలదు. ఆయన కరుణాంతరంగు

డు. దయాదాక్షిణ్యములాతని హృదాంతరాళమున దాండవిం చుచున్నవి. పరిశుద్ధమగు నభిప్రాయములాతనిని నడుపుచుండెను.

## డాక్టరు. గోకుల్ చంద్ సీ. హెచ్. డీ.

బారిస్టర్. ఎట్. లా. లాహోరు.

అనాగరికులగు నరబ్బీయులలో అరబ్బీయుల ప్రవక్త యొక్క హితోపదేశములు ప్రవేశించగా, పాశ్చదేశమంతటికి వారుగురువులు కాగలిగిరి. విజ్ఞానచంద్రికయు, దైవజ్ఞానము, బెంగాలునుండి స్పెయినుదేశము వరకు ప్రభలసాగినవి.

## డాక్టరు మార్కుస్ డాడ్స్.

ఐతే ముహమ్మదు ప్రవక్తకాడా? ప్రవక్తలకుండవలసి రెండు ప్రాముఖ్యమగు గుణలక్షణములీతని యందుగలవు. తన సహచరులు గ్రహింపజాలనంతటి దేవునిగూర్చిన సత్యమాతనికి గోచరించినది. ఈవిషయమును లోకమునకు ప్రకటింపవలయు ననెడు ఆవేశమాతనికి విశేషముగా యుండినది. యిశ్రాయేలీ యులయొక్క యే ధైర్యసాహముగలప్రవక్తతో నైననుఅవలీలగా సమానుడుకాగలడు. సత్యముకొరకు తనజీవములర్పించెను, అనుదినశ్రమలు సంవత్సరములకొలది సహించెను, వెళ్లగొట్టి

బడెను, ఆస్తులను గోల్పోయెను, తనవారిప్రేమ పోగొట్టుకొనెను, మరణముతప్ప తక్కిన కష్టములన్నియు ననుభవించి, చంపనుద్యమించినప్పుడు పారిపోయి తనవార్త ప్రపంచమునకు ప్రకటించెను. వనితల వలపైనను, రుచిరభోజ్యమైనను తియ్యని మాటలైనను, యీతనిని మల్పలేకపోయెను. "నాయెడమవైపు సూర్యునినాకు భూషణముగా నలంకరించినను, నేనునామతము విడువననెను." ఈపట్టుదల, యీ దృఢవిశ్వాసము, దేవుడొక్కడేయను నీధర్మము, ఇస్లాము మతమునుద్ధరించునవై యున్నవి. అనేక దేవులను గల్గియు, నొక్క దేవునారాధించు వారుండిరిగాని, యీతడట్లుగాక, యేకదేవ ఆరాధనమే ధర్మమని ప్రకటించెను. ఇతరులాతని వార్తనమ్ముటయే, యీతన జీవితమునందలి గమ్యమైయుండెను.

' ముహమ్మదు, బుద్ధా, క్రీస్తు " అను గ్రంథములో డాక్టరు గారిట్లు వ్రాయుచున్నారు.

ముహమ్మదు నిర్మాణము గావించిన మతము, ముసాస్మదు కాలమువారికి, అంతకు పూర్వముండిన మతములన్నిటి న్న నుత్కృష్టమైనదై యుండినది. ఈమతము విభాగింపబడి యున్న, గోత్రముల నేకీభవింపజేసినది. తనజనాంగము ప్రపంచమునందలి నాగరిక జాతులతో సమానముగా నిలచునట్లు గావించినది. క్రైస్తవ మతములు చేయదలంచిన పనులు

చేయుటయే గాక, విగ్రహారాధన మొదలంట దెగటార్చి మానవుల నేకదైవచింతనమున బడగొట్టినది, కష్టములుసహింపలేక. అబ్బిసీనియా రాజుతో 'విన్నవించుకొనిన విధానము చూచిన యిస్లాము మతముయొక్క శక్తిబహిర్గతమగు చున్నది, వారిట్లు విన్నవించుకొనిరి:-

మహాప్రభూ, మేముమూఢులమై' విగ్రహములను పూజించుచు, మృతకళేబరములను భక్షించుచు, కుటుంబ బంధుత్వములను తిరస్కరించి, యిరుగు పొరుగులయెడల చూపవలసిన మర్యాదలు నిరసించి, బ్రతుకుచుంటిమి. మాకుధర్మశాస్త్రము లేకుండెను. బలవంతులమాట న్యాయచట్టమై యుండెను. ఇట్టి కాలమున, మాకొఱకు దేవుడొక ప్రవక్తనుపంపెను. ఆయన పరిశుద్ధుడును, నీతిధర్మ నిరతుడునై యున్నాడని మేము గ్రహించితిమి. ఆయనమాకు సదుపదేశము లొసంగెను. దేవుడొకడేయని నేర్పెను. ఆయనకాక వేరెవరులేరనెను. విగ్రహపూజ వర్జించెను, సత్యము పలుకునట్లుచేసెను, మేము నమ్మదగినవారమై, యితరులయెడల దయాదాక్షిణ్యముగలిగి, బంధువులను ప్రేమించి బలహీనులకు సాయపడి, పాపమును విసర్జించునట్లుమాకు నేర్పెను. ప్రార్థనచేయుటకు, దానధర్మములొసగుటకు, ఉపవసించుటకు నేర్పెను, మేమాయనను నమ్మి. లోబడుటవలన, మేము హింసింపబడి పరదేశములకు వెడలగొట్టబడి, మీశరణుజొచ్చితిమి.

# రెవరెండ్ స్టీఫెన్స్ దొరగారు.

యూదులకు క్రైస్తవులకు పితామహుడైన అబ్రహాము మతమును, మోషే యేవిధముగా ప్రజలలో పునరుద్భీజము గావించెనో అట్లే, ముహమ్మదు తనప్రజలలో విజృంభింప జేసెను. అట్లుచేయుటలో ద్విగుణీకృతమగు విజయమును గాంచెను. బహువిగ్రహపూజా పూర్వాచార పారాయణమునకు మారుగా, యేకదేవప్రార్థనమును నెలకొల్పెను. దుర్భరమగు సాంఘికపద్దతులను మార్చివేసి, సముదాయముపై జనులందరి నీతి ధర్మమునున్నత పదవికిజేర్చెను. అంగీకారమగు నాచారములను నెలకొల్పెను.

మధుపానము, అమితమగు జారత్వము, బహుభార్యా వివాహము, శైశవ బాలికాహత్య, ద్యూతము, మాంత్రికము, మొదలగునవి ముహమ్మదు కాలమున అరేబియాలో నధికముగాయుండినవి ఖురాను వీనిని నిషేధించుచున్నది. దురభ్యాసములను రద్దుజేసి, సద్గుణములను నెలకొల్పుట ఆరబ్బియుల నీతిధర్మమునందొక క్రొత్తమార్గమై వెలసెను. ఈసంస్కారకర్తకీ విషయమువలన, నద్వితీయమగు నుత్సాహము కలిగెను. బాలికా శిశుహత్యను, మధుపానము, మొదలంత నంతరింప జేయుటద్వారా నాతడద్వితీయ కీర్తివహించుచున్నాడు.

తనప్రజలకు, ముహమ్మదు మహత్తరమగు సంరక్షకుఁడు. ముహమ్మదు జన్మభూమియందు జాతీయోద్యమములు, సహేతుకమగు మతములు, పరిశుభ్రమగు నీతిధర్మనియమములు లేకుండినవి. వీనినన్నిటినాతడు తనదేశమున ప్రవేశింపజేసెను. ఒకేమారు, జాతీయ పరిస్థితులను, మత వైరాగ్యములను, నీతి నియమములను, తనవీక్షణద్వారా నూతన రూపమున విజృంభింపజేసెను. విభజింపబడిన వివిధశిభిరముల నొక్కజనాంగముగా ఘనీభవింపజేసెను. బహుదేవతా విశ్వాసమునకు మారుగా దయాపరుఁడైన నొక్కదేవునిపై భక్తిబదిలపరచెను. దేవుని కరుణపై నాధారపడి, యాతఁడే సర్వమిచ్చువాడనియు, దుష్టులను సంహరించు వాడతఁడేయని భీతిల్లునట్లు ప్రజలకు బోధించెను. తనకాలము వరకు వాడుకలోయుండిన, సకలవిధమగు దుష్క్రియలను, దురభ్యాసములను దునుమాడెను. వ్యభిచార పూరితములగు జీవితములకు మారుగా, నియమమ ప్రకారము భార్యలను వివాహమాడు విధానమేర్పాటుజేసెను బాలికా శిశుహత్యలను అంతరింపజేసెను.

ఇస్లాముమతము ఖండాంతరములకు ప్రాకిపోవుచుండగా అజ్ఞానులైన అనేకులు యీ మతము నవలంభించి, ముస్లీమువలె మంచినడవడి గలవారగుచుండిరి. తుర్కీవారు, హిందదేశస్థులు, నీగ్రోజాతివారు, మూరుజాతివారు, తమ విగ్ర

పూజను నిగ్రహించి, దుర్మార్గజీవితములను విడచిపెట్టి, యేక దేవపూజయందు నిమగ్నులై అంగీకారమగు నాచారముల యందలవడి, సక్రమ జీవితములు జీవించునట్లుజేసెను. అప్పటి కే నాగరికులనబడిన పర్షియావారి విశ్వాసములుకూడా నూతన పరచబడెను, మంచిచెడ్డలు సమభాగములు కావని నిరూపించెను. భూనభములను, వైకుంఠములను సృష్టించిన సృష్టికర్త దృష్టికిక్రింద, న్యాయస్థులు అన్యాయస్థులందరొక్కరీతినే దీవనలందుచుందురనియు దెలిపెను.

ముహమ్మదు కాలమున అజ్ఞానులై, అరేబియా దేశస్థులవలె జీవించుచుండిన, జనాంగములకును, కొంతలోకొంత నాగరికులైన ఆఫ్రికావంటి జనాంగములకును, యిస్లాము మతము, మహత్తరమగు నాశీర్వాదమై, చీకటినుంచి వెలుగునకు నడిపి, సాతాను శృంఖములనుండి భగవంతుని సన్నిధికి నడుపునదై యున్నది.

## చేంబర్సు సైక్లోపేడియా ౬వ వాల్యూము.

ఖురాను ప్రణేతయొక్క హృదయమును దెలుపుభాగము, పరిపూర్ణమై ప్రజ్వలితమై యున్నది. ఇదినీతి ధర్మనియమావళి. ఇతర చట్టములవలె అచ్చటచ్చట హెచ్చరింపబడక రతనాల హారమువలె ముహమ్మదుయొక్క మతగ్రంథరచనల యందల్ల

బడియున్నవి. అన్యాయము, అబద్ధము, గర్వము పగ, అపహాస్యము, అత్యాస, దుర్వ్యయము, వ్యభిచారము, సంశయము మొదలగునవి, దురభ్యాసములుగను, అదైవికములుగను భావింపబడుచున్నవి. యుదారభావము, దానధర్మము, నమ్రిత సహనము, సమాధానము. ఓర్పు, సత్య పరిపాలనమును ప్రేమించుట, అన్నిటికిపైగా, దేవునినమ్మి, ఆయనకు సమర్పించుకొని, నడచుకొనుట భక్తికి ప్రధానమగు స్థంభములును, నిజమగు విశ్వాసులయొక్క చిహ్నములు నై యున్నవి.

## హెర్బర్టు గారి ఉపన్యాసములు.

ఇస్లాము ధర్మశాస్త్రములయందు, ప్రఖ్యాతిగాంచిన నీతినియమములున్నవి. అంతేకాదు, ఆ నియమములు, కార్య రూపమవధరించుటకును వాని ప్రకారము నడుచుకొనుటకు శక్తిగలవియు నగుచున్నవి.

## ఎడ్వర్డు ఆర్నాల్డు.

దేవుడొక్కడేయను సిద్ధాంతమే ఇస్లాము మతమునకు మూలాధారము. దేవునికి సర్వదా సమర్పించుట యీమతము యొక్క హృదయమై యున్నది.

# అమీనా అగ్నెస్ డీవ్స్.

ఇస్లాము మతము చక్కని మతము. దానినామోదించు వారు, యితరులు వారిని వెంబడించి, సమాదానమును పొందునట్లు, దానిలోని సత్యమును చక్కగా స్వీకరించినాడచు కొనవలెను.

# ఎం. ఎస్. బాబూనా.

క్రైస్తవ మతము వాణిజ్యమై యున్నది.

దేవుఁడు తనభాగమును స్వీకరించినగాని క్షమించడని, అది చెప్పుచున్నది. ఇస్లాము మతము సర్వలోకమున కామోదమైనవాదము. దేవుఁడు ప్రేమమయుఁడై యున్నాఁడనియు, ఆయన దృష్టియందెక్కువ తక్కువలు లేవనియు యిస్లామనుచున్నది. దానికి నియమములులేవు, అదిమహా విశాలమైనది.

# అహమద్. జే. మికాయెల్.

ఇప్పుడు నేను ఇస్లాము మతమును చదివినందున, నేనిన్ని నాళ్లు తెలిసికొనవలెనని ప్రయాసపడుచుండిన మతము, ఇస్లాము మతమేనని ధైర్యముగా చెప్పగలిగినాను. దైవకృపవలన యీ మతము కడకు నాకు దొరికినది. నాకు నెమ్మదికలిగినది. ఏలయనగ ఇస్లాము మతమనగా సమాధానమై యున్నది. దేవునికి ప్రజలకు సమాధానము, సృష్టికర్తకు సృష్టికి సమాధానము.

# జేమ్సు ఏ. మ్రోప్నై.

దేవుడొక్కడేయని ఇస్లాము మతము చెప్పుచున్నది. ఇతర మతములుకూడా యిటులనే చెప్పుచున్నవి కాని, యింత స్థిరమైన పట్టుదలతో చెప్పుటలేదు.

# పియెర్రె క్రిబైట్సు.

పాశ్చాత్యు లొసగజాలని సహానభావము, పదమూడు వందల సంవత్సరములకు పూర్వము ముహమ్మదు, తల్లులకు, భార్యలకు, బిడ్డలకు యిస్లాము మతముద్వారా అనుగ్రహించి యుండెను.

# రెవరెండు. ముఖ్రై టి. శ్రైటన్.

ఇస్లాము సోదర భావమందు, సాంఘికాత్మీయ సంఘీభావము కలదు. ఇస్లాము మతము ఒకవిధమగు నమ్మకమేకాదు, దానియందు, న్యాయ చట్టము, సాంఘిక ధర్మము సమ్మిళితమైయున్నవి. రంగు బేధములు జాతి బేధములు, మొదలగు సంఘర్షణములనెల్ల నేకీభవింపజేయు సోదరభావము యిస్లామ మతమున గలదు. ఇస్లాము మతము నందలి సౌభ్రాతృత్వము క్రైస్తవుల నెల్లప్పుడు ఆశ్చర్య పరచుచున్నది.

# ది పాపులర్ ఎన్ సైక్లోపీడియా.

౭ వ భాగము. ౩౨౬ వ పుట.

ఖురాను భాష స్వచ్ఛమగు నరబ్బీ భాషయై యున్నది. దాని శైలి, కవితాధోరణి మిగుల రమ్యమైయున్నవి. దానిలోని నీతిధర్మచట్టము నిష్కళంకమైనది.

# డీన్ స్టాన్లి (ఈస్టర్న్ చర్చి.)

౨౭౯ వ పుట.

క్రైస్తవులయందు బైబులు వలన కలిగిన మార్పులకన్న ఖురాను గ్రంథము వలన నెక్కుడు మార్పులు ముస్లీముల యందు కలుగుచున్నవి.

# డబ్లియు ఇర్వింగ్ యొక్క మహమ్మదు గ్రంథము

౨౦౬ వ పుట.

ఖురానునందు నిష్కళంకమును, ఉన్నతమును, ఆదర్శ ప్రియమునగు విషయములున్నవి.

# రెవరెండ్ ప్రొఫేసరు రాబర్ట్సన్.

క్రోధము, వేషధారణ, పగ, గర్వము, అహంభావము

అన్యాయ విమర్శనము మొదలగు దుర్గుణములను, ఖురాను గ్రంథము తీవ్రముగా ఖండించుచున్నది. సమాధానము, కృతజ్ఞత, సమ్రత, దైవభక్తి, మొదలగు సద్గుణములను గూర్చి ఖురాను గౌరవముగా వివరించుచున్నది.

## ఎన్సైక్లోపేడియా బ్రిటానికా.

౧౬ వ వాల్యూము ౫౯౯ వ పుట.

ఖురాను గ్రంథములోని వివిధభాగములు అపారములై యున్నవి. నైదీకసాంఘిక నీతిధర్మములు ఖురాను యందత్యాధికముగా కనబడుచున్నవి. నైసర్గికముగా ప్రకృతియందు, ప్రవక్తలద్వారా, మీదు మిక్కిలిగా ముహమ్మదు ద్వారా ప్రకటింపబడిన, దేవునిగూర్చిన ఔన్నత్యము, మంచిదనము, పరిశుద్ధతలు, యీగ్రంథముద్వారా విజృంభించుచున్నవి. దేవుడు సర్వశక్తిగల్గిన యేక దేవుడని తెలుపుచున్నది. సకలవిధమైన విగ్రహారాధన, సృష్టినిపూజించుట, క్రీస్తును దేవునికుమారునిగా పరిగణించుట భయంకరమగు పాపముగా ఖడించుచున్నది.

## రెవరెండ్ జీ. మర్గోలియాత్.

ప్రపంచమునందలి మతగ్రంథములలో, ఖురాను గ్రంథమున్నతమైయున్నది. అద్భుతమగు మతగ్రంథ రాజములలోనిది

*In the name of Allah, Beneficent and the Merciful—*

# THE LAST LAW GIVER

( WITH BIBLICAL QUOTATIONS )

*By*


**MAHMOOD VANDERMAN**

AUTHOR OF

*" HOW TO PRAY " " TEACHINGS OF ISLAM "* ETC.


with a Foreword

BY

The Hon'ble Nawab Mahdi Yar Jung Bahadur,
Political & Educational Member,
H. E. H. The Nizam's Govt.,
Hyderabad-Dn.

## అంతిమ ధర్మశాస్త్రోపదేశకుఁడు.


*First Edition 3,000 Copies.*


యం. వండర్‌మాన్

గ్రంథకర్త.



Price 2/8/-

# రెవరెండ్ ఎడ్వర్డుబ్లిడన్.

ముహమ్మదీయుల నింతగా నిషేధించుచున్న క్రైస్తవులు, నావలె, వారిదేశములోనికేగి, పశ్చిమ ఆఫ్రికాలో సంచరించి, నావలె వారును ముహమ్మదీయులైన వారికిని కానివారికి గల తారతమ్యమును కనులార జూచిన యెడల ముహమ్మదీయుల యందుగల చురుకుదనము, మానసిక ఆత్మీయాభివృద్ధి, న్యాయ చట్టము, క్రిమశిక్ష, దినప్రవర్ధమానముగా నభివృద్ధినందుచున్న ప్రేమయు, ముహమ్మదీయులు కానివారియందలి మంధబుద్ధి, అరాచక పరిభుత్వము, నిరుత్సాహకరమగు హైన్యగుణములు ప్రవుల్లముగా కనబడగలవు.

## లాటన్.

ఆఫ్రికా దేశమునకు అత్యవసరమైన మతము ముహమ్మదీయ మతము, క్రైస్తవ మతముకాదు అంతేకాదు ప్రపంచమంతటికి నదియే యనుకూలమైనది.

ముస్లీము మతవిశ్వాసమునందలి విజయమువలన నీమత మున్నత దశయందున్న దనవచ్చును. ముస్లీముల పట్టుదల, సౌభ్రాతృత్వము, దౌర్జన్యఖండనము, తనవారు కాక యితరప్రవక్త లనుకూడా ప్రవక్తలుగ పరిగణించు సిద్ధాంతము, మున్నగు

కారణములద్వారా యీమతము యొక్క యుత్కృష్టపదవిని నిరూపింపవచ్చును. ఈమతము మానవుడెట్లున్న నట్లేస్వీకరించి, వానివలన గొప్పక్రియలను జేసెదనని డంభముగా మాట్లాడక, అతని గుణములను, నడవడిని కుదురుపరచి, మంచి పౌరునిగా జేయుచున్నది.

## హాలీమా మర్గరెట్ లీ కన్య.

పూర్వాచారములచేత, మూఢభక్తిచేత యేడువేల సంవత్సరముల క్రిందటి దురాచారములచేత, ప్రొటస్టాంటు కాతలిక్ పాదిరీలు, సంఘములు నేటికిని, యీ ఇరువదియవ శతాబ్దిని బంధింప బడియుండియు, ఇస్లాము మతము మూఢాచారపూరితమైనదని వారేల చెప్పుచున్నారో నాకు దోచకుండుటకు కాదు. సహేతుకమైన మతము నాకుదొరుకుటవలన నేనదృష్టవంతురాల నగుచున్నానని సంతసించుచున్నాను.

## సర్ చార్ల్స్ ఎడ్వర్డు ఆర్చిబాల్డు హామిల్టన్.

అజ్ఞానులవలన తృణీకరింపబడి నిషేధింపబడిన మతము యిస్లాము మతము. సాంఘిక సమస్యలను సమర్థించుటకును, బలహీనులకొరకైన బలవంతులమతమనియు,నిరు పేదలకొరకైన

ధనవంతుల మతమనియు సార్వగ్రహించినచో లోకమున కెంత మేలు కలుగగలదు,

మానవుఁడు పుట్టుకతో పాపరహితుఁడని యిస్లాము మతము చెప్పుచున్నది. స్త్రీపురుషు లొక్క నిధినుంచి సృష్టింప బడి, ఒకేవిధమగు నాత్మనుగల్గి, మానసిక ఆత్మీయ అభివృద్ధికి గావలసిన లక్షణములు సరిసమానము గాగలిగినవారిని యీ మతము చెప్పుచున్నది.

ఇక యిస్లాము మతమునందలి సోదరభావమును గూర్చి నేను విశేషముగా చెప్పవలసిన పనిలేదను కొనుచున్నాను. ఇది స్థిరీకరింపబడిన సత్యమైయున్నది.

## రెవరెండ్. లాసి ఓలీరీ డీ. డీ.

ప్రపంచమునకు, ముఖ్యముగా క్రైస్తవ ప్రపంచమున కిట్లు ప్రకటించుచున్నాడు;-

విజయము గాంచుచుండిన ముస్లీము ప్రభువులు, కత్తి బలముచేత రాజ్యములను ముస్లీము మతమునకు మరల్చుచుం డిరని తలంచుట చరిత్రకారులుచేసిన మహాదోషమని చరిత్రే తెలుపుచున్నది.

కడపటిదైనను, మానవకోటిని ఉన్నతపదవికి దెచ్చుటయందే గ్రంథమునకైన దీసిపోదు. మానవాభిప్రాయములు నూతన దెరవుల ద్రొక్కుటకును, నూతనమైన నడవడి యేర్పడుటకు నీగ్రంథమే కారణభూతమగుచున్నది. పరిషత్ జ్ఞానమువలన దేలిన ప్రకారము, గణిత, జ్యోతిష్య, రసాయన శాస్త్రములను ఐరోపియనులు, గ్రీకుభాషనుండి సంగ్రహించిరి. ఈవిద్యలన్నియు లాటిన్ భాషనుండి గ్రీకునకు జేరినవి. వీటన్నిటికి మూలము అరబ్బీభాష. ఇదియే ఖురానుభాష. ఇందుమూలమున నరబ్బీయులావేశపూరితులైరి. ఖురాను గ్రంథము ప్రపంచమున ప్రవేశించిన పిదపనే, సారస్వత పారావారము, కవితా శోభనము, ప్రపంచమున విచ్చలవిడి ప్రభలసాగినవి.

ఇస్లాముమతమువలన అద్భుతమగు మార్పులును, దిగ్విజయములును పూర్వమెప్పుడో కలిగినవని తలంచరాదు. అవి నేటికిని గలుగుచున్నవి.

## మంగో పార్కు:

వనవాసులైన మోటు నీగ్రోజాతులవారు మధుపానమమితముగా సేవించుచుండిరి. ముహామ్మదీయులైన పిదప స్వచ్ఛజలముతప్ప మరేమియు త్రాగకున్నారు.

## గిబ్బను గారు.

మతములన్నిటిని కత్తితో ఖండించుచున్నదని, ముహ
దీయ మతమునుగూర్చి తప్పుడభిప్రాయ మొకటికలదు. ఈ
అజ్ఞానాభిప్రాయమును, ఖురాను ఖండించుచున్నది, ముస్లీము
రాజుల చరిత్రలే విశదీకరించుచున్నవి, క్రైస్తవ ఆరాధనలపట్ల
వారికిగల సహనభావమే దీనిని తుడిచివేయుచున్నది.

ముహమ్మదు యొక్క పరిశుద్ధజీవితమే యింతటికి దా
ర్కాణము; కత్తితో పనిలేదు.

## డాక్టరు ఖలీద్ బానింగ్,

బ్రిటిష్‌వారు ఇండియాలో ప్రవేశించు చున్నపుడు,
ముస్లీములు యోపదియావ వంతుగానో యుండిరి. ఇప్పుడైదవ
భాగమైనారు. ఇది కత్తివలననే కలిగినదా?

## ఆంధ్రుడు క్రిచ్చను ఎల్. ఎల్. డీ.

ముస్లీముల పాఠశాలలయందు, సర్వకళాశాలలయందు
అనాగరికులును, మోటువారునగు పశ్చిమ దేశస్థులు, తమ
విజ్ఞానమును, సకలశాస్త్రములను నేర్చుకొనిరి.

పారిస్సు, జెర్మని, ఇంగ్లాండు దేశములు, మ[illegible]
యొక్క కళాశాలలగు, కార్డోవా, సివిల్లి యందు అరబ్బీ [illegible]
సారస్వతము నభివృద్ధి జేసికొనిరి. ముత్తముగను, అర[illegible]
ప్రయాసమువలననే, బౌతిక శాస్త్రజ్ఞాన మభివృద్ధి[illegible]
నితరకళలు పెంపొంది భాషకు, నాగరికతకు, [illegible]
విధానములేర్పడినవని చెప్పిన నాశ్చర్యపడరాదు.

# 5 వ అధ్యాయము.

## హాజ్ అనబడిన పుణ్యక్షేత్రయాత్ర.

ముస్లీములు నిర్వర్తింపవలసిన విధులలో హాజ్ అనబడిన మక్కా పుణ్యక్షేత్రయాత్ర ప్రాముఖ్యమైన నిబంధనమై యున్నది. ఈవిషయమునందు పరిశుద్ధమగు ఖురాను ఖండితముగా నిట్లుచ్చరించుచున్నది ;-

"నియమిత కాలమునందు యాత్ర చేయవలయును. యాత్రకేగువాడు, పాపభూయిష్టమైన క్రియలను విసర్జించి, యాత్రదినములలో తగవులాడక, మీరుచేయు ప్రతిశుభ కార్యము అల్లా చూచుచున్నాడని గ్రహించి, నీతిక్రియలు చేయుడి. ఐతే ఉత్తమ క్రియలుభక్తియు నాకు భీతిల్లుటయునై యున్నవని, గ్రహించగలిగిన మీరు తెలిసికొనుడి."

మీప్రభువువలన కృపనొందుటకు మీరుచేయు ప్రయత్నములు పాపముకాదు, మీరు అరాఫత్ నుండి సమర్పించునపుడు ఆపరిశుద్ధ స్థలముకడ అల్లా కలడని గ్రహించుడి. ఇంతకుపూర్వము మీరు తప్పిపోయిన వారివలె అజ్ఞానులై యుండగా ఆయన మిమ్మును రక్షించినాడని జ్ఞాపకముంచుకొనుడి.

ప్రజలు సమర్పించు ప్రకారము, మీరును సమర్పించి పాపపరిహారార్థము అల్లాను వేడుకొనుడి. అల్లానిశ్చయముగా, క్షమించువాడును ప్రేమపూరితుడునై యున్నాడు.

మీరు ఆచారములు నిర్వర్తించిన పిదప, మీజనకులను మీజ్ఞాపక మందుంచుకొను విధముకన్న నెక్కుడు భక్తితో అల్లాను జ్ఞాపక మందుంచుకొనుడి. ప్రభువా యీలోకమునందు నాకు సుఖమును గ్రహింపునుని వేడుకొనువానికి, పరలోకమున నెట్టిసుఖమను గ్రహింపబడదు. ప్రభువా, యీలోకమందు, పరలోకమందు, నాకుసుఖమనుగ్రహించి, రానున్న అగ్ని ప్రమాధమునుంచి తప్పింపుమని, మరొకడు వేడుకొనును.

వారుగడించిన దానిలో నొకభాగము అట్టివారికొరకు కలదు. అల్లా ప్రతిదానిని లెక్కచూచుచున్నాడు.

2 వ అధ్యాయము. 193 - 198.

ప్రపంచము నడిపింప బడుటకును ఆశీర్వాదము లొందుటకును, మొట్టమొదట నిర్మాణము చేయబడిన ఆరాధన గృహము, మక్కాపురమున నేర్పాటు చేయబడినది.

దానిలో అబ్రహాము నిలచిన స్థలమున్నది దానిలో ప్రవేశించువానికి కీడుకలుగదు. ప్రజలందరు ప్రార్థానాగృహమునకు యాత్ర వెడలుట అల్లాపట్లనొక విధియైయున్నది. వెదకువారికి బాటకలదు. నమ్మినవారికి మేలుకలుగును, అల్లా నిశ్చయముగా సర్వశక్తిగలవాడు. 3 వ అధ్యాయము. 90-92.

విశ్వసించు వారలారా, యాత్రచేయునపుడు, దేనినైనను సంహారింపవలదు. మీలో నెవరైన, కృతనిశ్చయులై చంపినయెడల, దానికి ప్రతిగా. దేనిని సంహారించితిరో దానినియు, పశువులను సంహారించిన యెడల, యిద్దరు నిశ్చయించిన ప్రకారము, నేదైన కాబాకు అర్పణముగా సమర్పింపవలెను లేక, పేదలకు అన్నదానము చేయుటయో లేక, యీదుష్కార్యము యొక్క క్రౌర్యమును గ్రహించినట్లు ఉపవసించుటయో చేయుట విధియైయున్నది. గతించినదానిని అల్లా క్షమించుచున్నాడు. అదేపాపము మరల చేసినయెడల అల్లావానిని సిక్షించుచున్నాడు. ఏలయనగా అల్లాయిట్టిక్రియలను ఓర్చుకొనడు.

మీరును ప్రయాణీకులును, జలచరములను వేటాడి భక్షింపవచ్చును. కాని యాత్రలో నిట్లుచేయరాదు.

ప్రజలు విశ్రమించుటకు, కాబాను అల్లా పరిశుద్ధ స్థలముగా జేసియున్నాడు. అంతేకాదు, వారికొఱకు, పరిశుద్ధమ పనెలను, అర్పణలను, కంఠహారములను నిర్మాణించియున్నాడు.

5 వ అధ్యాయము. 96–98.

ప్రజలలో యీ యాత్రను గూర్చి ప్రకటించుడి. వారందరు పాదచరులై నీయొద్దకేగెదరు. ప్రతి ప్రదేశమునుండి ఒంటెలదండు బయలుదేరునుగాక. 22 వ అధ్యాయము. 28.

అల్లా నిబంధనలను గౌరవించువారు, భక్తిపరులైయు న్నారు. దానివలన మీకు నియమితకాలము వరకు మేలు కలుగును. అటుపిమ్మట వారి ప్రార్థనాస్థలము మొదటిదైయు న్నది. మీ దేవుడు ఒక్కడైన దేవుఁడు. ఆయనకు మీరు ముస్లీములై యుండుడి. 22 వ అధ్యాయము. 33-35.

అల్లా హస్తకృత్యములైన పశుగణమును, మీ మేలు కొఱకు యిచ్చుచున్నాము. అవి క్రమముగా నిలచినప్పుడు. అల్లానామమును జ్ఞాపకము చేసుకొనుడి. అవితగవులాడినప్పుడు వానిని మీరు తినుడి, తృప్తిజెందువారికి భక్తిగా నొసగుడి, అడిగినవారికొసగుడి. మీరు కృతజ్ఞతార్పణాలు సమర్పించునట్లువానిని మీసేవకొఱకు పంపినాము.

మీ అర్పణల మాంసమైనను, రక్తమైనను, అల్లాకు చెందవు. కాని మీభక్తియే ఆయనకుచేరగలదు. అల్లామిమ్ము ను నడిపించినందు వలన, మీరు అల్లాను మహోన్నతునిగా జేసి, మేలుచేసిన వారికి శుభ వచనములు జెప్పుడి; ఏలనగా అల్లా మీకొఱకు వానిని నిర్మించియున్నాడు.

22 వ అధ్యాయము. 37-38.

ఈ శుభకార్యము నిర్వర్తించుటకు, మక్కాపురము క్షేంద్రస్థలమై యున్నది, ఎఱ్ఱసముద్రపు రేవుస్థలమైన జిద్దా

పురము మక్కాకు 65 మైళ్లదూరమందున్నది. ప్రవక్తయగు అబ్రహాము వలనను, నాతని కుమారుడును ప్రవక్తయునగు ఇష్మాయేలు వలన నిర్మాణము చేయబడిన కాబా యీ నగరమునందుగలదు. అరేబియా దేశపు గోత్రములన్నియు యేటేట యీ నగరమునకు యాత్రజేయుచుండెను. స్థానపరిస్థితుల వలనను, దూర దేశములనుండి విచ్చేసిన వివిధయాత్రికుల భిన్నాభిప్రాయముల వలనను, యీపరిశుద్ధస్థలము అపరిశుభ్రమై 360 విగ్రహములకు చోటైయుండెను. వీనిని పిదప, పరిశుద్ధుడగు ప్రవక్త ఒకేమారు, నిర్మూలించెను. అజ్ఞానాంధకార చిహ్నమగు విగ్రహ పూజకు మారుగా నేడు సుప్రసిద్ధమగు నొక మసీదు యిచ్చట కలదు.

హాజ్రి అనబడిన తొమ్మిదవ, ముస్లీము శకమునందు యీ హాజ్ విధి నిర్ణయింపబడినది. ప్రతి ముస్లీము తనజీవితమందొక్కసారియైన నీయాత్ర జేయవలయును. ఐతే, ఆరోగ్యవంతులును, సరియైన వయసు గలవారును, ప్రయాణమునకును, వారి యింటివారికిని సేవకులకును కావలసిన సౌకర్యములు కలవారును మాత్రమే యాత్ర బోవలయును. ఈ స్థలమునకు, దాదాపు మూడుమైళ్ల దూరమందున్న స్త్రీలు, యాత్రబోవ దలంగినచో తమ వెంట తమభర్తలనైన లేక బంధువులనైన గొంపో .లయును. యీ యాత్రజేయ నిశ్చయింపబడిన నెల జుల్ హాజ్

అనబడుచున్నది. కాని యాత్రకు కావలసిన యేర్పాటులను, యీనెలకు ముందే అనగా షవ్వాల్, జుల్ ఖాదా నెలలలో చేయవచ్చును.

యాత్రికుఁడు నిర్వర్తింప వలసిన విధికృతములు మూడై యున్నవి.

1 "ఇహిరాం" అను వస్త్రములు ధరియింపవలయును. ఇది తెల్లనిబట్ట. ఒకకొంగుతో దేహమును కప్పుచు నింకొకటి భుజములపై వేయవలయును.

2 అరాఫట్ మైదానమున నిలువవలయును.

3 జుల్ హజ్ యొక్క పదియవ నాడు కాబా చుట్టు ఏడుమారులు తిరుగవలయును. ఇది "తవాఫ్" అనబడుచున్నది.

ఈ సందర్భమున నిర్వర్తింపవలసిన ముఖ్యమగు కార్యము లేవనగా:—

1 సూర్యాస్తమయమైన పిదప, జుల్ హజ్ మాసము యొక్క తొమ్మిదవనాడు "ముజ్దల్ఫా" యనుస్థలమున నుండుట.

2 సాఫా మార్వాయనబడు పర్వతముల మధ్యస్థలమగు యేడుమైళ్లు కొంతదూరము నడచి, కొంతదూరము పరుగెత్త వలయును.

మక్కా పురనివాసులు కానివారు, మరొకచుట్టు తిరుగవలయును, దీని పేరు తవాఫ్ సదర్ అనగా వీడుకోలు నడక.

4 జుల్ హాజ్ యొక్క పదియవనాడు కేశఖండనముచేసి అర్పణలర్పింప వలయును,

5 రామిల్ జనార్ అనగా మీనా యనబడులోయలో యేడు రాలను వేయుట.

మక్కాచుట్టు ఐదారు మైళ్ల దూరమందు మీఖాత్ అనబడు గమ్య స్థానములున్నవి. సిరియా దారిపైని, మదీనా హజ్ఫా ప్రాంతమున జుల్ హాలీఫాయు, నజ్ద్ దారి యందు ఖర్నియు, ఈరాక్ దారిపైని జటె ఈరాకుయు, యల్ మలాం దారిలోని యల్ మలాముయు, నీగమ్య స్థానములైయున్నవి. ఈస్థానములలో దేనినైనను సమీపించినపుడు' యాత్రికుడు, ఇహ్రాం అనబడిన తెల్లబట్టలను ధరియింపవలయును, పిదప యే విధమైన వస్త్రములు ధరియింపవీలులేదు. తనతలను ముఖము ను కప్పుకొనరాదు. తలవెండ్రుకలైనను, గడ్డమైనను కత్తిరించుకొనరాదు. తగవులాడుటయు, వేటాడుటయు తగదు. సంభోగము సంపూర్ణముగా నిలిపివేయ వలయును. ఈవిధముగా, దేవునికి సమర్పించుకొనినవాడై, పరిశుద్ధ నగరముపైపున కేగుచు, ఉన్నతస్థలముల కెక్కునపుడును, లోయలోనికి దిగు

నపుడును, మక్కా నగరమున ప్రవేశించునపుడును, యెడతెగక "లబ్బీయక్" అనవలెను "ప్రభువా, నేనుసిద్ధముగా యున్నా నని" దీనికి అర్థము. పట్టణ గవినిలో ప్రవేశించిన వెంటనే మస్జదుల్ హారాంకు పోయి, కాబా యెదురుగా నిలచి, "అల్లా హు అగ్బర్" అని పలుకవలెను. పిదప, నల్లరాయి యగు హాజ్రిఆస్వాద్‌ను ముద్దు పెట్టుకొనవలెను. దానిపిదప, కాబాచుట్టు యేడుమారులు తిరుగవలసిన తవాఫ్ అను విధిని నిర్వర్తింపవలయును. మక్కా వాస్తవ్యులీ నిబంధన నిర్వర్తింప బనిలేదు. పిదప, యాత్రికుడు, సాఫా, మార్వా పర్వతము లెక్కి వానిమధ్య, యేడుమారులు పరుగెత్తవలయును. పరుగెత్తునపుడు, తల అటు యిటు త్రిప్పక భుజములు కదిలించు చుండవలెను. తరువాత మక్కాలో, ఇహారాం వస్త్రము ధరించి నివసింపవలెను. జుల్‌హజ్ యొక్క యేడవనాడు, కుద్బాఅను ప్రసంగమును అధ్యక్షుండగు ఇమాం వినిపించి యాత్రీకులకు యీ యాత్రలో చేయవలసిన విధులను తెలుపును. మక్కాకు మూడున్నర మైళ్లదూరమందున్న మీనా యను గ్రామమునకు యెనిమిదవ నాడు వెళ్లి ఒకరాత్రి అక్కడ నిదిరించును. ఇది దేవునిచేత నియమింపబడిన సున్నతి పద్ధతి. అరఫా దినమైన, జుల్‌హాజ్ యొక్క తొమ్మిదవనాడు, ఉదయ ప్రార్థనలర్పించి మక్కాకు పన్నెండు మైళ్లదూరమందున్న అరాఫట్ స్థలమునకు వెళ్లి అచ్చట, పశువధనుగూర్చియు, ప్రదక్షిణమునుగూర్చియు

ఇహ్రాం ప్రసగించుటవినును. తరువాత, ఒకేమారు, మద్యాహ్న సాయంత్రపు ప్రార్థనలర్పింపబడును. ఇదైన వెనుక, జబల్ రహమత్ పర్వతమును సమీపించవలెను. ఇది యాత్రియందొక ప్రాముఖ్యమగువిధానమై యున్నది. దీనిని వాఖ్ఫ అందురు. ఈ విధముగా సిలచుటకు, జతన్ అరాఫా తప్ప అరాఫత్ స్థలమంతయు మోఖిప్ అనబడిన నిలుకడ స్థలమైయున్నది. ఇచ్చట నిలువబడి, తక్బీర్, తహలీల్, తాలిదే, అని ఉచ్చరించుచు, దరూద్ అను ప్రార్థనాక్రమమును తనపాపపరిహారార్థమై ఆచరింపవలయును. ఇచ్చట సాయంత్రప్రార్థనయైన, ఈషాప్రార్థనయందు, ఒకేమారు, ఆరాధన పిలుపుతో కూడా సాయంత్రపు ప్రార్థన, రాత్రి ప్రార్థన నిర్వర్తింప వలయును. పదియవ నాడు, చీకటియందే ప్రాతఃకాల ప్రార్థనలర్పించి. తెల్లవారకపూర్వమే, మీనాకు పయనమై, బాలాణవాడి కడనిలువబడి, జమరత్ ఉల్ అక్బా, యనబడు మూడు స్థంభములపై యేడు గులక రాళ్లను రువ్వుచు, ( అల్లా ఓ అక్బర్ ) దేవుఁడు మహోన్నతుఁడని పలుకవలెను. పిదప పశుబలి సమర్పించి, తలవెండ్రుకలు క్షౌరము చేసుకొని, ఇహ్రాం తెల్ల వస్త్రములుతీసివేసి, యథారీతి తననిత్యకృత్యములు నిర్వర్తింపవచ్చును. కాని, ఇహ్రాం ధరియించునపుడు నిషేదింపబడిన, స్త్రీసంభోగము మాత్రము ప్రారంభించరాదు. పది, పదకొండు, పన్నెండవ నాడెప్పుడైన, నాతడు, కాబాకు వెళ్లి యేడుమారు

లు ప్రదక్షిణంచవలెను. ఇది కచ్చితముగా నిర్వహింప వలసిన తవాఫ్ జియారత్ ఆచారము. ఇది చేయునపుడు భుజములు కదల్చక, తల యూచక, సాఫామార్వా పర్వతముల మధ్య పరుగులిడవలెను. తవాఫ్ ఖాదూం చేయునపుడీ యాచారము చేసినవారే, యిపుడుకూడా చేయవలయును. 11 లేక 12 వ నాడు మీనాకు మరలివచ్చి, మధ్యాహ్నవేళ, యేడు రాళ్లను స్థంభముల నైపు వేయ వలయును. మీనా పురవాస్తవ్యులీ విధానమును, పదమూడవనాడు చేయవలయును. ఇదైన పిదప, యాత్రికుకు మక్కాకు వెళ్లి. కడపటి ప్రదక్షిణమగు తవాఫ్ సదర్ చేయవలయును.

మక్కా వాస్తవ్యులీ యాచారమును చేయ బనిలేదు. తరువాత జంజం భావిలోని నీళ్లు త్రాగి, హజ్రి అస్వాదునకు కాబాకు మధ్యనున్న ముల్టజం అను స్థలమును ముద్దుపెట్టు కొని కాబాపైని చేతులుంచి కన్నీరు మున్నీరగునట్లు విలపించి, హారామనబడు పరిశుద్ధమగు మసీదును విడచిపోవలసి వచ్చెనా గదాయని విషాధమభినయింప వలయును. దీనితో యాత్రిక్ చేయవలసిన కర్తవ్యములన్నియు ముగియుచున్నవి.

హజ్ యాత్రయందు, ఆత్మీయ, సాంఘిక, వాణిజ్య సహకారములున్నవి. ఈ యాత్రవలన దేవునిపై ముస్లిములకు గలభక్తి విశ్వాసములు విశధ పడుచున్నవి. యాత్రికులక

తన జన్మభూమి విడచి పలువిధములగు కష్టములనుభవించి, మంచి వస్త్రములను దులనాడి, క్షౌరము చేసుకొనక, స్త్రీ సంభోగమును విడచిపెట్టి, హాజ్ యాత్ర యందలి కష్టములన్ని ఓర్చుకొని, మధ్యందిన మార్తాండుని కఠినమగు యెండవేడి మికి, యిసుక యెడారి తీక్ష్ణమునకు సుంతయు కినుకబూనక యాత్ర జేయుచుండును. రాజులను మెప్పించుటకైనను లేక వారికి భీతిల్లియైనను యిట్లుచేయుటలేదు గాని తన సృష్టికర్తను ప్రేమించుట వలన నిట్లు చేయుచున్నాడు. నల్లరాతిని యాత్రికుడు ముద్దుపెట్టుకొనుట, పూజావిధానము కాదుగాని, ఆ రాతిని నిర్మాణముచేసిన ఇబ్రాహీము యెడల నాతనికి గలగౌరవమైయున్నది. ప్రవక్త రాతిని ముద్దిడినందున, తానుకూడా ముద్దుపెట్టుకొనుచున్నాడనియు, రాతిలోనేమియు లేదనియు, ఉమర్ కలీఫా ఒకమారు చెప్పియున్నాడు. యాత్రికుడు కాబాచుట్టు ప్రదక్షిణము చేయుచు, ప్రార్థించునపుడు, తన ముఖముకాబావైపు త్రిప్పుచుండును దేవుడా రాతియందున్నాడని కాదుగాని అట్లుచేయవలయునని నిర్బంధించిన దేవుని ఆజ్ఞను శిరసావహించుటకట్లు చేయుచున్నాడు. సంఘమునందు ప్రార్థించునపుడు, కాబావైపు ముస్లీము తనముఖముత్రిప్పును. పలయున కాబా ప్రాచీన కాలపు ప్రార్థనా స్థలమై యున్నది. మఱియు, నీపరిశుద్ధ స్థలమువైపు తిరుగునపుడు దానిని నిర్మాణము గావించిన ప్రవక్తలగు, ఇబ్రాహీము, ఇస్మాయీలులను

జ్ఞాపకము చేసుకొనుచున్నాడు. పశుబలిని సమర్పించునప్పుడు, విశ్వాసులకు పితామహుడగు అబ్రహాము, దేవుని కోర్కెనీ డేర్చుటకు, తనకడుగూర్చు సుతుని నర్పించుట కిచ్ఛగించుట యు, నాతని కుమారుఁడు మారాడక తండ్రియానతికి విధేయు డగుటయు, జ్ఞాపకమునకు వచ్చుచుండును. కరుణాంతరంగుడగు దేవుఁడాతనికి మారుగా బలియగుటకొక మేకను కల్పించి యాతని జీవముఁ బరక్షించి, తనయొక్క దయాదాక్షిణ్యమును వెల్లడి జేయుచున్నాడు. దైవాజ్ఞను పరిపాలించి, మానవుడు సమర్పించుకొనుటకే క్రియయే ప్రదర్శమని గ్రహింప వల యును. యాత్రికుని యాత్రవలన, ముస్లీము దేవునిపట్ల చూప వలసిన విధేయత మాత్రమే కనబడుటలేదు. కాని, ప్రేమ, సమహితత్వము. సౌభ్రాతృత్వము, సోదర భావయులు వెల్లడి యగుచున్నవి. రాజైనను, నిరుపేదయైనను, బానిసయైనను, అబ్బిసీనియా వాడైనను, ఐరోపియనుఁడైనను తెల్లవాడైనను నల్లవాడైనను, తమ మతనిష్టలు, జాతిబేధములొక యోరకుబెట్టి అందరు అన్నదమ్ములవలె భగవంతుని యపార కరుణాసముద్ర మున మునిగి తేలుచున్నారు.

హాజ్ యాత్రవలన ఆత్మీయ మేలులేకాదు, వాణిజ్య సౌకర్యము లనేకములు కలవు. మక్కాపురము యెడారియగు నరేబియాలో కలదు. అందు పాడిపంటలులేవు ప్రజలుజీవించుట

కెంతయు కష్టముగా నుండెడు స్థలము. నిరుపేదల నిలయము. యాత్రికుల రాకపోకల వలన వ్యాపార మభివృద్ధినొందె. ప్రజలు సుఖజీవనము చేయగలుగు చున్నారు. ఇవ్విధముగా యాత్రీకుడు త్రిత్వాభివృద్ధియగు, దేహ, మానసిక, ఆత్మీయ సౌకర్యములనుద్బీజము గావించుచున్నాడు.

---

# 6 వ. అధ్యాయము.

## రంజానను బడు ఉపవాసపు నిబంధనము.

యేడాదియందొక నియమిత మాసమున ముస్లీములుపవసించవలయును, ఆ నేలపేరు రంజాను నెల అనగా ఉపవసింపవలసిన మాసము. ఇది ముస్లీముల యెడల నియమింపబడిన విధియైయున్నది. ఈ రంజాను నెలలలో 29 లేక ముప్పది దినములుపవసింప వలయును. మహమ్మదు పవిత్ర మక్కానుంచి మదీనాకు పారిబోయినపుడీ యాచారము విధింపబడినది. ఖురాను గ్రంధమీ విషయమిట్లుచ్చరించుచున్నది.;-

విశ్వసించు వారలారా మీ పూర్వీకులవలె మీకును ఉపవసించుట విధింపబడియున్నది.

మీలో నెవడైన, వ్యాధిగ్రస్తుడైనను, ప్రయాణమదున్నను, ఆదినములు మినహాయించి ఉపవసింపవచ్చును. చేతనైనవాడు, పేదలకన్నదానము చేయవలెను. ఏదైన నీతిక్రియ జేయగలిగిన చేయవచ్చును. మొత్తమునకు, ఉపవసించుట శ్రేష్టమైన కార్యము.

మనుష్యులను నడిపించుటకును, నడిపింప గ్రహించుటకును, ప్రత్యేకింప బడుటకును, ఖురాను గ్రంథము రాంజాను నెలలలో భూమిపైకి పంపబడినది. కాన యీ నెలను మీలో నెవరైనను చూచిన యెడల, నాతడుపవసింప వలయును. వ్యాధిగ్రస్తుడును, ప్రయాణికుడును మిగిలిన దినములుపవసింపవచ్చును మీ దినములు గడిపి, అల్లా నామము గౌరవించుటకును, మీరు కృతజ్ఞతార్పణ లర్పించుటకును, ఆయన మిమ్ములను కాపాడి యున్నాడు. మీరు సుఖపడవలెననియే కాని, కష్టము నందవలెనని అల్లాకు యిష్టము కాదు. II : 179-181.

మీ భార్యలతో ఉపవాస్య దినముల రాత్రులందు సుఖించుట న్యాయమైయున్నది. మీరువారికిని, వారుమీకును వస్త్రములై యున్నారు. మీకై మీరు చెరుపుకొనుచున్న సంగతి అల్లాకు యెరుకపడియే యున్నది, అందుచేత ఆయన మిమ్ములను క్షమించుచున్నాడు. కాన మీరు వారికడ కేగి, అల్లా మీకొరకేమి నియమించి యున్నాడో వెదకి, తెలతెలవారు దనుక, తినుడి త్రాగుడి. రాత్రియగు వరకుపవసించుచు, మీ భార్యలకడ కేగకుడి, మీ ప్రార్థనాస్థలములయందు తదేకధ్యానరవశులై యుండుడి. ఇది అల్లా ఆజ్ఞయై యున్నది. కాన వారి డ కేగకుడి. ఇవ్విధముగా ప్రజలు భీతిల్లునట్లు అల్లా తమ గమ్యములను విశదీకరించుచున్నాడు. II: 189

నిశ్చయముగా, దానిని, శక్తిగల రాత్రియందు నిరూపించి యున్నాము శక్తిగల రాత్రి అనగా నేమిటో యెటుల నీకు తెలియగలదు? శక్తిగల రాత్రి వేయి నెలలకన్న నెక్కువ. ప్రతివిషయము, ప్రభుల సెలవుగైకొని, దేవదూతలు. ఆత్మ, ఆశక్తిగల రాత్రియందు క్రిందికి దిగివచ్చును. అరుణోదయము వరకు సమాధానముండును. X C VII: 1-5.

## ఇతిహాసములు.

పరిశుద్ధుండగు ప్రవక్తయగు ముహమ్మదిట్లుచ్చరించుచున్నాడు:—

క్షుద్బాధచేత మీహృదయములుజ్వలితములు గాసిందు. ఆకలి దప్పులచేత మిమ్మును మీరు జయించుడి. జఠరాగ్ని దహించుచుండగా, పరలోక గవినితలుపును యెడతెగకతట్టుడి.

కొండెములు చెప్పుట, శుద్ధీకరణాచారమును, ఉపవాసమును కళంకపరచుచున్నది.

ఉపవసించుసాడు, దుర్భాషలాడరాదు, కీడునకు ప్రతి సేయరాదు.

ఉపవసించువాడు, అబద్ధమాడుచుండిన యెడల, వాడ నిరసించుచున్న అన్నపానాదులను అల్లా లెక్కచేయడు. అనగా వాని ఉపవాసమును అంగీకరించడు.

ఉపవసించుచు భక్షించుడి. రాత్రివేళ మేలుకొనియుం డియు నిద్రించుడి. ఏలయనగా మీరు విశేషముగా కష్టించి, రుగ్మత పాల్గాకుండునట్లు, మీ దేహమును మీరు కాపాడుకొనుడి. మీరు కొన్ని సారులు నిద్రించి మీ కనులను సంరక్షించుకొనుడి. మఱియు, మీ భార్యలను మీ స్నేహితులను, మిమ్ము నుచూడవచ్చిన వారిని, మీరు మర్యాదచేసి, వారితో మాట్లాడుచుండుడి. ఇదియు మీవిధియై యున్నది. ఎల్లప్పుడుపవసించువాడు ఉపవసించుట లేదు. నెలకు మూడురోజులుపవసించుట యెల్లప్పుడుపవసించుటతో సమానమై యున్నది. కాన ప్రతి నెలలో మూడురోజులుపవసించుడి.

ఇవ్విధమగు ఉపవాసములెన్నియో కలవు. బైబులు గ్రంథము ప్రకారము మోజస్ నలువది దినములుపవసించెను. వారిపాప పరిహారార్థమై, యూదులు నాతిమొదవ నెల యొక్క పదియవనాడు తప్పక ఉపవసించెదరు. నవనిబంధన, యేసు తాను నలువది దినములుపవసించిన విషాదచరితమును వివరించుచు, తద్వారా తానునుభవించిన ఆత్మబలమును గూర్చి వివరించుచున్నది. ఉపవాసము, ముస్లీముల మూఢాచారములను, సత్యాన్వేషణములనే బహిర్గతము చేయుట లేదుగాని, ఆత్మ తత్వమునకు, దేహారోగ్యమునకు దగిన చికిత్స దీనియందు గలదని, పారంపర్యాచారముగ నిది ప్రకటించుచున్నది. మొత్తము

నకు, యూదులును క్రైస్తవులును ఉపవసించు విధానము, ముస్లీముల ఉపవాసముతో సరితూగుచున్నది. ఇస్లాముమతము ప్రకారము, ముస్లీములు, రంజాను నెలలో, అరుణోదయము నుంచి, అస్తమానము దనుక ఉపవసించుటయే గాక, పలువిధ ములైనదుష్కార్యముల నిషేదించి, అన్నపానాదులను నిరసించి స్త్రీసంభోగమును మరచిపోవలెను. అంతేకాదు, వారిపవిత్రమైన హృదయముల నెట్టి దుర్బుద్ధియు కళంక పరచనియ్యరాదు. వారు నైసర్గికముగా, ఆత్మీయముగా, మానసికముగా, నిత్య జీవవు విందునలీనమైపోయి, ఈ జడప్రపంచమును మరువవలెను.

నెలపొడుపు చూచినవేడనే, ప్రతి ముస్లీము ఉపవసింప బ్రయత్నించవలెను. పసికందులు. ఉన్మాదులు ఉపవసింప బని లేదు. ప్రయాణీకులు, వ్యాధిగ్రస్తులు, పాలికు బిడ్డలు గల్గిన తల్లులు యీవిధి నిర్వర్తింప బనిలేదు. రజస్వలాస్త్రీల ఉపవాస మునకు, ఖాజాయని పేరు, వార్ధక్యముచేత. దేహదౌర్బల్యము చేత, ఉపవసింప లేనివారు, ప్రతి దినమెవరైన నొక పేదవాని కన్నము పెట్టవలెను. బలవంతాన అన్నము తినినను, ముక్కు, చెవులు, తలయందలి గాయములు, వీనిద్వారా మందు సేవిం చినను, విరేచనమునకు యెనిమా వాడినను, వమనముచేసినను ముఖము కడుగునపుడొక నీటిబొట్టైనను గొంతులోకేగినను,

పగలుండగనే, అది రాత్రివేళయని పొరబాటున అన్నము తిని నను, ఉపవాసము, ఉపవాసముగా, పరిగణింప బడదు. ఇట్టి సందర్భములలో విరిగిన ఉపవాసమును సవరించుటకు ఖాజా ఉపవాసము నాచరింపవలయును. ఉపవాసము బనవత్తరముగా నాపిన యెడల, నట్లుచేసినవాడు, తనపాప పరిహారార్థము, ఒక భానిసను విడుదల చేయవలెను: లేక దానికి ప్రతిగా, రెండు నెలల వరకు ప్రతి దినముపవసింప వలయును, లేక అరువది మందికి అన్నధానము చేయవలయును. తెలిసి తెలియక, అన్న పానములారగించినను, ముద్దిడుకొనినను, గడ్డమునకు తైలమం టించుకొనినను, కనులకు కాటుక బెట్టుకొనినను అబేద్యమగు కారణాంతరముల వలస నేదైన రుచిచూచినను ఉపవాసము చెడిపోదు. ఐతే, యేకారణములేక, దేనినైన రుచిచూచినచో, ఉపవాసము పూర్తిగా వర్జముకాదుగాని దానిలో పారిశుద్ధ్య ము కళంకమగుచున్నది. ముస్లీముల ఉపవాస మిశపరిస్థితులపై నాధార పడియున్నది. యూదులు క్రైస్తవులు, ఇరువది నాలుగు గంటలుపవసించెదరు. హిందువులుపవసించుచు, పండ్లు, నీళ్లు, పాలు, ఆరగించు చుందురు. తెల్లవారక పూర్వమే తినునట్టి భోజనము సహ్రీఅనబడును. ఇది సున్నతి విధానము. పూర్వా చార ప్రకారము, ముస్లీముల ఉపవాసము, ఆశీర్వాధకరమై యున్నది. ఇది తక్కిన మతస్థుల ఉపవాసముున కన్నమిన్నయై యున్నది. దీనివలన, దేహాతత్త్వము బలహీనమై ఆరోగ్యము

చెడిపోవునని కొందరందురు. వైద్యపరిషత్ జ్ఞానము వలననై నను, మనస్వంత అనుభవమును బట్టిచూచినను, ఇది సరియగు నభిప్రాయముకాదని గ్రహింపవచ్చును. వయసు మీరినవారు, చిన్నవయసు బిడ్డలు, ఉపవాసమునుంచి మినహా యింపబడిన వారును తప్ప తక్కినవారందరు, ఉపవాసమువలన, నూతనో ద్రేకమును నూతన బలము గలవారగుదురు. వారియుదరము నందలి మలిన పదార్థములు నిర్మూలమై, ఆంతరీయా వయవ ములు సక్రమమగు కార్యక్రమ మవలంభించును. తిండిబోతు తనముచలన కలిగెడి వ్యాధులనుండి, ఉపవసించు మనుజుడు తప్పించు కొనుచున్నాడు.

వీనితోపాటు, ఆత్మీయ, సాంఘిక, నీతిధర్మ సమపాయ ములుకూడా కలుగుచున్నవి. ఉపవాసము, మానవుడు దేవునికి లోబడునట్లు చేయుచున్నది. దేవలక్షణములాతని ఆత్మయందు ప్రతిబింభింప జేయుచున్నది. దేవుడు మోహావేశములచే బంధిం పబడక స్వేచ్ఛాంత రంగుడగు తెరంగున, మానవుడు కూడా కొంతకాలము తనభౌతీక కోర్కెలను దూరపరచు చున్నాడు. మానవుని గర్వము దీనివలన అణగుచున్నది. ఉపవసించుచ తానసుభవించుచున్న కష్టములవలన, పేదసాదలకు గల కష్ట నిష్ఠురముల నాతడు గ్రహించి కరుణించుచున్నాడు. ఇవ్విదము గా, మానవుని యందు నిలుకడమైయున్న దేవలక్షణములు,

ఉన్నతాధములను వేరు జేయుచున్న విచ్ఛిన్న భావమును నిర్మూలించి, వానినేకము చేయుచున్నది. ఇంతేకాదు, సహ్నాన ము, ఓర్పు, తృప్తిమొదలగు సద్గుణములు ఉపవాసలక్షణములై యున్నవి. అన్నపానాదులను విసర్జించి, స్త్రీ సంభోగము నాపి వేయుటయే ముస్లీముల ఉపవాస విధానమని కొందరనకొను చున్నారు. ఇది తప్పుడభిప్రాయము ముస్లీము మతస్థుడు, ఉప వసించునపుడు, తన లౌకికాశలనన్నిటిని బంధించు చున్నాడు. అబద్ధమాడుట, తిట్టుట, కొండెములాడుట, మున్నగు దుర్గుణ ములను 'విసర్జించు చున్నాడు. అబుహురారా అను నాతడు ప్రవక్త యీ విధముగా చెప్పినట్లుదువుచున్నాడు. "వుపవసించు వాడు, అబద్ధమాడుచునేయుండి, అక్రమక్రియలు చేయుచుం డినచో, నాతని ఉపవాస మెన్నికకురాదు; అతడు తనఅన్నపా నాదులను విడువ వలయుననియే దేవుని చిత్తముకాదు."

వుపవసించ వలసినది పగటియందేకాని, దైవధ్యానము రాత్రింబవళ్లైయున్నది. ప్రతి రాత్రి, ఈషా యనబడిన ఫర్ జ్ ప్రార్థనాంతరము, యిరువది వచనములు ( రకత్ ) చదువ వలెను."ఇది నలాతుతరవ్వి"అనబడుచున్నటువంటి సున్నతివిధి. ప్రవక్త కాలాన, యీ పఠనము ప్రత్యేక వ్యక్తులాచరించు చుండిరి కాని, వుమర్ కలీఫా యీవిధి వ్యక్తులు సంఘముగా నేర్పడి పఠించుట మంచిదని నూతనదెరవును జూపెను. తరవ్వి

ప్రార్థన యందు, వుపవసించు ముప్పది దినములలో, వుపవసించువాడు ఖురానంతటి నొక్కసారి పఠించవలయును. ప్రపంచమంతటిలో యీ విధముగా, ఖురాను గ్రంథము కోట్ల కొలది ప్రజలచేత ఒకే నెలయందు ఆద్యంతము పఠింపబడు చున్నది. సర్వలోక సృష్టికర్తకిది మహోన్నతమైన ప్రార్థన మైయున్నది.

రంజానుకు సంబంధించిన మరొకముఖ్యాచారము అనబడిన సున్నతి విధియగు, నాచారము ఇతాకఫ్ ఐయున్నది. ఇతాకఫ్ నాచరించువాడు, మసీదులో, రంజాను యొక్క కడపటి పది దినములు నివసింపవలెను. అత్యావసరమైన పనులకు మాత్రము మసీదు విడచిపోవలయును. దేవునికి సంపూర్ణముగా సమర్పించుకొనవలెను ఔరాదు ధ్యానమునందును, ఖురాను గ్రంథమును పఠించుట యందును, తదితర, మతాచారములను నిర్వర్తించుటయందు నధిక కాలము గడుపవలెను.

ముస్లీముల ఉపవాసమును, సక్రమముగా నవలంభించి నచో, మానవుల లోటుపాటులు అంతరించి మనుజుని, దైవ ధ్యాన పరవశత్వమున బడగొట్టి, ప్రపంచమునందు దేవుని ప్రతినిధియగు కలీఫా పదవినందజేయు చున్నది. ముప్పది దినములు ముగిసిన వెనుక, షవ్వాల్ యొక్క మొదటి దినమ

ముస్లీములు " ఇదుల్ ఫకర్ " బహు ప్రుత్సాహ కరముగా నాచరించెదరు. ఉపవాస దినములయందుగల కష్టపర పరల కోర్చుకొని, జయప్రథముగా కడతేరినందులకీ పండుగ గుర్తై యున్నది. ఈ పండుగ సమయమున, క్రొత్త వస్త్రములు ధరించి, పేదలకన్నదానముచేసి, జకత్ దానమగు సుంకమును పంచిపెట్టి, పరితియూరివారొక్కచో గుమిగూడి, మహాన్నతునికి భహిరంగ పార్థనలర్పించెదరు.

---

# ఏడవ అధ్యాయము
# మిరాజ్ లేక ప్రవక్తయొక్క ఆరోహణము

---

ప్రవక్త యెప్పుడారోహణమైనది నిశ్చయించుట కనేకులనేక విధముల నిర్ణయించుచూ ప్రతికూలమగు నభిప్రాయములను చూపుచున్నారు. వారితో దెబ్బలాడుటలేదు, విమర్శకుడనై వారిపైనిలచుటలేదు. ఎవరేమన్నను, ప్రవక్తయొక్క ఆరోహణము మాత్రము జరిగి తీరినదని చెప్పగలను.

యువకులతో నేకీభవించి కలసిమెలసి తిరుగుట ప్రవక్తకెక్కుడు వాడుక. ఒకరాత్రి యువకులతో కాబాయొక్క గోడకావలి స్థలమగు హాతీం అనుచోట నిద్రించు చుండగా జిబ్రాయీల్ (గాబ్రియేల్) దూత, యితర దూతలతో కలసివచ్చి, ముహమ్మదును తోడ్కొని జంజం భావికడకేగి, అతని యురములపై బట్టలుతీసి, భావిలోనినీటితో దానినికడిగి, రెండు గిన్నెలాతని కొసగెను. ఒకగిన్నెలో మతముండెను రెండవ దానిలో జ్ఞానముండెను. దూతలు గిన్నెలలోనివి ముహమ్మదు హృదయమున బోసిరి. పిదప, అడవి మృగమొకటి

కనబడినది, అది పొడవైనది తెల్లని రంగుగలది. ఊరగాడిద కన్న పెద్దది, కంచరి గాడిదకన్న చిన్నది. దానిపేరు బురాఖ్. ప్రవక్త దానిపైనెక్కి, యెరూషలేమున కేగి. రెండు ప్రార్థనా క్రమములు జరిపెను. ఒకదానిలో పాలు, మరొక దానిలో ద్రాక్షారసము గల్గిన రెండు గిన్నెలాతని కొసగబడెను. ప్రవక్త ద్రాక్షారసము నుల్లంఘించి పాలు త్రాగగా, జిబ్రాయెల్ మెచ్చుకొని " నీవు ద్రాక్షారసమును త్రాగియుండినచో, నీ యనుసరు లందరు తప్పుమార్గమున బడియుండెడివారు " అని యెను. అచ్చటినుండి వైకుంఠమున కేగెను. ప్రథమ వైకుంఠపు ద్వారమును తట్టగా"ఎవరక్కడ"యని ద్వారపాలకుడడగెను. దేవుని దూత నగునేనని జిబ్రాయెల్ ప్రత్యుత్తర మీయగా, నీతో వచ్చిన వారెవరని మరల అడిగెను. ముహమ్మదని జిబ్రాయెల్ చెప్పెను. అతడు పిలువబడెనా యని ద్వారపాలకుడడిగెను. ఔనని జిబ్రాయీలు చెప్పినవెంటనే ద్వారము తెరువ బడెను. ముహమ్మదు లోనికి ప్రవేశించెను. ప్రథమ వైకుంఠమందొక నిండైనమానవుని గాంచెను. అతనికుడియెడమల వైపు అసంఖ్యాకములగు చాయలు కానవచ్చెను. అతడు తన ముఖమును కుడివైపు త్రిప్పినపుడు సంతోష చిహ్నము లాతని ముఖపద్మమున దాండవించుచుండెను, కాని, యెడమ వైపు దిరిగినపుడు దుఃఖితవదనుఁడగుచుండెను. ప్రవక్తనుదాటి పోవుచూ, "పరిశుద్ధతనూభవా, ఓ. పరిశుద్ధుఁడవగు ప్రవక్తా

నీకు స్వాగతము" అని పలికెను. మహమ్మదుకీ చిత్రమగు వ్యక్తినిచూడగా నాశ్చర్యమయ్యెను. జిబ్రాయేలు నివిషయము విశదీకరించుమని వేడుకొనగా, దూతయిట్లుడివెను " నాపితా మహుడగు ఆదాము యీాతడే. లోకమున కీతఁడు మొదటి వాఁడు, అతని కుడియెడమలనున్న ఛాయలాతని సుగుణ దుర్గుణములగు సుతులు. కుడివైపునకు చూచి సంతసించును, యెడమవైపునకు చూచి దుఃఖించును." అచ్చటినుండి ద్వితీయ వైకుంఠమునకేగి, ఈసా ( యేసు ) యూహియా ( బాప్తిస్మమిచ్చు యోహాను ) లను చూచెను. వారిద్దరాతనికి సంతోషముతో స్వాగత మిచ్చిరి. తృతీయ వైకుంఠమున యూసూఫ్ ( యోసేపు ) ను, చతుర్థ వైకుంఠమున ఇద్రీస్ ( ఏనోకు )ను. పంచమ వైకుంఠమున హారూను (ఆహారోను) లను గాంచెను, ప్రతిచోట ప్రవక్తకు తగిన ఆహ్వానము దొరుకుచుండెను ఆరవ వైకుంఠమున, మూసా (మోషె) కనబడి పలుకరించి యేడువ సాగెను. నీవెందుల కేడ్చుచున్నావని యెవరో యొక యదృశ్య వ్యక్తి పలుకుచుండెను: నావుడు మూసా " నాపిదప, ఒక యువకునికి దైవపిలుపు కలిగినది మీారు చూచుటలేదా? అతనిని వెంబడించువారు, నాకన్న యవలీలగా పరలోకమున ప్రవేశింపగలరనెను." ఇట్లు తిరుగుచూ తిరుగుచూ, సప్తమ వైకుంఠమున ప్రవేశించెను. అచ్చట ఇబ్రాహీం (అబ్రహాము)

ముహమ్మదు నాహ్వానించి "భక్తిగల్గిన పవిత్రాత్మ పరిశుద్ధుండవగు కుమారుడా నీకిదే స్వాగతమనెను" విశ్వాసులకు తండ్రియగు అబ్రహాము యితడేయని జిబ్రాయెల్ వెంటనేనుడివెను. ఇబ్రాహిం యొక్క దర్శనము మహామకరమైనది. ఆయన బైతుల్ మమూర్ అను పర్ణశాల నానుకొని యుండెను. ఇది స్వర్గీయుల పర్ణశాల. దీనిలోని కనుదినము డెబ్బదివేల దూతలేగుచుందురు. ఇదిమహా సంతోషకరమగుస్థలము. దానిలోనికి ప్రవేశించి మరలరావీలులేదు. ముహమ్మదు పరలోకపుటుద్యాన వనమున బ్రవేశించి దానిరమ్య స్థలములన్నియు బరికించెను. ఇదైన వెనుక, జిబ్రాయీల్ ముహమ్మదును, "సిద్రాతుల్ మంత్" అనబడిన వృక్షముకడకు తోడ్కొని పోయెను. ఇది పరిహద్దులను ప్రత్యేకించు వృక్షమైయున్నది. ఈవృక్షము ఆకర్షణీయమగు ప్రజ్వలితమును గల్గియుండెను. చెట్టునుదాటి, జిబ్రాయిల్ వెనుకనిలచి "ఇదినాగట్టు, ముందునకొక్కయడుగైన నిడలేను. అడుగు బెట్టితినా బుగ్గియై పోయెద" ననెను. నిర్వీర్యుండైన జిబ్రాయేలు నొక్కమారు దుఃఖిత వదనుడై చూచి, తన బాటవైపు తనకంజూపు నిగిడ్చి, అసంఖ్యాకముగు తెరలనుదాటి, మహాసింహాసనమగు "అర్ష్"ను సమీపించెను. సమీపించుము సమీపించుము అను హెచ్చరిక వాక్యములు వినవచ్చుచుండెను. ముహమ్మదు సమీపించి, లోకములనిర్మాత నీదిగువ విధమున నమస్కరించెను. ముహమ్మదు

సమస్కృతులయందు ఆడంభరములేదు అనావశ్యకశ్లాఘ్యప్రద గుంబనములేదు, ఆవేవన "దేవునికి వినయపూర్వకమగు నమస్కారములు, పరిశుద్ధమగు నభివందనములు." "ఓప్రవక్తా, నీకు నమస్కారములు, దేవునిదయయు నాశీర్వాదములు నీపై నుండును గాక" యని ప్రత్యుత్తరము వినబడెను. అప్పుడు దూతలతి వినయభయభక్తితో నిట్లుచ్చరించిరి. "అల్లా తప్ప వేరొక దేవుడు లేడనియు ముహమ్మదు దేవుని సేవకుడును, భక్తుడునై యున్నాడని మేము సాక్ష్యమిచ్చుచున్నాము." అంతట దేవునికి ముహమ్మదునకు నొక యద్భుతమగు సంభాషణ జరిగినది. అది మానవజ్ఞానము కందరానిదై యున్నది. మాటల చేత నా భాషారహస్యమును వర్ణింప వీలుకాదు. దాని ఆంతరీయము నూహింపనలవికాదు. దేవుడు తాను ప్రత్యేకించుకొనిన ప్రవక్తతో నత్యున్నతమైన వైకుంఠమున ముచ్చటించుటయనగా సామాన్యమగు విషయముకాదు. ఇది భయము నుత్పాదించుచున్నది. ఇది సూచించు సత్యమద్భుతము, ఆగమము. అభేదితమగు రహస్య మీవిషయము నావరించి యున్నది. ఈ నిరుపమాన మహాద్భుత రహస్యమును గ్రహించుటకు మానవమంధబుద్ధి చాలదు. ఈ సంప్రతింపు వలన, దేవుడాశ్చర్యకరమగు బహుమానములను ప్రవక్తకను గ్రహించెను.

ఆవేవన :—

1. ఇస్లాము మతము యొక్క ప్రాముఖ్యమగు సిద్ధాంతములు. ఇవి సూరబఖర్‌లోని కడపటి వచనములు.

2. "షరక్" అనుపాపము చేసినవారు తప్ప తక్కిన వారగు ప్రవక్త ప్రజలందరు క్షమింప బడెదరని దేవుడు వాగ్దత్త మిచ్చెను.

3. ఒకే రాత్రి యందు యేబది ప్రార్థనా క్రమములు పల్లించుట స్థిరీకరింపబడెను.

ప్రవక్త తానవరోహించుచు మూసాను చూచెను. నిన్ననుసరించువారెన్ని ప్రార్థనలు చేయువలసిన నియమమైన దని మూసా అడిగెను. అహోరాత్రములు యేబది ప్రార్థనలని ముహమ్మదు ప్రత్యుత్తర మీయగా, "ఇస్రాయేల్ జనాంగమును నేను పరీక్షించి చూచితిని. నీ ప్రజలుబలహీనులు యేబది ప్రార్థనలు చేయలేరు. ఐదు ప్రార్థనలు మాత్రము విధింపుమని నేను దేవుని నడిగితిని కాన, నీవును భగవంతుని నట్లే తగ్గింపుమని వేడుకొమ్మని" మూసా విన్నవించెను. అట్లడుగుట సిగ్గుకరమగు విషయముగాన నేనట్లు మరల దేవునిని విన్నవించు కొనననని ముహమ్మదు నిరాకరించెను. ప్రవక్త అచ్చటి నుంచి ఎరూషలేమున కేగెను. అచ్చట మోజన్ ఇబ్రాహీములు, తీవ్రమగు ప్రార్థనలర్పించుచుండిరి.

ఈ వైకుంఠ సందర్శనము వలన నూతన పరచబడినవాడై, తన వైకుంఠ పర్యటనానుభవమును, తన ప్రజలకు పూసగుచ్చినట్లు వినిపించెను. అయితే, ఆ మూర్ఖులాతని పలుకులను విశ్వసింపక, పెడచెవినిబెట్టి, ప్రవక్త కల్లలాడుచున్నాడని తిట్టసాగిరి. ప్రవక్త వాస్తవముగా వైకుంఠమున కేగినాడో లేదో యని తెలిసికొనుటకాతని విరోధులు, దూరమందున్న నొక దేవాలయమును గూర్చి తమకు తెలుపమని కోరగా, ప్రవక్త తత్తరిల్లి యేమిచెప్పవలయునో తెలియక యోజించుచుండగా, ఆ దేవాలయ మదృశ్య రూపమున నాతని కనుల కెదురుగా కానవచ్చెను. వెంటనే దేవాలయమును గూర్చి వారడుగుచుండిన ప్రతి ప్రశ్నకు, చక్కని జవాబులిచ్చి వారి కద్భుతమగు నట్లు ప్రవర్తించెను.

ముహమ్మదు ఆరోహణమైనపుడు, బౌతీక దేహముతో వెళ్లెనా, లేక ఆత్మరూపముననరిగెనా, నిద్రించునపుడా. నిద్రించనపుడా యను ప్రశ్నలపై ఉలమాలు వివాదములాడుచుండిరి. అధికసంఖ్యాకులగు ఉలమాలు, దేహధారులై, నిద్రించుచు, ఆరోహణుడయ్యెనని తలంచుచున్నారు. ఈ యభిప్రాయమున కీ దిగువ గొన్ని తార్కాణము లున్నవి:—

ఆరోహణమును గూర్చి ఖురానులో 17వ సూరలో నిట్లున్నది. “ రాత్రియందు, తన సేవకునిని, హరాము మసీదు

నుంచి, అక్సా మసీదునకు గొని పోయిన వానికి స్తుతులు చెల్లును గాక. " సేవకుడను పదమునకు " అబ్ద్ " అను అరబ్బీ పద మువయోగింప బడినది. ఈ పదము దేహము ఆత్మ అని అర్థమి చ్చుచున్నది. కాన దేహరూపమున నారోహణుండయ్యెనని సిద్ధీకరించుటకేమి సంశయమున్నది? ఆత్మీయమైన ఆరోహణ మేయైనచో నా మూర్ఖులు సంశయింపక పోయెడి వారే. అది ఆత్మీయమైన ఆరోహణమైనను, లేక కలలోని దర్శనమైనను మైయుండిన, వారు తప్పక విశ్వసించి యుండెడివారె. ఆరో హణమగు నపుడు ప్రవక్త, పాలు త్రాగి బురాఖ్ అను మృగము నెక్కుటవలన, ఆత్మరూపమునన్నప్పుడిది వీలుపడదు. ఆత్మరూపమున నున్నపుడు, పాలు త్రాగుటయు, బురాఖ్ నెక్కుటయు, నవసరమగు క్రియలు కావు. దేహధారులై వైకుంఠ యాత్ర జేయుట సాధ్యమయ్యెడు పనిగాదనియు నట్లు జరిగియుండెనని తలంచుట, నిర్హేతుకమైనదనియు నశాస్త్రీయ మైనదియునగు నాలోచనయని నేటి విద్యావంతులైన ముస్లీ ములనుచున్నారు. ఇవ్విధముగా తలంచువారు, తమ తీర్మా నముల గనించక అటుబెట్టి, యీ నాగరికతా యుగమున వెలువడుచున్న ఆత్మీయమగు కార్య సిద్ధిని యూహించుట సమంజసము, యోగాభ్యాసమునకు జెందినటువంటి మెస్మరి జం, హిప్నటిజం అను మనోనిశ్చల తాత్పర్య వసానాభ్యాసము వలన, జడభూతములపై నాధార పడియుండువారు కూడా

భ్రమించి తారు మారగుచు, వానిరహస్యము గ్రహింప జాలక యున్నారు. హృదయ రహస్యముల నవలీలగా దెలిసికొనుచు న్నారు. కడుదవ్వులనున్నవారి వ్యాధులనుకూడ బాగుచేయుచు న్నారు. అచేతనమగువస్తువులకు చలన శక్తిగలిగించుచున్నారు. ఎఱుక పడకయే మనుజులు యితరులవైపు అకర్షింపబడుచు న్నారు. స్వార్థపరాయణులును, మర్త్యులునగు జీవాత్మ తత్వ విశారదులే యిట్టిఅద్భుత కార్యములను చేయుగలిగినచో, భక్తులు వీరికిమించిన కార్యములు చేయగలరన్ని నాశ్చర్యపడవలసిన కారణమేమున్నది! ప్రతిక్రియ కారణసహితమైనదనియు కారణరహితముగానేదియు కలుగదనియు తలంచువారు, దేహధారుడై మహమ్మదు ఆరోహణమైనాడనుట, సహేతుకమైన నైసర్గికక్రియ కాజాలదనియు, నది అస్వాభావికమగు పనియనియు దలంచి, నమ్మకున్నారు. వారి తెలివి తేటలు సంకుచితమైనవి. ఖగోళ మండలంబున నొక తోకచుక్కను చూడలేక, పసిబిడ్డ, తోకచుక్కలేదనియే చెప్పుచుండును. అమాయకత్వమువలన, ఉన్నదానిని లేదన్న నది లేక పోవునా ? వీరి తెలివి అటులనే యున్నది. దైవ నియమములు మానవ దృష్టికగోచరములు. మన నమ్మిక ప్రకారము, అద్భుతములు దేవునిహస్తకృత్యములు, వానిని మనము నమ్మవలసి యున్నది. దేవుని నామోదించు వారి ఘనత కొఱకు, కొన్ని మారులు అస్వా

భావికముగ ప్రకృతిని వికృత చెరవుల నడపించుచున్నాడు. ఈ ఆరోహణము కూడ, దేవునికి గలశక్తి నుద్ఘోషించెడు నొక సూచనయే. ఖురాను ప్రకారము, దేవుడే ముహమ్మదును, హారాము మసీదు నుంచి ఆక్సా మసీదు వరకు గొంపోయెను. ఈ విషయమును, తప్పుడు దారుల ద్రొక్కక, సాదర హృదయముతో విచారించి చూచిన యెడల, విరోధులైనను, సత్వరితగతి తృప్తి జెందగలరు.

## ఆరోహణము యొక్క ఫలితము.

ఆరోహణము వలన, ప్రవక్తకు, అబ్రహాము, యేసు, మోషె మొదలగు ప్రవక్తలను చూడగలిగెను. వైకుంఠ పురమునందలి చిత్రవిచిత్రములను జూచెను. మానవులు కాదుగదా కడకు దేవ దూతలైన ప్రవేశింప వీలు లేనటువంటి పరిశుద్ధ స్థలమున కేగెను. అచ్చట మహాద్భుతమగు సంభాషణ దేవునికి ప్రవక్తకు జరిగినది. ఆయన మరలి వచ్చిన పిదప, విశేషమగు నాశీర్వచనము లనుభవించెను. వైకుంఠ రహస్యమును కనులార చూచి, ప్రజలకు చెప్పిన వారు యీ ప్రవక్త తప్ప మరెవరు ప్రపంచమున లేరు. చూచిన సంగతులాతడు ప్రజలకు ముఖాముఖిగా వినిపించెను. ఇది అద్భుతమగు సేవకదా!

# ఎనిమిదవ అధ్యాయము.

## ఇస్లాము మత సిద్ధాంతములు.

---

(ఇస్లాము మతసార సంగ్రహ బోధనాక్రమము యీ దిగువ నుదహరింప బడినది)

### ఇస్లాము మతము, సమాధానకరమగు మతము:—

ఇస్లాము అను పదమునకు మూడర్థములు కలవు. 1. సమాధానము. 2. సమాధానమునకు మార్గము. 3. విధేయత, ఇతరులకు విధేయులగు నప్పుడు సమాధాన మనేది కుదురగలదు. కాని యీ సందర్భములో దేవుని చిత్తమునకు విధేయత చూపుట యైయున్నది.

### మతము యొక్క- ఉద్దేశము.

ఈ మతము నవలంభించువారికి, పరిపూర్ణమగు [illegible] ధర్మశాస్త్రము కలదు. దాని మూలమున వారున్నతాదర్శ ప్రాయులై మానవుని యందలి సుగుణములను గుర్తించగలరు. ఇందు మూలముగా సమాధానము ప్రజలయందు వెంపార గలదు.

ఇస్లాము మత ప్రవక్తలు.

సాధారణముగా, ఇస్లాము ప్రవక్త యనిపించుకొనిన ముహమ్మదు, అంతిమ 'ప్రవక్త యైయున్నాడు. అబ్రహాము, మోషే, ఏసు మొదలగు ప్రవక్తలు, మానవులను సన్మార్గమున నడిపింప భగవంతుడు పంపినట్లు, వారినందరిని ఇస్లాము మతస్థులు సన్మానించుచున్నారు.

ఖురాను గ్రంధము.

ముస్లీముల వేధము ఖురానై యున్నది. ప్రతివేద గ్రంధము భగవంతుని ప్రేరితమున వెలువడినదని ముస్లీములు నమ్ముచున్నారు కాని, మానవులు యేతద్గ్రంధములను. చెడ గొట్టుట వలన, నీ కడపటి వేదగ్రంధమగు ఖురాను, పూర్వపు గ్రంధములను సవరించునదై వెలసినది.

ఇస్లాము మత విశ్వాస సూత్రములు. ఈ సూత్రములు యేడు. అవేవన. 1. అల్లా. 2. దేవదూతలు. 3. దేవుని వలన కలిగిన గ్రంధములు. 4. దేవుని వార్తావాహులు. 5. రాబోవు కాలము, 6. మంచి చెడ్డల తీర్పు. 7. మరణానంతరమున జీవించుట.

మరణించిన పిదప జీవించుట ఇస్లాము మతమునందొక క్రొత్త విశ్వాసము కాదు. బ్రదికియున్న జీవమే మరణానంతరము కూడ ప్రభలుచుండును గాని పునర్జన్మ కాదు. ఇందు

వలన, దాచబడి యుండిన సత్యములు వెలుగునకు వచ్చు చున్నవి. ఈ ఆత్మజీవనము అంతములేని అభివృద్ధిగలదై యున్నది. ఈ యభివృద్ధి కొరకు కష్టించువారు పరలోకమున ప్రవేశించెదరు. పరలోకమనగా, మరిశించిన పిదప, నభివృద్ధి పొందుచుండు జీవితమై యున్నది. దుర్మార్గక్రియల వలన, తమ ఆత్మశక్తులను పాడుజేసుకొనువారు, నరక ప్రాప్తులయ్యెదరు. ఈ జీవితము ప్రళయకాలపు బాధనైనను, వైకుంఠ సౌఖ్యము నైనను గ్రహింపజాలదు. అందువలన, వారు తమ దుష్క్రియ లను విడచిపెట్టి వైకుంఠ ప్రాప్తులు కాజాలకపోదురు. నరజీవి తము నందుండగా, ఆత్మలెట్లుండునో మరణానంతరము కూడా, బొందులు మాత్రము లేక ఆత్మలు జీవించుచునే యుండును.

ఆరవ సూత్రమును కొందరు చక్కగా గ్రహింపజాలక కర్మగ్రహాచార మనుకొందురు. అది కర్మ కాదు, పూర్వ జన్మ ఫలము కాదు. మంచి చెడ్డలను వితర్కించునట్టి తీర్పై యున్నది. దేవునిచేత నిర్మింపబడిన దెల్లయు, దేని స్థలము నకది, కాలానుకూలముగ నుపయుక్తమైనదై యున్నది. ఈ క్రమము నుల్లంఘించిన బాధ వేధన సంభవించుచున్నది.

ఇస్లాము మత స్తంభములు. ఇవి ఐదై యున్నవి. 1. దేవుడొకడే యని నమ్మి, ముహమ్మదు దేవుని వార్తావాహుడని విశ్వసించుట. 2. ప్రార్థన. 3. ఉపవాసము. 4. దానధర్మము. 5. మక్కాపుణ్యక్షేత్ర యాత్ర.

దైవత్వము, ముస్లీములు ఏక దేవుని నారాధించు చున్నారు. ఆయన, సర్వశక్తిగలవాడు, సర్వమెరిగినవాడు, సంపూర్ణముగ న్యాయస్థుఁడు, సకలలోకముల సంరక్షకుఁడు, స్నేహితుఁడు, నడిపించువాఁడు, సహాయకుఁడు. ఆయనవంటి వారెవరు లేరు. ఆయనతో భాగస్తులెవరు లేరు. ఆయన ఒకరికి జన్మించలేదు. ఆయనకు, కుమారులైనను కుమార్తెయైనను కలుగలేదు. ఆయన విభాగింపనలవికాని వ్యక్తియై యున్నాడు. ఆయన భూనభములకు వెలుగై యున్నాడు. ఆయన ప్రేమగలవాడు, కనికర హృదయుఁడు, మహిమ సంపూర్ణుడు ఉన్నతుఁడు రూపలావణ్యుఁడు, నిరంతరముండువాడు, అంతములేనివాడు, ఆద్యంతమైనవాఁడు.

విశ్వాసము-క్రియా సాధనము. క్రియాశూన్యమగు విశ్వాసము నిష్ఫలము. కార్యరూపమవదరింపని విశ్వాసము వ్యర్థము. ముస్లీములు తమ క్రియల చొప్పున, యీ లోకమున, పరలోకమున ప్రతి ఫలము దొరుకునని నమ్ముదురు. ఎవరిభారము వారే భరింపవలెను, ఒకరి పాపము లొకరు వహింపజాలరు.

స్లాము మతము నందలి నీతినియమములు. "దేవగుణములు నీలో ఇముడ్చుకొనిమ్ము" అని ప్రవక్త చెప్పుచున్నాడు. దేవుడు మానవ స్వరూపము గలవాడు, ఆయన గుణలక్షణములు ముస్లీముల నీతిధర్మములై యున్నవి. దైవలక్షణములనుగలిగి జీవించుటయే ముస్లీముల పరిశుద్ధజీవితము; అట్లుకానినడవడి పాపమైయున్నది.

ఇస్లాము మతము నందు మనుజునికి గల శక్తులు. మానవుడు పుట్టుకతో, పాపరహితుఁడనియు, పరిశుభ్రముగా సృష్టింపబడెనని యు, అనంతమగు నభివృద్ధి పొందగలడనియు, దేవదూతల కన్న నధికుఁడై, దైవత్వమునకు సమీపించగలడనియు, ముస్లీ మువారు నమ్ముచున్నారు.

ఇస్లాము మతమున స్త్రీల పరిస్థితి. స్త్రీపురుషులొకే పథార్థమునుంచి వెలసియున్నారు. ఒకే విధమగు నాత్మవారికి గలదు. మాన సిక, ఆత్మీయ, నీతి ధర్మవిచక్షణాభి వృద్ధినొందుటకు సమాన మగు శక్తులను గల్గియున్నారు. ఒకరి యందొకరు అన్యోన్యా ను రాగముగలవారై యుండునట్లు, యిస్లాము మతము, స్త్రీ పురుషు లొండొరులపై నాధారపడి యుండ జేయుచున్నది.

మానవకోటి సమహితత్వము, ఇస్లాము మతమునందలి సోదర భావము.

మానవులందరు సమానులనియు దేవుడొక్కడేననియు బోధించు మతము యిస్లాము మతము. వంశావళి, ధనము, కుటుంబ గౌరవము పారంపర్యాచారములు, మంచి తనము, మానవ సేవ, నిజమగు యోగ్యతలు, మానవులందరొకే కుటుంబికులనియు, నల్లనివారిని తెల్లని వారినొక్క రేవున నీలు దాగ్రిపుట ఇస్లాము మతముననే యెఱుక.

న్యాయతీర్పున వ్యక్తిత్వము. ఎవరికి వారే తీర్పుతీర్చుకొనుట మంచిదని యిస్లాము మతము ప్రోత్సహించు చున్నది. ఈశక్తి దేవుని దీవనయని ముహమ్మదు చెప్పుచున్నాడు.

<u>జ్ఞానము,</u> జ్ఞానాన్వేషణము యిస్లాము మతమున నొకవిధియై యున్నది. జ్ఞానార్జనమే, మనుజులను దేవదూతలకన్న నధికులను జేయుచున్నది.

<u>కార్మిక ప్రాశస్త్యము.</u> మనుజుడు గౌరవనీయమగు జీవనము నడుపుటకే పనిజేసినను మంచిదే. సోమరితనము పాపము.

<u>ధర్మము.</u> ఇరుగు పొరుగుల సహాయార్థమై వలసినన్ని వరములు దేవుడు మానవుని కొసగుచు వానిని మానవుడు కాపాడు కొనవలెనని నిరీక్షించుచున్నాడు. ఒరులకొఱకు జీవించుట మనుజుని విధియైయున్నది. ముఖము జూచి దానము చేయరాదు. ఇస్లాముమతమున దానము మనుజుని దేవుని సమీపింప జేయుచున్నది. దానముచేయుటయు, భిక్షము పెట్టుటయు ధర్మసమ్మతములై యున్నవి. ప్రతిమానవుడు నియమమునకు మించిన ధనము నార్జించినచో, నాతడు, పేదలకొఱకు సుంకమువలె యిచ్చుటకొరకు కట్టడనియమింప బడియున్నది.



---

జ్ఞానము, జ్ఞానాన్వేషణము యిస్లాము మతమున నొకవిధియై యున్నది. జ్ఞానార్జనమే, మనుజులను దేవదూతలకన్న నధికుల ను జేయుచున్నది.

కార్మిక ప్రాశస్త్యము. మనుజుడు గౌరవనీయమగు జీవనము నడుపుటకే పనిజేసినను మంచిదే. సోమరితనము పాపము.

ధర్మము. ఇరుగు పొరుగుల సహాయార్థమై వలసినన్ని వర ములు దేవుడు మానవుని కొసగుచు వానిని మానవుడు కా పాడు కొనవలెనని నిరీక్షించుచున్నాడు. ఒరులకొఱకు జీవించు ట మనుజుని విధియైయున్నది. ముఖము జూచి దానము చేయ రాదు. ఇస్లాముమతమున దానము మనుజుని దేవుని సమీపింప జేయుచున్నది. దానముచేయుటయు, బిక్షము పెట్టుటయు ధర్మ సమ్మతములై యున్నవి. ప్రతిమానవుడు నియమమునకు మిం చిన ధనము నార్జించినచో, నాతడు, పేదలకొఱకు సుంకముగ లె యిచ్చుటకాక కట్టడనియమింప బడియున్నది.

